భారతి

సంపుటము 25 | మార్చి, 1948 | సంచిక 3

సర్వజిత్తు మాఘము

# పురుషోత్తమాస్తమయము

— శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి —

"మన సారథి మన సచివుడు
మన వియ్యము మన సఖుండు మన బాంధవుడున్
మన విభుడు గురుడు దేవర
మనలను విడనాడి చనియె మనుజాధీశా!"

అను పద్యమ్ములు గుండెలో కదలి దుఃఖావేశబాష్పోష్ణవాః
కణముల్ చెక్కుల చాఱచాఱలయి రాగా కృష్ణనిర్యాణపుం
ఘననిర్వేదకథావిధమ్ము కనులం గట్టెన్ కిరాతాస్త్రమే
మన బాపూజినిగూడ మ్రింగెనకటా? ఏమో దైవసంకల్పముల్!

చనెనా? భారతగౌరవైకకృతదీక్షాకంకణస్వామి, యే
గెనటోయీ పరిరబ్ధశత్రుసుహృదేకీభూతవత్సుండు, పో

మె నటయ్యా పతితార్తదీనజనసాహిత్యక్రియాలోలుడా
మన 'బాపూ' మహితాత్ము, డింక గనలేమా భారతోర్వీతలిన్?

ఆఫ్రికాహైందవవ్యథ మాన్ప దివురు మహోద్యమమ్మున నెత్తు రోడ్చి ఓడ్చి,
తెలిపులికటుకుకోఱల కండనై చిక్కు భారతావనికినై పోరి పోరి,
శ్వసృగాలములకన్న పరిహీనులన్న సోదరులకై కన్నీట దడిసి తడిసి,
ఇస్లాము పేరింటి హింసాకళంకమ్ము అడరు శాంత్యమృతాన కడిగి కడిగి,
కలలలో వెల్గు స్వాతంత్ర్యకలితకాంతి-కంటబడినంతనే మోరకంట జూచి
పూలరథ మెక్కి యెచటికో పోవుచుంటి-వయ్య! మహితాత్మ! మరి రాని యాత్ర
-దగిలి—

ఈవు మృతుండవైతి వన నెవ్వరు నమ్మదు రో మహాత్మ! క్రొం
బూవుల తేరిపై వెడలిపోవు మహోజ్జ్వలమూర్తి! భారతీ
యావనిలోన శాంతి సుఖ మన్నది చచ్చెను గాని- ధర్మపుం
భావన చచ్చెగాని- యనిమాత్ర మనందగు నేటినుండియున్.

నెత్రు ధారవోసి నిజదేశదాస్యమ్ము
తరిమి, భాగ్య మిచ్చి తనిపినావు;
అగ్నిగోళకముల కాహుతిగావించి
మించి నిన్ను గారవించినాము.

నీజాతీయుల కింకమీదయిన అంధీభావగంధమ్ము బా
పూజీ! శాంతిలుగాక భారతజనుల్ ముస్లింప్రజానీకమున్
నీ జీవమ్ములు నెత్రుతో విడిన సందేశమ్ము కన్నీళ్లతో
పూజంజేయ, పరస్పరాభ్యుదయవిస్ఫూర్తుల్ మనుంగావుతన్



# గాంధినవభాస్కర! అస్తమించితే?

శ్రీ పళ్లె పూర్ణ ప్రజ్ఞాచార్యులు

చిఱునవు మొల్క లాస్యసరసీరుహసీమల లాస్యమూడ ని
బ్బరముగ నీవు భారతశుభప్రతిపత్తిని జూడ నూటిపై
ఇఱువది వత్సరంబులు మహిన్ విలసిల్లుదు వంచుఁ బల్క సం
బరపడినాము; గాంధినవభాస్కర! అప్పుడె యస్తమించితే?

పొరిఁబొరి నంబరంబున నభోమణి వెల్గెడుఁగాక, ఆ నిశా
కరుఁడును రేల వెన్నెలలఁ గాయుత, భారతభాగ్యదేవతా
వరుఁడవు నీవు లేమి గుణవారిధి! జీవిత మంధకారబం
ధుర మయి పోయెఁ ద్వద్విరహదుఃఖము లోక మెటుల్ భరించునో!

కరములు దోయిలించుచు జగజ్జను లెల్లరు నర్ఘ్య మిచ్చి యా
దరమున లోకబంధు వని దండముఁ బెట్టఁగ సత్పథస్థితిన్
ధరణిఁ బవిత్రమున్ సలిపి ధర్మపథంబున నిల్పి లోకమున్
మఱుఁగయి పోతిరొక్కొ యొకమాటె మహాత్ముఁడ! నీవు సూర్యుఁడున్?

అకుటిలచారువృత్త మనహంకృతిపాత్రము మాతృదేశపూ
జకసహకారినాయకము సత్యదయానయశాంతిదాంతిబో
ధకము స్వరాజ్యసాధనసముదాత్త మహింసము గాంధిముఖ్యనా
యకము విషాదనాటక మహో! ముగిసెన్ భరతోక్తిశూన్యమై.

కడిగొనఁ బ్రాణదాత లటు గన్పడుచున్ బ్రతిబంధకంబు లె
వ్వఁడు నెవో సల్పుచున్ బొరుగుపోరులు దెచ్చుచు దుండగంబు లే
ర్పడఁ గడముట్టఁజేసితిరె భారతదేశమణిప్రదీపమున్?
పడమటి గాడ్పులార! యిది పాయని పాపము నవ్వఁబోకుఁడీ.

---

# వైకుంఠయాత్ర

•

— శ్రీ గొ. రమాకాంతాచార్యులు —

యామునతీర్థసన్నిధిఁ బ్రయాణము గట్టి, యనంతవీథి, శ్రీ
రామసహస్రసంస్మృతిపరంపర నీలపు మెట్లుగాఁ బర
వ్యోమముదాఁక నెక్కి, యట వ్యోమమణీకరదీపకాంతిలోఁ
బ్రామినుకుల్ సరస్వతికృపల్ బళియించియు, విష్ణుపాదజ
శ్రీమహనీయగాంగలహరీహృదభంగత్రివేణిసంగమ
ప్రేమరసార్ద్రపావనపరీమళయుక్తిఁ, గవేరకన్యకా
క్షేమవిశాలగర్భమున శ్రీఘనరంగవికుంఠనాథలీ
లామహితప్రసాదరుచిలాలనసహార్దకృపావిలాసకే
ళీముదితాంతరంగసఫలీకృతజన్మముతో, ముకుందగీ
తామధురామృతానుభవదర్పణభూతశుభాద్రిచెంత, శో
భామయఘట్టశ్రీవిజయవాటిఁ బ్రపూతసమీరపోతమా
లామృదుగానలోలబుధలాలితతీరవిరాజమానకృ
ష్ణామలదివ్యజీవనహృదంతరమందు విలీనమై, పరం
ధామములో సుఖింపుము, సుధామయశాశ్వతమోదపూర్తి, నో
స్వామి! మహాత్మ! గాంధి! నవభారతవర్ష మితోభివృద్ధిగా
క్షేమము, కీర్తి, సంపదలచే విలసిల్ల ననుగ్రహింపు; నీ
నామ, మహింస, సత్యము, ననంతప్రశాంతముతోడ బద్ధమై
భూమి సమస్తదేశముల భూరియశోమయగోపురప్రభా
స్తోమశిలాంకితంబగుత; తోయధులున్, నదులున్, మహాగుహల్
వేమఱు నైతిహాసికపవిత్రకథాళిఁ బ్రతిధ్వనించుతన్!





# శ్రద్ధాంజలి

శ్రీ తణికెళ్ల వీరభద్రుడు

జగత్ప్రసిద్ధుడును, సత్యసంధుడును, దయాస్వరూపుడును, త్యాగమూర్తియు నగు నొక మహాపురుషుడు అవతారమును జాలించెను. లోకారాధ్యుడను నీ మహావ్యక్తి మన దేశమందు జననమొందుటచే నది మన పుణ్యఫల మని గర్వోత్సాహములతో నుంటిమి. కాని మందభాగ్యుల మగుటంజేసి అతనిని గోల్పోయితిమి. అంతే కాదు. దుర్మార్గులమై చేతులార సంహరించునంతటి రాక్షసకృత్యమునకు బాల్పడితిమి.

గాంధీమహాత్ముడు భౌతిక దేహమును వీడె నను హృదయవిచ్ఛేదన మొనరించు దుర్వార్త వినినంతనే ఒక్కటి మనలో జాలమందికి స్ఫురించినది. శ్రీరామునికి సీతవలె, హరిశ్చంద్రునికి చంద్రమతివలె, పతిని దైవముగా దలచి, అతనికి దోడునీడయయి లోకహితార్థము నాథునితో నష్టకష్టములంబడిన శ్రీమతి కస్తూరీదేవి కొంచెము ముందుగానే దివి కేగుట. హిందూ నారీమణులు సామాన్యముగా భర్తతో నెన్ని సౌఖ్యముల భోగించినను భూతలమును విడువవలసివచ్చినపుడు ఒక్కదినమైన నాతనికంటె ముందుగా బోవలె నని యభిలషింతురు. సువాసినీత్వముతో, పసుపుకుంకుమలతో, భర్తచేతిలో వెళ్ళుట పుణ్యమని వారి యూహ. ఆ మహానందము పతివ్రతాశిరోమణియగు కస్తూరీబాయికి లభించినది. లేనిచో నీ పరిస్థితులయం దా మహాతల్లి సజీవురాలయియున్నయెడల, ఇప్పటికే పట్టశక్యము కాని భారతదేశపు దుఃఖ మెంత దుర్భరముగా నుండెడిదో యెవ్వ రూహింపగలరు?

---

* ఈ శ్రద్ధాంజలి మహాత్ముని నిర్యాణమును గూర్చి సికందరాబాదులో ౬-౨-౧౯౪౮ నాడు జరిగిన మహాసభలో సమర్పింపబడినది.

గాంధీమహాత్ముడు బాలురలో బాలుడు. పెద్దలలో పెద్ద. రాజకీయవేత్తలలో రాజనీతినిపుణుడు. జ్ఞానులలో జ్ఞాని. ధర్మాభిలాషులకు ధర్మనిరతుడు. త్యాగశీలురకు బరమవిరాగి. కవులకు కవి. హాస్యప్రియులకు హాస్యరసప్రధానుడు. భక్తులకు భగవదంశసంభూతుడు. దీనులకు కల్పవృక్షము. వేయేల, అతడు పరిపూర్ణుడు. ప్రపంచ మాతని సత్తమపురుషుడని యెంచినది కాని, మన కాతడు పురుషోత్తముడు. విద్యాధికులేమి, పామరులేమి అతని గాలి సోకినంతమాత్రమున నూతనవికాసమును బొందెదరని చెప్పుట యతిశయోక్తి కానేరదు. గోఖలే మహాశయుని గూర్చి మనము విని యున్నాము. అతడసాధారణ మేధాశక్తిసంపన్నుడు. అసమానరాజనీతికోవిదుడు. అచంచల దేశభక్తుడు. ఒకానొకప్పు డీతడు దక్షిణాఫ్రికాలో నిడుములు పడుచున్న మన దేశీయుల పరిస్థితులను గమనించి యా దొరతనపు వారితో రాయబారమును నలుపుటకు భారతదేశ ప్రతినిధిగా బంపబడెను. అవి గోపాలకృష్ణ గోఖలే మంచి యుచ్చదశయందున్న దినములు. అత డాఫ్రికా నుండి స్వదేశమునకు దిరిగివచ్చిన వెంటనే, బొంబాయిలో నాతని గౌరవార్థ మొకమహాసభ గావింపబడెను. ఆఫ్రికాలో గాంధిచే తీవ్రతతో నడుపబడుచున్న సత్యాగ్రహోద్యమమును కన్నులార జూచినవాడగుటచే, గోఖలే యాతనియెడల దనకు గలభక్తి నీవిధముగ వెల్లడించెను: "నా కిద్దఱు గురువులు. నా జీవితమును పవిత్రముగాను, తేజోవంతముగాను జేసినది యిరువురు మహానుభావులు. ఒకరు మహాదేవగోవిందరానడే; రెండవ వ్యక్తి మోహనదాస కరంచందు గాంధీ."

గాంధీమహాత్మునికి ఒకటి తెలియును, మఱియొకటి తెలియదు అని చెప్పుట కవకాశము కాన్పింపదు. ఇతను చదివినది ప్రవేశపరీక్షవఱకే. కాని యాంగ్ల భాషారచనయం దెట్టి సమర్థత కలదో తిలకింపుడు. కొంతకాలము క్రిందట నే నొకసారి శ్రీమతి సరోజినీదేవిని దర్శింపబోయితిని. ఆ యిష్టాగోష్ఠిలో మహాత్ముని సుగుణసంపద ప్రసంగవశాత్తూ వచ్చెను. అంతలో నాయమ, "ఇది సరే కాని, వీరభద్రుడూ, మహాత్ముని ఆంగ్ల రచనాశైలివంటి శైలి నాంగ్లవాఙ్మయములో నీ వెక్కడనైన జూచితివా" అని చిరునగవుతో నన్నడిగెను. ఆంగ్లభాష సరోజినీదేవిసొమ్ము. ఆ భాషావిషయములో నపరసరస్వతియను నాపేరు యశస్సు పొంద, అల్పుడనగు నే నేమి చెప్పగలను? ఒకనిమిషమునకు ధైర్యము దెచ్చికొని, "అమ్మా, నీవు సెలవిచ్చునది వాస్తవము. అట్టి ప్రజ్ఞ యక్కడక్కడ షేక్స్పియరువంటి మహాకవులందు కనబడవచ్చును. కాని, బైబిలులోదప్ప మఱియొక్కడను గాంచుట దుర్లభ" మంటిని. ఆ శైలిమాధుర్యము, సూత్రప్రాయములగు నా వాక్యముల సొంపు, ఆ పదముల యౌచిత్యము, వాని సౌలభ్యము, వాని గర్భీకృతభావము—వీనిని మఱియొక్కడ జూడగలము?

ఇవన్నియు నొకయెత్తును, నిరుపేదలకు నాతడు చేసిన కృషి మఱియొక యెత్తును. అతని కార్యక్రమములోని యన్ని యంశములును దరిద్రులను సంరక్షించుటకే యేర్పాటయినవి. ఒకటి, ప్రజలందఱును మనదేశమందు వడకిన నూలుతో మన దేశమందే నేయబడిన బట్టను గట్టుకొనుట. అనగా మన దేశమునుండి పరదేశములకు స్వర్ణవాహిని కవకాశముండదు. ఆ ధనమంతయు కాయకష్టములతో బనిచేయువారికి మన దేశమందే పంచిపెట్టబడును. సామాన్యులకు సహితము కూడుగుడ్డలకు లోపముండదు. రెండవది మద్యపాననిషేధము. సాధారణముగా కూలినాలి చేసికొని బ్రదుకు పేదవాడు తా నొక రూపాయిని దినమునకు సంపాదించెనా, దానిలో సగమో, మూడువంతులో కల్లంగడికి బోసి మిగిలినదానినే పిల్లలనిమిత్త మింటికి దీసికొనిపోవుట తటస్థించుచున్నది. ఈ నిషావస్తువులను మానితిమా, మన కన్నవస్త్రములకు లోటుండదు. మూడవది అస్పృశ్యతానివారణము. నిమ్నజాతులని, హరిజనులని చెప్పబడువారిని దూరముగా బారదోలక, వారియెడ సానుభూతి జూపి, వారికి శుచిశుభ్రతలను నేర్పి, హిందూధర్మమును నిలిపి, హిందూసంఘమునకు దాపరించిన యపకీర్తిని దొలగించుట. ఈ హరిజనులలో నధికసంఖ్యాకులు ధనవిహీనులగుటచేతను, ఈ ఉద్యమ

మును పేదల నుద్ధరించుటకే యుద్దేశింపబడినది. గాంధీ మహాత్ము డనగా దరిద్రనారాయణుడు. కావుననే, ఈ మహనీయుని భౌతిక దేహమునకు నుత్తరక్రియలు జరిగిననాడు, పావనయమునానదీతీరమునకు పురుషులేమి, స్త్రీలేమి, బాలురేమి—పదిలక్షలమంది వచ్చి, ఎండయనక, కొండ యనక, ఉదయమునుండి సాయంతనమువఱకును ఆ పూతచరితుని స్మరించుచు నిలువబడియుండుట. పుష్పాదిభక్తిసూచకములగు పదార్థముల నాతని పాదములకడ నర్పించుట. ఢిల్లీ నగరమునకు బదిక్రోసుల దూరమున నున్న గొల్లలు కొందఱీ మహనీయుని నిర్యాణవార్త వినినంతనే తమ గ్రామమునుండి పయనమై తమయొద్దనున్న ఆవునేతిని డబ్బాలలో బోసి దాని నీ పుణ్యపురుషుని దహనసంస్కారమున కుపయోగింపమని కోరిరట! పూర్వము సూర్యవంశపు రాజులలో ప్రతిభాశాలియగు దిలీపమహారాజు తన కులగురువగు వసిష్ఠునితో కష్టనిష్ఠురములను దలపోసికొనుటకు భార్యాసమేతుడయి పోవుతఱి, మార్గమధ్యమున నున్న పల్లెలలో నివసించు పెద్దగొల్లలాతని దర్శించి, ఆ పూట చేసిన వెన్న కాచి, యా యావునేతిని దెచ్చి, తమ పరిపాలకునికి కానుకగా సమర్పించిరనియు, వారిని మహారాజు కుశలప్రశ్న చేసెననియు కాళిదాసకవి—

"హైయంగవీన మాదాయ
ఘోషవృద్ధా నుపస్థితాన్,
నామధేయాని పృచ్ఛంతౌ
వన్యానాం మార్గశాఖినాం"

అని వర్ణించియున్నాడు. "రిక్తహస్తేన నోపేయా" దను సంప్రదాయమును బట్టి, చక్రవర్తియే కాక దైవమును, గురువును నగు మహాత్ముని దర్శింపబోవువారు వట్టిచేతులతో నెట్లు పోగలరు?

ఇట్టి సర్వకళాప్రపూర్ణుని పోగొట్టుకొనుటకంటె దురదృష్ట మే మున్నది? ఇతడు మనకు రాజాధిరాజు, పరమస్వరాట్. ఇట్టివాడు మన కన్నటికి దిరిగి రాగలడు? హిందూదేశము, హిందూదేశ మేమి సకలప్రపంచమును ఇతనితో సరిపోవు వ్యక్తిని వేలకొలది సంవత్సరముల కైనను గాంచుట దుర్లభ మని శ్రీ మౌంటుబాటెను ప్రభువు చెప్పిన మాట నిజము. ముమ్మాటికిని నిజము.

ఇట్టి దుర్భరమగు విషాదము సంభవించుటకు కారణ మేమయియుండును? గాంధీ మహాత్ముని కీర్తి లోకమంతయు వ్యాపించినది. ఒక్కొక్క దినము గడచిన కొలది దాక్షారామభీమేశునివలె అత డింకొక యడుగు పెరుగుచున్నాడు. అతని సత్యాభిలాషయేమి, అహింసావ్రతమేమి, సర్వజాతులందును గల సమదృష్టియేమి, భూతదయయేమి అపారముగా హెచ్చ, భూనభోంతరాళము లేకమగుట జూచి భూదేవి తన యనుంగుబిడ్డనికి 'దిష్టి' తగులునని కొంపోయి తన గర్భమందు దాచికొనెనా? లేక భారతదేశమును సుభిక్షముగా జేయవలెననియు, ప్రజలందఱును స్నేహభావముతో ప్రవర్తింపవలెననియు నేను మానవరూపమున వచ్చినను, వారు తమతమ క్రూరప్రవృత్తులను విడువలేదు కదా యని పరమేశ్వరుడు కినిసి, వికృతపరిస్థితులందు దాను దేహము జాలించిన మనకు బుద్ధివచ్చునేమో యని ఈ పన్నాగమును బన్నియుండునా?

ఎట్టులయినను, అతను వెడలిపోయెనని విలపించుట కంటె నాతని యడుగుజాడలలో నడచుటకు యత్నించుట మన ప్రథమకర్తవ్యము. మన మాతని యుపదేశమును మఱువనంతకాల మాతడు మనవెంటనే తిరుగుచుండును. అతడు చిరంజీవి. షెల్లీ యను నొక యాంగ్లకవి ఒక కవిమిత్రుని యకాలమృత్యువునకు విషాదమును వర్ణించుచు నొక పద్యకావ్యమును రచించెను. దుఃఖించి దుఃఖించి, కొంతసేపటికి దెలివిరాగా, "మృత్యువునకు జావున్నది కాని నామిత్రునికి మరణమెట్లు? అతడు ప్రకృతిలో లీనమయి యున్నాడు. ఆమెనుండి వెలువడు ప్రతిశబ్దమందు నాతని కంఠధ్వనియే వినవచ్చుచున్నది." అని మనసును సమాధానపఱచుకొనెను. ఎల్ల కాలములందును మన హృదయపీఠముల నలంకరించియుండు మహాత్మునితో నెడబాపు మన కెట్లు? ఈ భావమునే ప్రకృతిపురుషుల సంయోగవియోగములను, రాధాకృష్ణుల ప్రేమ పేరిట, జయదేవకవి ఒకప్పుడు బోధించియుండెను.

"తా మహాం హృది సంగతా మనిశం భృశం రమయామి
కిం వనే ఽనుసరామి తాం కిం వృథా విలపామి"

ఆమె నాహృదయమం దుండుటచే నెల్ల వేళల యందును ఆమెతో నానందమును బొందుచున్నాను. ఆమె నిమిత్తి మడవిలో వెదకుట యెందుకు! ఆమెకై విలపించుట యెట్టి వెఱ్ఱితనము!

మహాత్ముని సందేశము మనలో క్రియారూపము దాల్చినంతకాలము ఆ మహనీయుడు భరతఖండములో సజీవి యయియుండును. అతనికి చావు లేదు.

గాంధీమహాత్ముడు బోధించిన విషయములలో నన్నిటికంటెను ప్రస్తుత మెక్కువ ముఖ్యమైనది హిందూ మహమ్మదీయ సఖ్యము. దీనికయియే యాతడి టీవల మహాదీక్ష పూనినది. దీని నిమిత్తమే యాతడు ప్రాణముల త్యజించినది. మన దేశమం దీమధ్యను మత వైషమ్యములు పెరుగుట వలన నేకదా జను లొకరి నొకరు నఱకుకొనుటయు, స్త్రీ లపహరింపబడుటయు సంప్రాప్తించినవి. రాక్షసు డని చెప్పబడు దశకంఠుడు సహితము సీత నొప్పించి యామెతో 'సౌఖ్యము నొందవలె' నని యత్నించెనుగాని, యీ దినములలో మన నారీమణులకు జరిగిన యవమానములు నోట నుచ్చరింపరానివై యున్నవి. పశుజాతియందయిన నిట్టి నైచ్య ముండదు. ఈ హేయపరిస్థితులను జూచి భరింపలేక, హిందూసిక్కు మహమ్మదీయ యువతు లెందఱు బలాత్కారముగా నన్యశాఖలవారిచే నెత్తుకొనిపోబడిరో, వా రెల్లరును దమతమ తల్లిదండ్రులకును, అత్తమామలకును అప్పగింతకావలెను. అంత పర్యంతమును దాను నిద్దురపోననియు, దేశము నిద్ర పోవుటకు వీలుకాదనియు మహాత్ముడు తీర్మానించెను. అదియేకాక, ఈ లతాంగులందఱికిని వారివారి కులముల వారును, బంధువులును స్వాగతమిచ్చి, వారియెడల సంపూర్ణాదరమును జూపవలెను. ఈ కాంతలలో గొందఱు గర్భవతులగుటచే దాము లజ్జావారిధియం దున్నామనియు, పూర్వపు బంధువులను జూడజాలమనియు సూచించినట్లు విని, ఈ విషమపరిస్థితులకు దాము కారకులు కాకపోవుటనుబట్టి, అయినను సకే యని, నిర్భీతిగా బ్రచురించి మహాత్ముడు తన హృదయము నైశాల్యమును మఱియొకసారి ప్రకాశింపజేసెను. స్త్రీల గౌరవమర్యాదలను పాటింపని దేశమున కేమి రానున్నదో యెవ్వ రూహింపగలరు? మన మందఱమును బరస్పర మైత్రితో మెలగియుండిన, ఇట్టి దురాకృత్యములకు దా వెక్కడ? కావున, అన్నిశాఖలవారమును సోదరభావముతో సంచరింపవలెను. అట్లు కృషిచేసితిమా, మహాత్ముని నిజశిష్యుల మగుదుము. లేకా, మన సభ లన్నియు శుష్కక్రియలును, శూన్యహస్తములును.

సద్భావములను మనలో బురికొల్పి, వానిని సంరక్షించుకొనుటకు దగిన సత్తువనీయమని, సూక్ష్మదేహముతో విహరించుచున్న మహాత్ముని మనము ప్రార్థింపవలెను. అతడే మనకు దిక్కు. అతనిపట్ల మనము చేసిన యపచారమును కాతడుకాక మఱియెవ్వరు క్షమింప గలరు?

కావున, మహాప్రభూ, మున్ను రావణబాధ కోర్వక మునులును, యోగీంద్రులును మొఱబెట్టగా, శ్రీరాముడవై యవతరించి, దుష్టశిక్షణమును శిష్టరక్షణమును గావించి ధర్మసంస్థాపనమును జేసితివి. కొంత కాలమువిదప నీ భక్తు లెల్లరును తనివితీఱక, నీ సాన్నిధ్యమును దిరిగి యాచించి, గోపికలయి, నీరాక కెదురు చూచుచుండ, నీవు కృష్ణరూపముతో వచ్చి రమ్యమగు యమునానదీతటమున నీ బాల్యక్రీడలు సల్పి నీ లీలలను బ్రదర్శించి లోకమున కానందమును గలుగజేసితివి. భారతయుద్ధమును నడిపించితివి. నిర్విణ్ణులయిన మానవకోటికి కర్మయోగమును బోధించి గీతారహస్యము నుపదేశించితివి. ఒకప్పుడు, నరులు సత్యదూరులయి, పాపము హెచ్చ, హరిశ్చంద్రుడవై ఈ మర్త్య రూపమందు హరిహరకష్టములకు లోనయి "సత్యమేవ జయతి", "నాస్తి సత్య సమం తపః" అని వేనోళ్ళ జాటితివి. మఱికొన్ని శతాబ్దములకు, జను లొకరి నొకరు హింసించుకొనుటయు, నోరెఱుగని పశుపక్ష్యాదులను జెప్పవలవికాని బాధలు పెట్టుటయు మితిమీఱగా, చూడలేక మానవశరీరముతో నార్యావర్తమునకు విచ్చేసి, ధ్యానించిధ్యానించి బుద్ధుడవై "అహింసా పరమో ధర్మః" అను తత్త్వమును భారతీయులకు బోధించుటయేకాక, నీసందేశమును ఆసియాఖండ

మంతయు వ్యక్తీకరించితివి. కాని యీ నీ స్వరూపము లను మేము ప్రత్యక్షముగా జూడలేదు. పురాణము లందును, చరిత్రలందును జదివితిమి. ౨౫౦౦ సంవత్సర ములతర్వాత, నాటికి నేడు, నీవు తిరిగి మము ద్ధరించు టకై వచ్చితివి; మా పుణ్యఫలముగా నిన్న ఈసారి కన్నులార గాంచగలిగితిమి. అయినను, దుర్బలులమై, చపలచిత్తులమై, ధనాభిలాషులమై సంకుచితమానసు లమై, అనాయాతత్వగులమై, స్వేచ్ఛాపూరితులమై నీ మహిమను గుర్తెఱుగలేకుంటిమి. నీ బోధనల నవగాహన చేసికొనలేకపోతిమి. బోధచేసికొనినను, ఆచరణలో బెట్టలేకుంటిమి. నీయెడల జెప్పరాని యపరాధమును జేసితిమి. జగద్రక్షకా, ఈ పతితులను మన్నింపుము. మన్నింపుము. మాయందు క్షేమబీజములను నాటుము. అన్ని జాతులవారమును, అన్ని మతములవారమును సౌభ్రాత్రముతో నీ పవిత్రావనిలో మెలగునట్లు కాక యని యాశీర్వదింపుము. హిందువులము, ముసల్మాను లము, సిక్కులము, పారశీకులము, క్రైస్తవులము వేల కొలది సంవత్సరములనుండి కలిసిమెలసి యీ భరత ఖండమందు జీవయాత్ర సలిపితిమి. మేమందర మును ఈ మట్టిలో బుట్టితిమి. ఇక్కడనే పెరి గితిమి. ఈ మట్టిలోనే కలిసిపోవలెను. ఇందులో నీదేశమును విడిచి యెవ్వరు ఎక్కడకు బోగలము? మాలో పరస్పర మైత్రిని పెంపొందింపుము. జగ న్మోహనుడవగు నీవు నీ మందస్మితమును మాపై ప్రసరింపజేయుము. కరుణాసాంద్రుడవగుటచే దయా రసము నించుక మాపై చిలికింపుము. నీ వాశీర్వదించి తివా, సస్యశ్యామలమగు నీ భారతభూమిలో నింత గంజిత్రాగి కాలక్షేపము చేయుదుము. దేశమును ముందునకు నెట్టుకొనిపోయెదము. కనికరింపవా, ఈ పుణ్యభూమిలో నివసించు నలుబదికోట్ల ప్రజలము దుర్గతిపాలయిపోవుదుము. భరతఖండము రూపు మాసిపోవును.

గురువర్యా, రక్షింపుము. ఈ శ్రద్ధాంజలిని గైకొనుము!



గాంధీజీని తమ పాలతో పోషించిన మేకలు

# గాంధీజీ శిష్యవాత్సల్యము

## మహదేవదేశాయిమీద ఆయన చూపిన మమకారము

౧

శ్రీమతి డా. సుశీలానయ్యర్

మహాదేవ దేశాయి జైయిలులో అకాల దుర్మరణము పాలైనప్పుడు నేల నాలుగు చెరగుల నుండి నూర్లుగా కురిసిపడిన సానుతాప సందేశములలో రెండే రెండు మాత్రమే గాంధీజీకి అందజేయుటకు అనుమతియైనది. ఆ రెంటిలో ఒకటి బొంబయి మాజీ మేయరు శ్రీ మథురాదాస్ త్రికంజీనుంచి వచ్చినది. అందులో ఒక వాక్యము బాపూ, దేశాయీలకు ఉండిన సంబంధ బాంధవ్యములను సూత్రప్రాయముగా, సుందరముగా నిర్వచించుచుండెను. ఆ వాక్య మిది: "బుద్ధ భగవానునికి ఒకడే ఒకడు శిష్యుడు—వాడు ఆనందుడు. మహాదేవుని స్థానముకూడ మీ విషయములో సరిగా అంతే." బుద్ధ భగవానునికి వేలకువేల శిష్యులుండిరి. కాని, ఆనందుడు వారందరిలోను తలమానికముగా నుండెను. అదే రీతిగానే మహాదేవుని గుణగణములు ఆతనికి సాటి సహచర బృందములో అసమానమైన స్థానము సాధించిపెట్టినవి. అది సులభసాధ్యమైన పనికాదు. ఎన్నోసార్లు మహాదేవ్ నాతో చెప్పుచుండెడువాడు: "బాపూతోపాటు నివసించుట యనగా అగ్నిపర్వతముయొక్క కొన యంచులో కూర్చొని కునుకులు తీయుటవంటిది. అగ్నిపర్వత మెప్పుడు బ్రద్దలై నిన్ను ఉవ్వెత్తుని ఊదిపారవేయునో నీవు చెప్పలేవు." బాపూజీ తదితరు లందరి అంతస్తుకంటెను ఎంతో ఎత్తులో, అనంతాకాశమున నెక్కి కూర్చొని యుండుటయు, ఆయనచుట్టు చేరినవారు ఆ సద్గురువుకు తగిన శిష్యులమని చెప్పుకొనవలెననెడి యుత్సాహముతో ఎన్ని పడరానిపాట్లు పడినను ఎప్పటికప్పుడు ఇంకను ఏవో లోటుపాట్లకే లోబడిపోయి, ఆయన ఆశలకు అందుకోలేకపోవుటయు అందుకు కారణము. అంతేకాదు. అంత ఆధ్యాత్మికోన్నతితో ఉండియు ఆయన మిక్కిలి మానవాత్మకలవాడు. తనవద్దకు వచ్చిన వారందరిలోను పరిశుద్ధత్వము పట్టుపడియుండవలె నన్న పట్టుదల ఆయనకు లేదు. కాని అటువంటి పరిశుద్ధత్వమునకై ప్రాకులాటమాత్రము వారిలో ఎక్కువగా ఆయన ఆశించును. తన అనుచరులలో ఆయన ఆశించు అభివృద్ధిపరిణామక్రమముగూడ ఆయాసందర్భములనుబట్టి మారుచుండును. కొండంతటి గొప్ప తప్పులనుకూడ కూర్మితో ఉదాసీనముచేసి, క్షమింపగలిగిన ఔదార్య మాయనది. అయినను ఒక్కొక్కప్పుడు అతిచిన్న విషయములుకూడ—అందులోను తనకు అతి సన్నిహితులైనవారి విషయములో—కొండంత పరిమాణమునుదాల్చి ఆయన పాలిటికి గొప్పతప్పులుగా కనబడిన కాలములుకూడ లేకపోలేదు.

మహాదేవుభాయి ఒకనాడు నాతో ఇట్లన్నాడు: "జీవితములో నాకొక్కటే ప్రార్థన—బాపూజీ సేవలోనే నేను నా జీవితము చాలించవలెనని. కాని, ఎప్పుడో ఉన్నట్లుండి, ఇందుకు నేను తగనివాడనుగా రుజువై క్షణమాత్రపు హెచ్చరికతో తొలగిపోవలసి వచ్చినను రావచ్చునని కూడ నే నెరుగుదును." నేను ఆయనమాటలు నమ్మలేకపోతిని. ఆయన లేని బాపూను చిత్రించుకొనుట అంత కల్లమాలిన పనిగా కనిపించెను. అప్పుడేమో అట్లనుకొంటిని గాని, ఆ తరువాత మహాదేవుభాయి, బాపూలతో నాకు లభించిన కొన్నియేండ్ల సాహచర్యములో మహాదేవుభాయి బాపూజీసేవనుండి తొలగిపోవుట కాస్తలో తప్పిన 'సన్నివేశములను కొన్ని

టిని కంట్లాగా చూచితిని. డెలాంగ్ సంఘటన అటు వంటి చిన్ని వేశములలో ఒకటి.

ఒకసారి, డెలాంగునుండి దుర్గాబెన్ (దేశాయి సతి). శ్రీమతి కస్తూరిబాయి ఇద్దరూ కలిసి పూరీజగన్నాథమునకు వెళ్లుట తటస్థించెను. పూర్వాచార సంప్రదాయాలలో పెరిగినవారైనందున వారికక్కడి దేవాలయముల లోకి వెళ్ళి దేవతాదర్శనము చేసుకోవలెనన్న కోరిక జనించినది. జనించి, హరిజనులకు ప్రవేశమివ్వని దేవాలయములలోనికి సవర్ణహిందువు లెవరూను పనేమిరా వెళ్ళరాదని బాపూజీ చేసియుంచిన సుగ్రీవాజ్ఞను మరచిపోయి, సరాసరి దేవళములలోనికి వెళ్ళిరి. మహాదేవభాయి చిన్న కొడుకు—పండ్రెండేండ్ల వాడు—మాత్రము లోనికిపో నిరాకరించెను. నిరాకరించి, బయటనే ఉండిపోయి, హరిజనులను లోనికి రానీక పోవుటవలని తిక్కాములను పూజారులకు నచ్చచెప్పుచు నిలుచుండిపోయినాడట. వారు తిరిగివచ్చిన తరువాత ఈకథ మా కెవరో చెప్పిరి. అతని ధైర్యమునకు, ఏండ్లకు మించి అతడు కనబరచిన ప్రతిభకు నారాయణను (దేశాయికొడుకు) వీపుతట్టి నిముసమును మించి మేమెవరము దానినిగురించి ఎక్కువ పట్టించుకోలేదు. కాని, బాపూజీ మాత్రము, ఆనాటి వారి ప్రవర్తనను పెద్దగా తీసుకొన్నాడు. వెంటనే భార్యను పిలిచి, ఇదేమిటని నిలవేసి అడిగినాడు. పాప, మా అమాయకురాలు నిలువునా కంపించిపోయి, "ఏదో అజ్ఞానురాలనై తప్పు చేసినాను. నిజముగా పొరపాటే అయినది. దయచేసి మన్నించమని ప్రార్థించుచున్నా" నని తప్పు ఒప్పుకొన్నది. బాపూజీ మరి నిందించలేకపోయినాడామెను. "ఆమెకు చదువుసంధ్యలు చెప్పించక నేనే ఉదాసీనము చేసితిని. కాబట్టి, నిజమునకు ఆమె చేయు తప్పులన్నిటికిని నేనే బాధ్యుడను—ఆమె కాదు" అని సమాధానపరచుకొన్నాడు. అంతట, దుర్గాబెన్నుకు చదువుసంధ్యలు చెప్పించనందుకై మహాదేవుభాయి మీదికి లంకించుకున్నాడు. "నారాయణ చదువు విషయములో నీవు అంత శ్రద్ధ తీసుకొంటివి. తత్ఫలముగా ఆచిరంజీవి అతని వయస్సులో నున్న మామూలు పిల్లవాని కంటె ఎంతో లోకజ్ఞానము సంపాదించినాడు. కదా! మరి ఆ శ్రద్ధనే నీవు దుర్గాబెన్ను చదువువిషయములో కూడ ఎందుకు తీసుకోలేదు? అస్పృశ్యతానివారణను, హరిజనులకు దేవాలయములను తెరచుటమీదను 'హరిజన్'లో వ్యాసములపై వ్యాసములు వ్రాయుచున్నావుకదా. ఆ నీ సందేశమును నీవే నీయింటనే చాటలేనప్పుడు ఆ వ్రాతలకు మరి ఉపయోగమేమి! 'బా' మాట రేమిటందువేమో! నేర్చుకొను వయసు దాటిపోయిన



ఉల్లాసముగా వాహ్యాళి వెళ్లుచున్న గురు శిష్యులు

దామెను. దుర్గ ఇంకను చిన్నదే కదా!" తన్నుదాను సమర్థించుకొనుటకై మహాదేవుభాయి ఏవేవో సంజాయిషీలుచెప్పి ఒప్పించజూచినాడుగాని, అవి పరిస్థితిని చక్కబరచుటకు బదులు మరింత విషమింపజేసినవి. మా అందరికిని ఏదో చిన్న చిలిపి విషయముగా కనిపించిన ఆ వ్యవహారము చివరకు మహాప్రమాద విషయముగా మారినది. మహాదేవుభాయి, పరిపాటిక అక్కడ తానిక ఉండబోలదని, మూటముల్లెలు సర్దుకొని, ఉద్యోగవిసర్జనచేసి వెళ్ళిపోవుటకు తయారై

కూర్చొన్నాడు. ఇక వెళ్ళుటయే తరువాయి. కాని... అతడు బాపూఆత్మలో ఆత్మ; ఆయనశరీరములో శరీరము. ఆయన అవసరము అత్యధికమైనది; ఆయన ఆత్మార్పణ అంత సంపూర్ణమైనది. కావున, ఎట్లో, దేవుడు మేలుచేయబట్టి ఆ ప్రమాదము తప్పిపోయినది. అతని ప్రార్థనను పరమాత్మ ఆలకించినాడు. అక్షరాలా దానిని చెల్లించినాడు. మహాదేవుభాయి చిట్టచివరి వరకు బాపూను సేవింపగలిగినాడు. ఆ సేవలోనే ప్రాణములు వదలినాడు.

మహాదేవుభాయిమరణానంతరము ఒకనాడు నేను ఉండబట్టలేక, బాపూను సమీపించి "ఇంతవరకు మీరు మీ ఆత్మీయులలో ఎంతోమంది మరణములు చూచినారుకదా, వాటన్నిటికంటె మహాదేవుమరణము మీపాలిటికి మిక్కిలి దారుణతమమైనది. అవునా కాదా?" అని అడిగితిని. అందుకు ఆయన ఇచ్చిన జవాబిది: "జమ్నాలాల్, మగన్లాల్, మహాదేవు-వీరు ముగ్గురిలో ఒక్కొక్కరును వారివారి పద్ధతిలో అసమానులే. వారిలో ఒక్కొక్కరిలోటు తీరరాని లోటుగానే నేను గణింతును. కాని ఒక్కటిమాత్రము చెప్పగలను. ఆ ముగ్గురిలోను మహాదేవు నాలో సంపూర్ణముగా ఆత్మార్పణచేసుకొని, నాలో తద్రూపముగా లీనమైపోగలిగినాడు. నాదే తప్ప అతనికి అతనిదని వేరు వ్యక్తిత్వమే లేకపోయినది."

వయసున చూచిన నా తండ్రి కాదగిన వయసు వాడైనప్పటికిని, మహాదేవు మనస్సు మాత్రము ఏ స్నేహితుడో, ఏ అన్నదమ్ముడో అనుకోదగినంత యౌవనముతోను, ఉల్లాసముతోను ఉండెను. నేను తొట్టతొలిసారి ఆయనను ౧౯౧౯ లో చూచినప్పుడు ఆయన చిన్నపిల్లవాడను. అంతకు కొత్తముందుగానే మా అన్న ప్యారేలాలు గాంధీజీ శిష్యకోటిలో చేరియుండెను. ఆ సమావేశములో నేను చూచిన మహాదేవు ఇప్పటికిని కండ్లకు కట్టినట్లున్నాడు. గాంధీజీ ఆశ్రమములో మరెవరును లేనంత మిక్కిలి ప్రీతిపాత్రుడనుగాను, ఆదరశాలిగాను ఆయన నన్ను ఆకర్షించినాడు. ఈ గుణవిశేషమే, పరిచయ మేర్పడీ ఏర్పడగానే, చిన్న పెద్ద అనే విచక్షణ లేకుండ యావన్మందిని జయించి లోగొనజాలిన ఈ నేర్పే బాపూజీశిబిరములో అతని నంత అమూల్యవ్యక్తిని చేసినది. అదే, బాపూజీని చుట్టుముట్టిన అనేక సాంసారిక సమస్యలను పరిష్కరించి బాపూ బరువును చాలమట్టుకు తగ్గింప ఆయనకు తోడ్పడినది. అమూల్యులైన సరికొత్త సేవావ్రతులను, స్నేహితులను బాపూజీకి సమకూర్చుటకుగూడ అది ఆయనకు చాల తోడ్పడినది. "రాజాజీని నాదగ్గరకు తెచ్చినది మహాదేవే" అని బాపూజీయే ఒకసారి నాతో అన్నట్లు జ్ఞాపకము. •

బాపూజీ ఆశ్రమములో చేరినది మొదలుకొని, చనిపోవువరకుగూడ మహాదేవుభాయి బాపూజీకి నిరంతరాయముగా సేవచేయుచునే యుండెను. ఆయన రాకకు పూర్వము, గాంధీజీకి ఆయనసంచారకార్యక్రమములో సాధారణముగా సహచారి ఒక్కడును ఉండలేదు. తన పనినంతయు తానే చేసుకొనువాడు. ఆయనయే అన్నట్లు తనకు మరియొకరు 'గమనించుకోవలసిన' అవసరమే ఆయనకు కనబడలేదు. "కాని త్వరలోనే మహాదేవు నావిషయమంతయు తానుమీద వేసుకున్నాడు. నా సామానుసంగతి అతడే చూచుకొన్నాడు. నా తిండితిప్పలనుకూడ అతడే గమనించినాడు. నా బట్ట లుతికినాడు. నా కార్యదర్శి పనుల నన్నింటిని తానే చూచుచువచ్చినాడు."

ఒక్కొక్కప్పుడు మహాదేవు మహాత్మునికి వంటలవాడుగా కూడ వ్యవహరించుచుండినాడు. మహాత్మునికి మారుగా ఆయనను చూడవచ్చినవారితో మాట, మంతి నడపుచుండినాడు. వచ్చిన జాబులకు జవాబులు వ్రాయుచుండినాడు. 'యంగుఇండియా'కు వ్యాసములు వ్రాయుచుండినాడు.

ఇంకొకసారి బాపూ నాతో ఇట్లన్నాడు: "మహాదేవులోని ఇంకొక మహత్తర గుణమేదనగా— అతనికి ఏపని చెప్పినను, ఇది చేయవచ్చును, ఇది చేయకూడదు అను వితర్కము చేయక, ఎంతో మనస్ఫూర్తితోను, ఉత్సాహముగాను చేయుచుండువాడు. ఈ రీతిగా అతడు ఒక చక్కని వ్రాయసగాడైనాడు; ఒక చక్కని వంటలవాడైనాడు; ఒక మంచి కూలీ అయి

నాడు. ఇదీ నాదగ్గరకువచ్చి పనిచేయగోరువారికందరికిని సామాన్యముగా లటస్థమగుచుండిన కర్మ."

మరొకసారి ఇట్లన్నాడు: "నేనొక మంచి ఉపాధ్యాయుడిని. నావిద్యార్థు లందరూ నేను వారికి నేర్పిన విషయములలో ఎన్నో సందర్భములందు నన్ను మించిపోవుటయే ఇందుకు నిదర్శనము." కాని నే నాయనమాటలు అంత సులభముగా నమ్మలేకపోతిని. అందుమీదట ఆయన మరికొన్ని దృష్టాంతముల నివ్వసాగినాడు. "దక్షిణఆఫ్రికాలో నేనుగా మొట్టమొదట చెప్పులుకుట్టుట నేర్చుకొని తరువాత దానిని ఇతరులకు నేర్పితిని. పిదప గమనించునుగదా, కాలెన్‌బక్ మగన్లాలు ఇరువురును నేను కుట్టినవానికంటె పసందైన పాదరక్షలు కుట్టగలిగిరి. అలాగే, నూలు వడుకుటనుగూడ నేను మొట్టమొదట నేర్చుకొని తరువాత ఆశ్రమములో ప్రవేశపెట్టి ఇతరులకు నేర్పగలిగితిని. చివరకు చూచునుగదా నూలువడుకుటలోను నేను కడగొట్టువాడనై పోతిని. మహదేవు నా దగ్గర నేర్చుకొన్నట్లు నేర్చుకొన్నాడు—అల్లంతలోనే నన్ను మించిపోయి, నాకంటె ఎంతో నాణెముగా నూలు తీయగలిగినాడు."

ప్రాచీన మహర్షులవంటివాడు బాపూ. కాని, వారికిని, ఆయనకును ఎంతో వ్యత్యాసమున్నది. వారివలెనే ఆయన ప్రపంచముతో సంబంధము పెట్టుకోక సర్వసంగపరిత్యాగము చేసినాడు. కాని, ప్రపంచ ప్రవృత్తులను పూర్తిగా మానినవాడుమాత్రము కాడు. తన బిడ్డలను ప్రేమించుట ఆయన మానివేయలేదు. కాని ఆ పితృప్రేమను ఆయన తనదగ్గర చేరినవారందరిపట్ల కూడ సమానముగా చూపుచువచ్చినాడు. యావత్ప్రపంచము పాలిటికిని బాపూ (తండ్రి) అయినంతమాత్రము చేత తన సొంతబిడ్డలకు బాపూ అగుట ఆయన మానుకోలేదు. అయితే, ఆయనసొంతబిడ్డలు ఆయనతదితర అనుచరులకంటె ఎక్కువ పొందుకొన్నదిమట్టుకు లేదు. మహదేవుభాయికికూడ బాపూ సర్వవిధముల, సర్వాత్మనా తండ్రియైనాడు. ఒకనాడు మహదేవు నాతో ఇట్లన్నాడు. ౧౯౧౭ లో బాపూవద్దచేరిన కొద్దికాలమునకే, ఇద్దరును కలసి ఒక వేసంగిరాత్రిని ఎక్కడనో ప్రయాణము చేయుచుండినారట. వాతావరణము చాల వేడిగా నున్నదట. ఉక్కపోయుచున్నదట, దానికి తట్టుకోలేక ఒక చోట విశ్రమించి, కాసంత నిద్రపోదమని బాపూకే పండుకొన్నాడట. ఆయనకు తాపోపశమనార్థము మహదేవు ఆయన చెంతనే కూర్చొని విసనకఱ్ఱ పట్టుకొని విసరుచున్నాడట. విసరుచు విసరుచునే, ఆయనకూడ చాల బడలియున్నాడుకదా, ఎప్పుడు పట్టినదో ఆయనకును కునుకుపట్టి, విసరుచున్నవాడు విసరుచున్నట్లుగనే తల వాల్చి మరునిమిషములోనే గాఢనిద్రలో మునిగినాడట. కొంతసేపటికి, మెలకువవచ్చి చూచునుకదా, ప్రక్కన కూర్చొని బాపూ అతనికి గాలి విసరుచున్నాడట. వాతావరణము మిక్కిలి వేడిగా ఉన్నదికదా, మహదేవు నిద్రపాలై, గాలివిసరుట ఆగునప్పటికి ఆ వేడిమి తిరిగి ముంచుకొనివచ్చి బాపూను నిద్రలేపినదట. బాపూ నిద్రలేచి, మహదేవు నిద్రపోవుచుండుటచూచి, అతని ప్రక్కన కూర్చొని, తల్లి తనబిడ్డకు ఆప్యాయముతో విసరునట్లు గాలి విసరుచు, కూర్చొన్నాడట.

మహదేవు జెయిలులో చనిపోయిన తర్వాత, ఆయన వియోగముతో ఉద్విగ్నుడై బాపూ ఇట్లన్నాడు: "నాపాలిటికి బాస్వెల్ కావలెనని అతడాశించినాడు. అయినను అతడెల్లప్పుడును నాకంటె ముందుగా చనిపోవలెనని కాంక్షించినాడు. అది ఎట్లు పొసగును? పాపము! ఆయనపోయినాడు. అందువల్ల నా జీవితచరిత్ర ఆయనయే వ్రాయుట పోయి, దానికి బదులుగా ఆయన జీవితచరిత్ర వ్రాయుట నా పాలబడినది." ఎంతటి క్రూర కర్మ! "పిల్లలు తమను పెంచి పెద్దచేసిన అనుంగు తల్లిదండ్రులకు ముందుగానే చనిపోగోరుట మిక్కిలి దారుణము. అది వచ్చి స్వార్థపరత్వమందును" అని బాపూ మరియొక సందర్భములో కూడ అన్నాడు. అయితే, ఆయనవేదాంతము ఆయనతోడ్పాటుకు వచ్చినది. "ఇతరులకు నచ్చచెప్పి వారిని ఒప్పించుట నాచేతకాక పోవచ్చును. కాని మరణమును గురించి పర్యాలోచించినప్పుడు దాని పదపదార్థ నిర్వచనము చేసిచూడగా నిజమునకు దానికి 'అకాల' మన్న విశేషణము తగనే తగదని నాఅభిమతము. లోకములో ఎవరుగాని—

అతడుగాని, లేదా ఆమెగాని—ఈ భూమిమీద చేయవలసిన పని ముగిసిపోనిదే చావలేచావరు. ఒక శతాబ్దములో ముగించదగినపనిని మహాదేవు అర్ధశతాబ్దములో ముగించినాడు. కావుననే అతడు తన సుసంపాదితమైన విశ్రాంతిస్థానమునకు తాను వెళ్లిపోయినాడు" అని తన్ను తాను సమర్థించుకొన్నాడు.

మహాదేవు అకస్మాత్తుగా స్మారకముతప్పి, నడచుచున్నవాడు నడచుచున్నట్లుగానే పడిపోయి ఆ వెనువెంటనే, ఎవరికిని తెలియకుండనే ప్రాణములను కోలుపోయినప్పుడు, ఆ కబురు అంది వాయువేగ మనోవేగములతో బాపూ ఆయనసమీపమునకు చేరుకొని, చేతనాచేతనపరిజ్ఞానముకూడ పోయి "మహాదేవ్, మహాదేవ్" అని ఎంతో ఆప్యాయముతో పిలిచినాడు. కాని, మొట్టమొదటిసారిగా శిష్యుడు గురువులవారి ఆజ్ఞను మీరినాడు. ఆయనపిలుపుకు "ఓ" అని అందుకోలేకపోయినాడు. అది చూచి, బాపూ మరింత ఆవేదనతో "అతడు గనుక ఒకసారి కండ్లు తెరచి నన్ను తేరిపారజూచినోపుకేని మరి అతడు నన్ను ససేమిరా వదలిపెట్టిపోలేపోడు. ఇది నిశ్చయము." అని వాపోయినాడు. వాపోయి, కొంతసేపటికి ఆత్మజ్ఞానము కలిగి, ఇక వాపోవుట వ్యర్థప్రయాస అని గ్రహించి, తన్ను తాను సమాళించుకొని, తదితరులను కూడ ఓదార్చి, తదనంతర కర్తవ్యమునకు దిగినాడు. లోపలమాత్రము వ్యసనముపోలేదు. కాని, గాంభీర్యము వహించి, "లెండుమరి. తరువాతి కార్యక్రమమునకు దిగుదము. మొదట ప్రార్థనలు కానిండు. అది అయినపిమ్మట స్నానము చేయింతము." అని హుకుము జారీచేసినాడు. ప్రార్థనలైనవి. శవమును గాంధీజీ స్నానమందిరమునకు చేర్చనయినది. బాపూయే స్వయముగా శిష్యునికి స్నానము చేయించినాడు. చేతులు వణవణ వణకుచుండ ఆయన స్నానము చేయించుచున్న ఆ విషాద దృశ్యము చూచుటకు చాల బాధాకరముగా నుండెను. పిమ్మట ఆయన చుట్టును ఒకసారి కలయజూచి, "మహాదేవు ఖైదీగానే గతించినాడు కావున ఖైదీగానే ఆయనకు సంస్కారములు జరుగవలె" నన్నాడు. జెయిలుబట్టలతోనే ఆ మహాదేవుశరీరమును కప్పి, బైటికి తెచ్చితిమి. జెయిలు సూపరింటెండెంటు గంపల నిండ పూలు తెప్పించినాడు. మీరాబెన్ ఆ పూలను అందుకొని వాటితో శవమును శోభస్కరముగా అలంకరించినది. ఆమెయే, ఎప్పుడు తెచ్చిపెట్టినదో తెచ్చిపెట్టినది చేతినిండ ఇంత పరిమళగంధపు ముద్దను. దానిని తీసికొని బాపూ మహాదేవునుదుట తిలకముదిద్ది, మిగిలినదానిని ఒంటినిండ రాచినాడు. రాచి శవము ప్రక్కన కూర్చున్నాడు. నేనును, ఆయనయు ఒకరినిమార్చి ఒకరము గీతాపారాయణము చేయ గడగితిమి. ఈలోగా దహనమునకు కావలసిన ఏర్పాట్లు జరిగిపోవుచుండెను. అల్లప్పుడు బాపూజీవైపునున్న మహాదేవుకన్ను అరగన్నుగా తెరచుకొనియుండుట నాకు స్పష్టముగా కనిపించెను. బాపూజీ.ట్ల అతనికిగల గాఢానురాగమునకును, భక్త్యతిశయమునకును అది ఒక చిహ్నముగా నాకనిపించెను. మరణించికూడ అతడు తన సద్గురువుమీదనే దృష్టిపెట్టుకొనియుండినట్లు తోచెను.

అధికారవర్గమువారు ఒకలారీనిండ పోలీసులను, బ్రాహ్మణులను తీసుకొనివచ్చి, శవమును తామే తీసుకొనిపోయి యథోక్త సంస్కారములు చేయింతు మని చెప్పిరి. కాని బాపూ ససేమిరా వల్లకాదనెను. "తన కుమారుని శవమును చేతులారా ఏతండ్రిగాని పరాయివారి చేతి కప్పగించ" డని వారితో చెప్పెను. "మహాదేవు నాకు కన్నకొడుకుకంటె అధికుడు. అతనికి చేయదగిన అంతిమ సంస్కారములను నేనే చేయుదును. కాని, ఒకవేళ నన్ను బయటికి తీసుకొనిపోవుటకు ప్రభుత్వమువారు ఒప్పుకోరేని, నేను నా మహాదేవు శవమును మిత్రులకైనను అందజేయుదునుగాని, జెయిలు అధికారులకు మాత్రము అందజేయను" అని తన నిశ్చితార్థమును తెలియజేసినాడు. కాని, మిత్రులకుగాని, బంధువులకుగాని దానిని అందజేయుటకు ప్రభుత్వమువారు ! వల్లకాదన్నారు. వాతావరణము గడ్డుగా పరిణమించినది. మేమందరము విభ్రాంతులమై కూర్చున్నాము. బాపూజీ ఇందు కేమని జవాబిచ్చునోయని ఆత్రముతో చూచుచుంటిమి. ఒక క్షణకాలము యోచించినట్లే యోచించి ఆయన ఇట్లన్నాడు: "నా కుమారుని మరణమును నేను ఒక రాజకీయ

సమస్యగా పరిగణింపనివ్వము. నన్నును బయటికి పోనివ్వక, శవమును మిత్రుల కందజేయుటకును సమ్మతింపక ప్రభుత్వమువారు పట్టుపట్టికూర్చొనిరేని, ఆ సంస్కారము లేనిదే ఈ జైలు ఆవరణలోనే ముగింతుము." అది ఒక అపూర్వ సలహాగా కనిపించెను. ఒక ఇంటిపట్టులోపల శవసంస్కారము జరుగుట అంత వరకు ఎవరును కని విని యుండలేదు. పోలీసు ఇన్స్పెక్టరు జనరలు వచ్చి, గాంధీజీని "మహాదేవు బంధువులకు ఏమైనను వర్తమానము చేయుదురా?" అని అడిగినాడు. "చేయుదును. ఒక తంతి యిత్తును. కాని, నా తంతివర్తమానములో ఎవరును చేతులు పెట్టరాదు. కొట్టివేతలు, తీసివేతలు పనికి రావు. ఈ షరతును ఒప్పుకొందురేని ఒక తంతి యిత్తు"నని గాంధీజీ చెప్పెను. చెప్పి, ఆయన సరే



ఉత్తరప్రత్యుత్తరములమీద చర్చలు సాగించుచున్న గురుశిష్యులు

ఇన్స్పెక్టరు జనరలు మేడమీదికి వెళ్ళి, బొంబాయి ప్రభుత్వముతో సంప్రతింపుల కుపక్రమించెను. బొంబాయి ప్రభుత్వమువారును తమంతట తాము ఏమీ చేయుటకును పాలుపోక ఇండియా ప్రభుత్వముతో సంప్రతించెను. ఏది ఎట్లయిననేమి! చివరకు ఆయన క్రిందికి దిగివచ్చెను. ఆవరణములో ఒకమూల దహన సంస్కారము జరుగుటకు ప్రభుత్వము వారు సమ్మతించిరని చెప్పెను. కొండంత బరువు దిగిపోయినట్లు మేమందరము నిట్టూర్చితిమి.

నన్నుమీదట "వర్తమానమును చెప్పుదును, వ్రాయు"మని నన్నాజ్ఞాపించెను. నేను కలము, కాగితము తీసుకొంటిని. ఆయన మొదలుపెట్టెను: "విచార వార్త." అని ఆరంభించి, వెంటనే "అటువంటి ఉత్తమ మరణమును తెలుపుటకు నేనెందుకు విచారించవలె"నని చెప్పి "ముందు ఆ పదమును-'విచారవార్త' అన్నదానిని కొట్టి వేయు"మని, తరువాతి వాక్యమునకు కందుకొన్నాడు. "మహాదేవు (ఉన్నట్లుండి) అకస్మాత్తుగా మరణించినాడు"... వెంటనే (ఆ కాగితము) పోలీసు ఇన్స్పెక్టరు

జనరలు చేతికి వెళ్ళినది. అతిజరూరు తంతిగా పంప వలెనని కూడ కోరితిమి. తరువాత తరువాత విచారించగా, ఆ తంతివర్తమానము ఆ తర్వాత ఎన్నో వారముల పిమ్మట విలాసదారునకు మామూలు తపాలో అందినట్లు తెలియ వచ్చెను.

తదుపరి, దహనమునకు అంతయు సిద్ధమైనది. ఒకచేత కర్రపూని, రెండవచేత అగ్నిభాండమును పట్టుకొని బాపూజీ శవము వెంట బయలుదేరినాడు. పురోహితులు కొన్ని శ్లోకములు, మంత్రములు పఠించి, ఏవో కొన్ని తంతులు జరిపిరి. శవమును కాష్ఠముమీద పెట్టిరి. బాపూజీ స్వయముగా నిప్పంటించెను. మరుక్షణములో మంటలు ఆకాశమునంటెను. కస్తూరిబాయి నాలుగైదడుగుల దూరములో కూర్చొని, తక్కిన ప్రపంచమంతయు మరచి విచారవేదన ననుభవించుచుండెను. చేతులు జోడించి, "నాయనా మహాదేవ్, ఎక్కడ ఉన్నప్పటికిని సుఖముగా ఉండు నాయనా!... అయ్యో! నేను పోయిఉండకూడదూ? నా మహాదేవే ఏల పోవలెను?" అని మరిమరి పలవించుచుండెను.

అంతయు అయిపోయెను, అందరమును ఇంటికి తిరిగి చేరుకొంటిమి. అప్పుడు సాయంకాలము అయిదు గంటలు దాటియుండెను. మరణము జరిగినది ఉదయము ఎనిమిదితొమ్మిది గంటల మధ్యలో. "జయమో, చావో మంత్రమునకు మహాదేవు అక్షరాలా కట్టుబడినాడు. ఈ ఆత్మబలి భారతదేశస్వాతంత్ర్య విముక్తి శుభముహూర్తమును త్వరపెట్టి తెచ్చితీరగలదని మహాత్ముడు మాతో అన్నాడు.

మూడవ రోజున అస్థిసంచయనము యథావిధిని జరిగినది. ౭ అడుగుల పొడవు, 3½ అడుగుల వెడల్పు, 3 అంగుళముల ఎత్తుతో ఒక వేదిక దహనము జరిగిన ఆ చోటున అమర్చబడెను. దానిచుట్టు ప్రాకారముగా ఒక రాళ్ళగోడ కూడ ఏర్పాటు చేయబడెను. బాపూ ఉదయ సాయంకాలములు రెండువేళల ఆ సమాధిదగ్గర వెళ్ళివచ్చుచుండెను. తాజాతాజా పూలు సమర్పణ యగుచుండెను. ప్రతిదినమును ఉదయముపూట గీతలోని ౧౨-వ అధ్యాయము పారాయణము జరుగుచు వచ్చెను. "మహాదేవుజీవితమంతయు ఒక నిరంతరాయమైన భక్తిగీతము. కాబట్టి, అతని సమాధివద్ద మనము భక్తియోగమును మననము చేయుట సర్వథా తగియున్నది. నావద్ద శిష్యుడుగా చేరినాడు, శిష్యుడుగా మెలగినాడు. కాని, చివరకు నా పాలిటి గురువే అయినాడు. సేవకొరకై ఆయన అంకితము చేసిన యావజ్జీవ ఆత్మార్పణాదృష్టాంతమును నా మనస్సులో మాసిపోకుండ నిలుపుకొనుటకై నేను అను నిత్యము అతని సమాధిదర్శనము చేసివచ్చుచుందును. అతని అడుగుజాడలలోనే మన మందరమును అనుసరించి వెళ్లగల శక్తిసామర్థ్యముల నిమ్మని భగవంతుని వేడుకుందుముగాక!" అని మహాత్ముడు స్వస్తివాక్యములు పలుకుటతో ఆ అధ్యాయ మక్కడికి పూర్తియైనది.





# గాంధీజీ శిష్యవాత్సల్యము

= శ్రీమతి సరోజినీనాయుడు =

మహాదేవదేశాయిని అనుకొన్నప్పుడెల్ల నా మనస్సును, నా హృదయమును కూడ ఆయనను గురించిన ఎన్నెన్నో తలపులు—తియ్యనివి, తీవ్రమైనవి కూడ అలముకొని, వానిలో నన్ను ముంచెత్తివేయును. ఆయన వరప్రసాదిరైన ఒక మహావ్యక్తి. ప్రేమపాత్రుడు. ఆయనతో స్నేహమది ఒక మహాభాగ్యము. ఆయన సాహచర్య మది ఒక ఆనందకందము.

మోహనమంత్రమువంటి మహాత్ముని పిలుపు ఆయన చెవిసోకినప్పుడు మహాదేవుకు పట్టుమని పాతిక యేండ్లుండునేమో, అంతే. తనవద్దనున్న వెండి బంగారాలను, తన యౌవనోత్సాహమును, అద్భుతోత్తమమైన అవర్ణ్యములను, అపూర్వమైన తన సారస్వతాభినివేశమును, పాండిత్యమును, ప్రగాఢమైన తనదేశభక్తిని వెంటకొనివచ్చి, తన సద్గురువుయొక్క చరణ కమలముల చెంత సమర్పణముచేయ ప్రప్రథమముగా ఏతెంచిన ఆ తొలిరోజునసే నాకును ఆయనతో తొలిపరిచయము. ఆనాడు వెల్లివిరిసిన అదే ఉత్సాహముతోనే నిండారిన నియమనిష్ఠలతోను, నిష్కళంకమైన నిర్భరభక్తితోను తన గురూజీని నిండు పాతికయేండ్లపాటు నిరాటంకముగా సేవించి ఆయన ధన్యుడైనాడు.

మహాత్మునికి ఆయన నెరపిన ప్రేమతుందిలమైన ఆ శిష్యరికములో ఆయనపాల బడిన విధివిధాయకములను, ఆయన అవశ్యము ఆచరింపవలసివచ్చిన కర్తవ్యములను ఎన్నని! ఎంతటివని!! అమ్మమ్మ!!!

ఈ స్మృతిసంబరములో నా కండ్లముందు మహాదేవును గురించిన అనేక చిత్రములు వడివడిని వరుసగా పొడసూపి, నా భావవాహినిని చిత్రమయము చేయుచున్నవి—సబర్మతి, వార్ధా, సేవాగ్రాం ఆశ్రమములందు ఆ ఆశ్రమవాసులలో అగ్రణియైన మహాదేవు; అభిమానవ్యక్తులమధ్య అభిమాన,ఆదరణకేంద్రమై రొప్పుచు కూర్చొని నవ్వుమొగముతో, నవనవలాడు చమత్కారములను సున్నితమైన హాస్యప్రసంగములతో మేళవించి నవ్వించుచున్న మహాదేవు; కన్నులనువాల్చి ఏకతానముగా సారస్వత వ్యాసంగములు చేయుచు, తనకు తనంతగా తట్టినవో, లేదా గురువులవారినుండి సంక్రమించినవో అయిన రమణీయమైన భావతరంగములను అందమైన భాషలోనికి దింపుచున్న మహాదేవు; బూడిద రంగు శాలువ కప్పుకొని, బహు సూక్ష్మమైన ఏదో రాజకీయ వ్యవహారము నెత్తిన వేసుకొని ఢిల్లీలో రాజప్రతినిధిప్రాసాదసోపానముల నెక్కుచున్న మహాదేవు; లండనులో బకింగుహాం రాజమందిరములో రాజావారి ఆదరాతిథ్యముల నందుకొవెళ్ళిన మహాత్మునిని జీగేలుమనుచున్న తెల్లని ఖద్దరువలువలతో దివ్యరూపమున వెన్నంటివెళ్లిన మహాదేవు; యూరోపు అమెరికాలనుండియు, దూరప్రాచ్య సమీపప్రాచ్యముల నుండియు ధారావాహిగా మూగివచ్చుచున్న విదేశయాత్రికతండములకు తన సద్గురువుయొక్క బోధామృత సందేశములను, అచ్ఛస్ఫటిక సంకాశమైన అద్దములో సాక్షాత్తుగా ప్రతిబింబించుచున్నట్లే, మృదుమధురమైన గౌరవ మర్యాదలతో విడమర్చి వ్యాఖ్యానించుచున్న మహాదేవు.

ఈ స్మృతులలోకెల్ల మిక్కిలి చిత్తక్షోభకరమైనది, జన్మజన్మకేని మఱపునకురానిది ఏదనగా—ఆయన జీవితముచాలించిన ఆవిచిత్రసన్నివేశము, ఆ అశ్వాసాంతమప్పుడు మేము గడిపిన ఆ విషగడియలను. అల్ల ఆ ఆగస్టు 9-వ తేదీనాడు మమ్ముల నందరిని అరెస్టుచేసి, మాపాలికి చెరసాలగా పరిణమించిన పూనాలోని ఆగాఖాన్ మందిరమునకు మమ్ములను చేరవేసినప్పటి

నుండియు ఆయన ఏదో బరువైన భారముతో క్రుంగిపోవుచున్నట్లును, ఏదో అనిర్వచనీయమైన దిగులుతో తీసుకొనుచున్నట్లును కనిపించుచుండెడివాడు. మహాత్ముడు మరిమరి వల్లెవేయుచు వచ్చిన ఆమరణప్రాయోపవేశ సంకల్పము ఆ చెరసాలవాసములోనే అకస్మాత్తుగా క్రియారూపము దాల్పవచ్చునయియుండెను. ఆగస్టు ౧౪-వ తేదీరాత్రి మా-కారాగృహ ప్రాసాదమంతయు చీమచిటుక్కుమన్నను చెవిసోకునంతటి నిస్తబ్ధత దాల్చియున్నది. లోకమంతయు మాటుమణిగినది. కాని, మహాదేవు మాత్రము నా గదిలో కూర్చున్నవాడు కూర్చున్నట్లే అపరరాత్రివరకు కూర్చుండిపోయి, కాలము చాల పరిమితమయియున్నట్లుగా ఎన్నడునులేని అత్వర సంభాషణలో పడి మాటలమీద మాటలు సాగించుకొనుచునే పోవుచున్నాడు. ఆ సంభాషణఅంతయు అతని జీవితముయొక్కయు, జీవితములో అతని అనుభవములను గురించియు భార్యాపుత్రులను గురించిన అతని దుగ్ధముగురించియునైన ఒక సంగ్రహోదంతముగా కనిపించెను. కాని నిజమునకేమా అతని ముఖ్య ఉద్దిష్ట విషయము తనపాలికి మూర్తీభవించిన పరదేవతగానున్న మహాత్మునిని గురించి. ఆరాత్రి ఆయనను ఏదో ఒక విచిత్రమైన, అకళ్యంభావియైన దుష్కర్మచింత తీవ్రముగా పట్టుకొన్నట్లు ఆయనధోరణి వ్యక్తముచేసెను. కాని, మరురోజు తెల్లవారుసరికి ఆ విచారపిశాచం ఆయనలోనుండి తొలగిపోయి, ఏదో దైవలీలగా ఆయనలో తిరిగి ఆశారేఖలు పొడకొన్నట్లు తోచినది. గాంధీజీతో కలిసి యథారీతిగా తోటలో తిరిగినాడు. తిరిగి, యింటికివచ్చి నాతో ఇట్లన్నాడు: "నేనీ రోజున ఎందుకింత సంతోషముగా ఉన్నానో నాకే తెలియకున్నది." అటుపిమ్మట కొంతసేపటికి, తనకోసమే వెదకుచున్న డాక్టరును చూచుటకని, పెదవులమీద చిరునవ్వు చిందించుకొనుచు నా గదికి వచ్చినాడు. మరికొన్ని నిమిషములకే, ఒకవంక చిరునవ్వుచునే "నా తల తిరుగుచున్నది" అన్నాడు. అన్నాడు అంతే. ఆమాట విని నే మది గమనించుసరికే ఎప్పుడు పోయినదో పోయినది ప్రాణము—'హరీ' యని. మనిషి కుప్పకూలిపోయినాడు. నేనింకను ఏదో స్మారకము తప్పి పడిపోయినాడని, తెలివితెప్పించుటకని పిలిచిన పిలుపు లన్నియు వృథాఅయిపోయినవి. అప్పటికే అశ్వాసాంతమైపోయినది.

ప్రాణాధిక ప్రియుడైన ఆ శిష్యరత్నమునకు—అతని ఆ భౌతికదేహమునకు దుఃఖోద్విగ్నుడైన ఆ గురువు చేజేతులా చేసినటువంటి ఆ అపరకర్మ సంస్కారములను అనువైనరీతిగావర్ణించుటకు నాజూకైనటువంటి, సున్నితమైనటువంటి, నాణెమయినటువంటి మాటలకు నే నెక్కడికి పోదును! అటువంటి నేర్పు నా లేఖిని కేదీ! తెగ వణకుచున్న చేతులతో, ఎవరితోడ్పాటును లేకయే స్వయముగా గాంధీ మహాత్ముడు చలువరాతి చలువలు కప్పిన ఆ శరీరమునకు యథోక్తముగా స్నానము చేయించినాడు. పరిమళగంధమును పైనలదినాడు. సుగంధకుసుమములతో కైసేసినాడు. ఇన్నియు అతి గంభీర ముద్రతోనే, చెక్కుచెదరకుండ చేయుచు వచ్చినాడు కాని చివరకు ఆ దుఃఖముపట్టలేకనే పోయినాడు. "మహాదేవ్, ఇన్నిపనులను నీవు నాకు చేయుదువనుకొంటినే నాయనా! చివరకు నేనే నీకు చేయవలసివచ్చినదే!" అని పైకి వివశుడై వినబడునట్లు గొణుగుకొన్నాడు. ఆ అపరాహ్ణమునకే ఆ శరీరమును ఉన్న ఆ కొద్దిమందిమే ఊరేగింపుతో తీసుకొని వెళ్ళి, ఆ ఆగాఖాన్ మందిర ప్రాంగణములోనే ఒకమూల ఏర్పాటయినదహనభూమికి చేర్చితిమి...ఇంకేమున్నది! మరికొన్ని నిముషములకల్ల అక్కడ మిగిలినది చిన్న భస్మరాశి. అహదయవేళ ధగద్ధగ వెలుగుచు కానిపించిన జీవజ్వాల సాయంకాలముగుసరికి రాలిపోసిన రజత చూర్ణమువంటి భస్మరాశి అయిపోయినది.

మన దృష్టిపథమునుండి ఆ మహాదేవు మాయమయిపోయినాడు. కాని, నిజస్థితిలో ఆయన చనిపోయినాడా అని! తన సద్గురువుయొక్క (బొందిలో ఆయన ప్రాణమున్నంతవరకును) ప్రేమహృదయములోను, శక్తికిమించిన సాహసత్యాగములతో తాను అంతంతగా సేవించిన తన దేశముయొక్క హృదయములలోను ఆయన అద్యాపి జీవించి వెలుగుచుండుటలేమా!

[మూలము: పాత 'హరిజన్' పత్రికలోని రెండు రచనలు.]




= శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్య =

ప్రపంచమందు శాంతిసంస్థాపనమునకై స్థాపింపబడిన విశ్వరాజ్యసమితియు, దాని ప్రధానాంగమగు భద్రతాసంఘము యుద్ధములు సంభవించుటకు కారణభూతములుగ నుండు వివాదవిషయములను నిష్పక్షపాతముగను, సకాలములోను పరిష్కరింపలేని దుస్థితిలోనికి వచ్చుచున్నవని అనేకులు అభిప్రాయపడుచుండిరి. ఇట్టి అభిప్రాయము సత్యదూరము కాదనుటకు కాశ్మీరవిషయమై గతమాసమందు భద్రతాసంఘములో జరిగిన చర్చలును, అందు అగ్రరాజ్యములవారు వహించిన వైఖరియు ప్రధాననిదర్శనములు. మొదటి ప్రపంచయుద్ధము ముగిసినతర్వాత ఏర్పరచబడిన జాతీయసమితియొక్క పేరుప్రతిష్ఠలు నశించుట కిట్టి పక్షపాతబుద్ధియు, అగ్రరాజ్యములవారి స్వలాభపరాయణత్వమును ప్రధాన కారణము లన్నమాట చరిత్రగ్రంథములు ఘోషించుచున్నను, దానినుండి అగ్రరాజ్య ప్రతినిధులు ఎట్టి పాఠమును నేర్చుకొనక స్వలాభమందే దృష్టిని పెట్టుకొని ప్రవర్తించుచుండుట శోచనీయమగు విషయము. మానవస్వభావము ఎన్నటికిని మారదేమో నని వాదించువారి వాదనయే సత్యమేమో అను శంక దీనిమూలమున కలుగక తప్పదు.

## కాశ్మీర సమస్య

భద్రతామండలి యెదుట ఇండియాప్రభుత్వమువారు పాకిస్థాన్‌పై చేసిన ఫిర్యాదులో క్లిష్టములగు అంశము లేవియు లేవు. దానిని పరిష్కరించుటకు ఎంతో కాలము పట్టదు. పరిష్కరించుటకూడ కష్టసాధ్యము కానట్టిది. కాశ్మీరము ఇండియాలో చేరిన సంస్థానము. దానిని రక్షించుట ఇండియా ప్రభుత్వపు విధి. దానిపై కొండజాతులవారు దండెత్తివచ్చిరి. వారు పాకిస్థానముద్వారా కాశ్మీరమును ప్రవేశించుచుండుటయేగాక పాకిస్థాన్ ప్రభుత్వముయొక్క సహాయమును సంపాదించినవారు. వారికి కావలసిన ఆయుధములు, ఇతరసాధనసామగ్రి, పెట్రోలు, లారీలు, దుస్తులు—అన్నియు పాకిస్థాన్ ప్రభుత్వమువారు సరఫరా చేయుచుండిరి. అట్టి సహాయము చేయరాదనియు, అది చట్టవిరుద్ధమనియు ఇండియాప్రభుత్వమువారు పంపిన సందేశమును పాకిస్థాన్ ప్రభుత్వమువారు పెడచెవినిబెట్టి రోజురోజుకు మరింత సహాయమును ఎక్కువగ చేయసాగిరి. అట్టి సందర్భములో ఇండియాప్రభుత్వమువారు పాకిస్థాన్‌పై యుద్ధమును ప్రకటించి, పాకిస్థాన్‌పై దండెత్తి యుద్ధము సాగించుటయందు చట్టవిరుద్ధ మెట్టిదియు లేదు. కాని పాకిస్థాన్, ఇండియా—ఈ రెండును విశ్వరాజ్యసమితిలో సభ్యత్వము గల రాజ్యములు. పరస్పరవివాదములు సంభవించి, యుద్ధము తప్పని పరిస్థితులు ఏర్పడినపుడు యుద్ధమారంభించుటకుపూర్వము వివాదములను భద్రతాసంఘముఎదుటికి తెచ్చి పరిష్క-

రించవలసినదని అడుగుట ఐక్యరాజ్యసమితిసభ్యుల విధి. అట్టి విధిని అతిక్రమించుట కిష్టపడని కారణముచే ఇండియాప్రభుత్వమువారు పాకిస్థాన్‌పై భద్రతా సంఘముఎదుట ఫిర్యాదు గావించి, పాకిస్థాన్ ప్రభుత్వము కొండజాతులవారికి ఎట్టి సహాయము చేయకుండునట్లు వివాదమును పరిష్కరించవలసినదని కోరెను.

## కొరివితో తల గోకుకొనుట

కాని భద్రతాసంఘము ఆరువారముల కాలము వివాదాంశముల నన్నిటిని విని, వివాదమును పరిష్కరించుటకు బదులు, వివాదమునకు సంబంధించని విషయము లనేకములను విచారించుటయందు కాలము పుచ్చుటగాక, ఇండియాయొక్క గౌరవమునకు భంగకరమైన సూచనలనేకములను గావించి, ఆ సూచనల ననుసరించి కొన్ని తీర్మానములను చేయ సిద్ధపడెను. మంటలను చల్లార్చుటకై చేరినవారు మంట ఎందుకు పుట్టినదో, దానికి ఎవరు కారకులో విచారించుచు మంటమాటను మరచిపోయినట్లు భద్రతా సంఘమువారు ప్రవర్తించసాగిరి. కొరివితో తల గోకుకొనువాని స్థితిలోనికి మన ప్రతినిధులు వచ్చిరి. కాశ్మీరులో ప్రవేశించుటకు ఇండియాప్రభుత్వమునకు హక్కు లేదనియు, ఇండియా సైన్యములు కొండజాతుల సైన్యములవలె కాశ్మీరమును దురాక్రమణ చేసిన వనియు, కొండజాతులకు సహాయము చేయుచు ఇండియా సైన్యములపై అప్రత్యక్షముగ యుద్ధము గావించు పాకిస్థాన్ సైన్యములకు కాశ్మీరములో ప్రవేశము కలుగవలెననియు, అట్టిసైన్యముల సహకారముతోడనే ఇండియాప్రభుత్వమువారు కాశ్మీరములో శాంతిసంస్థాపనము చేయవలెననియు, వెంటనే షేక్ అబ్దుల్లా పరిపాలనము తొలగి తాత్కాలిక నిష్పక్షపాత ప్రభుత్వ మొకటి ఏర్పడవలె ననియు, కాశ్మీరము ఇండియాలో చేరుటయా, పాకిస్థానములో చేరుటయా అను విషయమును నిర్ధారణచేయుటకు ప్రజాభిప్రాయమును కనుగొనవలయు ననియు, ఆఅభిప్రాయమును భద్రతా సంఘమువా రేర్పరచు కమిటీవారి యాజమాన్యమున కనుగొనవలె ననియు సూచించుచు ఒక తీర్మానము భద్రతాసంఘములో ప్రవేశపెట్టబడెను. దీనిని ఆమోదించుచు అమెరికా, ఇంగ్లండు, ఫ్రాన్సు మొదలగు దేశములయొక్క ప్రతినిధులు ఉపన్యాసములుచేసిరి. దొంగిలించుటకై కన్నముచేసి ఇంటిలో ప్రవేశించిన దొంగను తరిమివేయుటకు బదులు ఇంటి యజమానుడుకూడ తొలగిపోవలె ననియు, అటుతర్వాత మధ్యవర్తులు ఇంటిలో ప్రవేశించి, అచ్చటనుండు ధనధాన్యాదులు దొంగకు చెందవలెనా, యజమాను డనుభవించవలెనా, లేక మధ్యవర్తుల అనుభవములో ఉండవలెనా అను విషయములు తీర్మానించుట చక్కని మార్గమని సూచించు మధ్యవర్తులవలె భద్రతాసంఘమువారు ప్రవర్తింపసాగిరి. ఈవిధముగ ప్రవేశపెట్టబడిన తీర్మానమును గురించి ఆలోచించుటకు తమకు కొంత వ్యవధి కావలసియున్నదనియు, అందుకై విచారణను వాయిదా వేయవలసినదనియు మన ప్రతినిధులు కోరినను ఆరువారములు వ్యర్థపుచ్చుటకు వెనుదీయని భద్రతాసంఘములోని అమెరికా, ఇంగ్లండు మొదలగు దేశముల ప్రతినిధులు కొన్నిరోజులవరకు వాయిదా వేయుటకుకూడ అడ్డుపడసాగిరి. తుద కెట్లో విచారణ వాయిదా వేయబడెను. మన ప్రతినిధులు ఢిల్లీకి వచ్చిరి. ప్రభుత్వముతో ఈ విషయమై ఆలోచన చేసిరి. తిరిగి కొద్ది రోజులలో—వాయిదా నాటికి న్యూయార్కుకు వెళ్లి భద్రతాసంఘపు చర్చలలో పాల్గొనెదరు.

## అగ్రరాజ్యముల వైఖరి

ఐక్యరాజ్యసమితియొక్క చరిత్రమును, భద్రతా సంఘమందు జరుగు వ్యవహారములను చక్కగ గమనించువారికి కాశ్మీరువిషయములో ఆ సంఘమువారి ధోరణి ఆశ్చర్యమును కలిగించజాలదు. ప్రపంచమందు శాంతిని సంపాదించు ఉద్దేశముతో సమితి స్థాపింపబడినను, వివాదములను విచారించుటలోగాని, పరిష్కరించుటలోగాని అగ్రరాజ్యములవారు వారివారి స్వలాభమునే అపేక్షించుట మామూలైపోయెను. నిష్పక్షపాతముగ చట్టము ధర్మము న్యాయము ఎవరి పక్షమున ఉన్న దను విషయమును వారు గమనించుటలేదు. అగ్రరాజ్యములను అనుసరించి తక్కినవారు నడుచుకొనుటయేగాని సామాన్యముగ స్వతంత్రముగ ఆలోచించుటకు వారు సాహసించుట లేదు. దక్షిణ అమెరికాలోని రాజ్యములు, అమెరికాయొక్క సహాయము ద్వారా తమ ఆర్థిక రాజకీయవ్యవహారములను చక్క

పెట్టుకొనవలసిన స్థితిలో నుండు గ్రీసు టర్కీ మొదలైన రాజ్యములను అమెరికావారు ఎట్లు తలఊపుమనిన అట్లు తలఊపుచుండువారే. ఇదేవిధముగ ఇంగ్లండును అనుసరించు రాజ్యములు కొన్ని, రషియాను అనుసరించునవి మరికొన్ని. గనుక కాశ్మీరువిషయములో వెంటనే చేయవలసిన పని ఎట్టిదో గమనించక, అనవసర ప్రసంగములలో అగ్రరాజ్యములవారు ప్రవేశించుటయు, తక్కినవారు ఆధోరణిలోనే ఉండుటయు సంభవించెను.

## దీనికి కారణము

భద్రతాసంఘములోనివారందరు పాకిస్థాన్ పట్ల అభిమానులగుటయు, ఇండియాపట్ల విరోధభావము వహించుటకును కారణ మేమైన కలదా అనువిషయము చర్చించదగియున్నది. దీనినిగురించి గత సంచికలో కొంత విమర్శన మున్నది. ప్రస్తుత ప్రపంచ పరిస్థితు లన్నిటికి అగ్రరాజ్యములకుమధ్య దినదినప్రవర్ధమానమగుచుండు విరోధము ప్రధానలక్షణ మన్నమాట అందరికి తెలిసినదే. ఈ విరోధముద్వారా ప్రపంచము రెండు భాగములుగ విభాగమగుచున్నది. ఇది ఎప్పటికో ఒకప్పటికి మూడవ ప్రపంచయుద్ధముగ పరిణమించుట తప్పదని అగ్రరాజ్య పరిపాలకుల దృఢనమ్మకము. అట్టి సందర్భములో ప్రపంచమందలి ఇతరదేశముల నన్నిటిని తమ పక్షమునకు వచ్చునట్లు చేసుకొనవలెనని రషియావారును, తమ పక్షమునకు వచ్చునట్లు చేసుకొనవలెనని ఇంగ్లండు అమెరికావారును కోరుటయు, అందుకై ఎత్తులువేయుటయు సహజమేకదా! ఈ కోరిక సఫలమగుటలో పాకిస్థాన్ తమ పక్షమందే ఉండగలదను నమ్మకము ఇంగ్లీషువారికిని, అమెరికావారికిని కలదు. ఇండియా అట్లుండు నను నమ్మకము వారికి లేదు. అయితే ఇండియా తమ పక్షము చేరు నను నమ్మకము రషియావారికి కలదా అనిన, అదికూడ లేదు. ఇండియా ఏ పక్షమునందును చేరదనియు, అగ్రరాజ్యములమధ్య ఏర్పడు వివాదములలో ఒక్కొకదానియందును ఎవరి పక్షము న్యాయమని తోచునో వారి పక్షమందు ఆ విషయమునకు సంబంధించువరకు ఉండుననియు, విదేశవ్యవహారములలో ఇట్టి స్వాతంత్ర్యమును కలిగియుండుటయే ఇండియాకు గౌరవకరమనియు పండిత నెహ్రూ మొదలైన మన నాయకులు గత అయిదారుమాసముల నుండి చెప్పుచున్నారు. ఐక్యరాజ్యసమితిమహాసభ ఇదివరలో సమావేశమైనప్పుడు మన ప్రతినిధులు ఈ సూత్రము ననుసరించి కొన్ని విషయములలో రషియాపక్షమునను, మరికొన్నిటిలో ఇంగ్లండు అమెరికాల పక్షమును వహించుచు, తక్కినవాటిలో ఎవరి పక్షమును వహించక తటస్థులుగనుండిరి. ఈ కారణముచేత ఇండియా యెడల రషియావారికిగాని, ఇంగ్లండు అమెరికాలకుగాని ఎట్టి అభిమానము కుదురుటకు అవకాశ మేర్పడినదికాదు. కాశ్మీరువిషయమై ఇండియా చేసిన ఫిర్యాదులో న్యాయము ఇండియాపక్షమునందే యున్నట్లు వారు భావించినను ఇండియా తమతో ఎల్లప్పుడు చేరియుండు నను నమ్మకము వారికి లేకపోవుటచేతను, పాకిస్థాన్ చేరియుండు నను నమ్మకము వారి కుండుటచేతను ఇంగ్లండు అమెరికాలవారు పాకిస్థాన్వాదమును పోషించుట సంభవించెను. అట్టి సందర్భములో రషియావారు ఇండియాను పోషించిరా అన్న, అదికూడ జరుగలేదు. ఏలనవగా, ఇండియా స్వతంత్రమార్గమును అనుసరించు రాజ్యమేకాని, యుద్ధకాలమందుగాని, ఇతరక్లిష్టసమయములందుగాని తమకు సహాయముచేయు నను నమ్మకము రషియావారికికూడ లేదు. ఈ కారణములచేత భద్రతాసంఘపు చర్చలలో మనకు న్యాయము లభించదనియే చెప్పవలసియున్నది.

## స్వతంత్రవిదేశాంగనీతి : తన్నుమాలిన ధర్మము

ఇట్టి సందర్భములో మనము ఏపక్షమును అనుసరించక ధర్మము ఎవరిపక్షమున ఏవిషయమం దుండునో ఆపక్షమును ఆ విషయమునకు సంబంధించువరకు వహించు స్వతంత్రవిదేశాంగనీతి లాభకరమా అను సందేహము అనేకులకు కలుగకమానదు. ధర్మమునకు విరుద్ధముగ ప్రవర్తించుట తప్పే; కాని తన్నుమాలిన ధర్మము ధర్మము కాదన్నమాటకూడ మనము మరువరాదు. అగ్రరాజ్యములలో దేనియో ఒకదాని పక్షమున చేరక మనము నెగ్గగలమా అన్న విషయమునుగురించి మన ప్రభుత్వమువారు సంపూర్ణముగ ఆలోచించి, ఏదో ఒక స్థిరనిశ్చయమునకు రావలసిన సమయము వచ్చినది. పరస్పరవిరోధమును సాధించుటకును, యుద్ధములలోకి దిగుటకును నిశ్చయించుకొనియుండు అగ్రరాజ్యములు ప్రపంచమం దుండునంతవరకు ఎవరి పక్షమును వహించక తటస్థముగ నుండదలచుట ప్రమాదకరమేమో! ముఖ్యముగా ఇండియావంటి దేశమునకు ఇట్టి

ప్రమాదము మరింత ఎక్కువ. మనకు ఆగస్టు ౧౫ తేదీన స్వరాజ్యము వచ్చినమాట వాస్తవమేగాని దానిని స్థిరపరచుకొనుటకు కావలసిన సాధనసామగ్రి మనకు లేదని ఒప్పుకొనుటలో అవమానమేమియు లేదు. మనది సస్యశ్యామలమువ, సుభిక్షమును అగు దేశము, ఇతరు లెప్పుడును దీనిపై కన్నువేసియేయుందురు. మనకు ప్రస్తుతము బాహ్యశత్రువులు, అంతశ్శత్రువులు ఉన్నారు. బాహ్యశత్రువులలో పాకిస్థాన్ ఒక్కటే చేరియుండలేదు. ఇతరమహమ్మదీయరాజ్యములుకూడ కొన్ని అందులో చేరియున్నవి. దౌర్జన్యము నుపయోగించి, రక్తపాతముద్వారా కాంగ్రెసు ప్రభుత్వమును తొలగించి వేరొకవిధమైన ప్రభుత్వమును స్థాపించ ప్రయత్నించుచుండు అంతశ్శత్రువులుకూడ నున్నారు. ఈ రెండువిధములగు శత్రువుల మూలమున ప్రమాదము సంభవించకుండుటకు మనకు గొప్ప సైన్యము. నౌకాబలము, విమానబలము అవసరము. ఇట్టి బలము లేక శత్రువుల ప్రమాదమునుండి మన స్వాతంత్ర్యమును రక్షించుకొనదలచుట హాస్యాస్పదము. కాని ప్రస్తుతము మన కిట్టి బలములేదు. మరికొంతకాలము వఱకు—అనగా ౧౫, ౨౦ సంవత్సరములవరకు ఇతరుల సహాయము లేక మన మిట్టి బలమును సంపాదించుట సాధ్యముకాని పని. దేశమున ౩౦ కోట్ల జన మున్నమాట వాస్తవమే. ఎంతటిసైన్యము కావలె నన్నను మనము సమకూర్చుకొనగలము. కాని సైన్యమునకు కావలసిన ఆయుధసామగ్రిని, మందుగుండుసామానులను, టాంకులు, ఫిరంగులు, విమానములు మొదలగు వాటిని ఇతరదేశములందుండి సంపాదించవలసిన స్థితిలో ఉన్నాము మనము. వీటిని తయారుచేసుకొనుటకు కావలసిన కర్మాగారములు మన దేశమం దిప్పుడు లేవు. కర్మాగారములను నిర్మించుకొనుటకు, అవి పని చేయుటకు కావలసిన యంత్రసామగ్రిని సంపాదించుటకు, పారిశ్రామికవిషయములలో అత్యధికముగ అభివృద్ధిగాంచిన దేశముల సహాయము అవసరము. నౌకాబలవిషయములోను, విమానబలవిషయములోను ఈ విషయములే గమనింపదగియున్నవి. మనంతట మనము నిలబడలేక, తప్పటడుగులు పెట్టు స్థితిలో మన మిప్పు డున్నాము. ఇట్టి సందర్భములో ఏ పక్షమును అవలంబించక, స్వతంత్రించి వ్యవహారముల నన్నిటిని పరిష్కరించుకొనగల మనుకొనుట మేకపోతుగాంభీర్యము వంటిదే. ఇందుచేతనే భద్రతాసంఘపు చర్చలలో మనకు సహాయముచేయుటకు ఎవ్వరును సిద్ధపడరైరి.

## ఎవరి పక్షము మనము వహించుట ?

అయితే అగ్రరాజ్యములలో ఎవరిపక్షమును వహించుట ప్రస్తుతపరిస్థితులలో మనకు లాభకరము ? రష్యావారి పక్షమును అనుసరింపవలయా ? లేక ఇంగ్లండు అమెరికాల పక్షము వహించుటయా ? ఎవరి ద్వారా మనము ఎక్కువ బలమును సంపాదించుకొనుట కవకాశ ముండును? అనునది మనము నిర్ధారణ చేసుకొనవలెను. దీనినిగురించి రాబోవు సంచికయందు వివరింపబడును.

## పాలెస్టయిన్ : మధ్యప్రాచ్యము

ప్రస్తుతపరిస్థితులలో ఐక్యరాజ్యసమితి ద్వారా ప్రపంచమందు శాంతిసంస్థాపనము జరుగునని అనుకొనుట ఆకాశమున భవనములు కట్టుటకు ప్రయత్నించుటయే అని పాలెస్టయిన్‌లోని వ్యవహారములుకూడ చాటుచున్నవి. గతనవంబరులో పాలెస్టయిన్ సమస్యనుగురించి ఐక్యరాజ్యసమితి దీర్ఘచర్చలనేకములను చేసి, తుదకు ఆ దేశమును రెండురాజ్యములుగ విభజించుటయు, ఒక రాజ్యమును యూదులకొసమునను, రెండవదానిని అరబ్బులకొరకునను పెట్టుటయే సమస్యాపరిష్కారమునకు మార్గమని తీర్మానించిరి. ఈ తీర్మానమును అములులో పెట్టుటకు ఐదుగురు సభ్యులతో కూడిన సంఘమును స్థాపించిరి. గత ౨౯ సంవత్సరములు పాలెస్టయినును పాలించుచుండిన బ్రిటిష్‌వారు మే ౧౫ తేదీనుండి ఆగస్టు ౧౫ తేదీలోపుగ వారి సైన్యములను ఉపసంహరించుకొని, ఆగస్టు ౧౫ తేదీనుండి వారి పాలనమును వదలుకొనుటకు తీర్మానించుకొనిరి ఐక్యరాజ్యసమితివారేర్పరచిన సంఘము మే ౧ తేదీకి పాలెస్టయినుకు వచ్చునట్లును, దేశవిభజన చేయునట్లును, విభక్తరాజ్యములను పాలించుటకు తాత్కాలికప్రభుత్వములను ఏర్పరచునట్లును, ఇవి ఏర్పడునంతవరకు దేశమును పాలించునట్లును తీర్మానింపబడెను.

కాని ఈ దేశవిభజనకు అరబ్బులు సమ్మతించలేదు. దేశమంతయు ఒకే స్వతంత్రరాజ్యముగ నుండవలె ననియు, దానిని అధికసంఖ్యాకులగు తాముసు, అల్పసంఖ్యాకులగు యూదులును కలిసి పాలించవలె ననియు

అట్లు జరుగనిపక్షమున మధ్యప్రాచ్యములోని అరబ్బీ రాజ్యములన్నియు కలిసి ఐక్యరాజ్యసమితి చేసిన తీర్మానమును ప్రతిఘటించుటకు సైన్యసన్నాహము గావించి యూదులతోడను, వారి పక్షము ననుసరించు ఇతరులతోడను యుద్ధము చేసెద రనియు వారు ప్రకటించిరి. అదిమొదలు ఇప్పటివరకు—అనగా ఈ మూడు మాసములుగా— పాలెస్టయినులోని యూదులకును, అరబ్బులకును మధ్య అంతర్యుద్ధము జరుగుచున్నది. ప్రస్తుతము ఈదేశములో సుమారు ౧,౨౦౦,౦౦౦ అరబ్బులు, ౬౦౦,౦౦౦ యూదులు ఉన్నారు.

### వీరి బలాబలములు

కొన్ని సంవత్సరములుగా యూదులు రహస్య సైన్యములను తయారుచేసుకొనియున్నారు. అరబ్బులకు కూడ ప్రస్తుతము అట్టిసైన్య మున్నది. ఇదిగాక ఈజిప్టు, ఇరాక్, సౌదీఅరేబియా, ట్రాన్సుజోర్డన్, లెబనన్, సిరియా లోనగు ఆరు అరబ్బీరాజ్యములు వారివారి సైన్యములతో పాలెస్టయిన్ అరబ్బీలకు సహాయముచేయనున్నారు. అట్టి సహాయము కొంతవరకు ఇప్పటికే జరుగుచున్నది.

### బ్రిటిష్‌వారి వైఖరి

ప్రస్తుతము దేశమును బ్రిటిష్‌వారు పాలించుచున్నారు. దేశమందు అల్లరులు లేక ప్రజలను రక్షించు బాధ్యత వారిదే. కాని దేశము రెండురాజ్యములుగా విభక్తమగుట వారికి ఇష్టములేదు. ఈ విషయములో వారి అభిమానమంతయు అరబ్బుల పక్షమందే ఉన్నది. ఏలాగైనను అరబ్బులను బలపరచుటకు వారు ప్రయత్నముచేయుచున్నారు. దేశమును పాలించు బాధ్యతను మే ౧౫ తేదీతర్వాత వారు వదలుకొన్నను అటు తర్వాత ఏర్పడబోవు అరబ్బీరాజ్యముతో ఏలాగైన సంధిచేసుకొని పాలెస్టయినుపై తమ పలుకుబడిని నిలుపుకొనుటకు వారు నిశ్చయించుకొనియున్నారు. వీలైన యెడల దేశవిభజనము కాకుండునట్లు చేయుటకుకూడ వారు ఉద్దేశించియున్నారు. బ్రిటిష్‌వారు అరబ్బుల పక్షము వహించుటకు కారణము లేక పోలేదు. పాలెస్టయిను మధ్య ప్రాచ్యమందున్నది. మధ్యప్రాచ్యము బ్రిటిష్‌వారి ఆయువుపట్లలో ఒకటి. దీనిపై వారికి ఉండు ప్రాబల్యమును, పలుకుబడిని వారు కోల్పోయినయెడల వారి సౌఖ్యమునకును, సామ్రాజ్యాధికారమునకును స్వస్తి చెప్పవల్లె. వారికి కావలసిన పెట్రోలు చమురులో చాల భాగమును వారు ఇచటి దేశములనుండియే సంపాదించుచున్నారు. ఇరాక్ ఇరానులలో తయారగు పెట్రోలుచమురును వారు పాలెస్టయిను మీదుగ సముద్రతీరపు రేవుపట్టణములకు గొట్టములద్వారా తెచ్చుకొనుచున్నారు. ఇదిగాక పాలెస్టయిను లోనగు మధ్యప్రాచ్యదేశములు ఇంగ్లండునుండి తూర్పుఏషియాకును, ఆస్ట్రేలియాకును వెళ్ళు మార్గమధ్యమందున్నవి. ఈమార్గములో స్వేచ్ఛగ ప్రయాణము చేయుటకు బ్రిటిష్‌వారి విమానములకు, సైన్యములకు అవకాశ మున్నగాని ఏషియాఆస్ట్రేలియాలలోని వారి సామ్రాజ్యదేశములతో రాకపోకలు జరుపుటకును, యుద్ధకాలమందు విజయము సంపాదించుటకును వీలుండదు. కనుక ఏది ఎట్లు జరిగినను బ్రిటిష్‌వారుమాత్రము మధ్యప్రాచ్యమందు తమ కిప్పుడుండు ప్రాబల్యమును పోగొట్టుకొనుటకు ఇష్టపడజాలరు. కాని ఈప్రదేశమందలి రాజ్యములన్నియు మహమ్మదీయరాజ్యములు. అందుచేత వారు పాలెస్టయిను విభజనవిషయములో అరబ్బీలపక్షము వహించుటకు తీర్మానించుకొనియున్నారు. న్యాయము యూదులదా, అరబ్బీలదా అన్నది కాదు వారు ఆలోచించునది. ఎవరి పక్షము వహించినయెడల మధ్యప్రాచ్యములో తమకు గల పలుకుబడికి భంగములేకుండును ! అనుటయే వారి రాజనీతికి ఆధారము.

### అమెరికా వైఖరి

ఈ సందర్భములో అమెరికావారు గోడమీది పిల్లివైఖరిని ప్రస్తుతము అనుసరించియున్నారు. మధ్యప్రాచ్యదేశము సోవియటు రష్యావారి వశమగుట వారికి ఇష్టములేదు. సౌదీ అరేబియాలోను, మరికొన్ని మధ్యప్రాచ్యదేశములలోను వారు పెట్రోలుగనులను గుత్తకు తీసుకొనియున్నారు. వాటిని రక్షించుకొనవలసిన బాధ్యత వారికున్నది. ఈ రెండుకారణములచేత వారు బ్రిటిష్‌వారితో కలిసి పనిచేయవలసిన స్థితిలోనున్నారు. కానిఅమెరికాలో ౫౦ లక్షల యూదు లున్నారు. వారు పాలెస్టయినుయూదులపక్షము వహించుట సహజమేకదా ! వారు వర్తకవ్యాపారములలో చాల పలుకుబడి గలవారై అమెరికారాజకీయవ్యవహారములందు ఎక్కువ ప్రాబల్యమును సంపాదించియున్నారు. ఈ నవంబరులో జరుగబోవు అధ్యక్షుని ఎన్నికలలో వారి

వోట్లను సంపాదించుట ట్రూమన్‌కు ఆత్యవసరము. కనుక వారికి సమ్మతమగు పాలెస్టయిను విభజనకు అతడు అంగీకరించెను. అత డట్లు చేయుటవలన అమెరికాకు చమురుగనులకు ప్రమాదము కలిగించునట్లు మధ్య ప్రాచ్యములోని అరబ్బీరాజ్యములవారు ప్రజలు బెదరించుచున్నారు. ప్రస్తుతము ఈ బెదరింపు అధికముగ నున్నది.

## ఐక్యరాజ్యసమితి చేయవలసినపని

పాలెస్టయినును విభజించుటకు సమితిసభ తీర్మానించెను. దీనిని నిరోధించుటకు అరబ్బీ రాజ్యము లన్నియు సంకల్పించియున్నవి. అందుకై యూదులతో ఇప్పటికే యుద్ధము ప్రారంభమయ్యెను. ఇట్టి సందర్భములో సమితిసభ చేసిన తీర్మానమును అములులో పెట్టు బాధ్యతను భద్రతాసంఘమువారు వహించవలసియున్నది. సైన్యములందే దానిని అములులో పెట్టుటకు వీలులేదు. అందుకై తయారుగావలసిన సైన్యము అన్నిజాతులకును, రాజ్యములకును చెందిన అంతర్జాతీయ సైన్యముగ నుండవలెనేగాని ఏదో ఒక రాజ్యమునకు సంబంధించినదిగ ఉండుటకు వీలులేదు. అట్టి సైన్య మొకటి ఉన్నగాని పాలెస్టయిను వ్యవహారములను చక్కబరచుటకు తమకు సాధ్యము కాదని సభవా రేర్పరచిన పరిపాలకసంఘమువా రిదివరకే స్పష్టపరచియున్నారు. కాని ప్రస్తుతము ఐక్యరాజ్య సమితికి ప్రత్యేకసైన్య మేదియు లేదు. అట్టి సైన్యమును సమకూర్చు విషయములో రషియాకును, ఇంగ్లండు అమెరికాలకును అభిప్రాయభేద మేర్పడుటచేత అట్టి సైన్య మిదివరకు తయారుకాలేదు. మే ౧ లేదీలోపుగ ఇది తయారగు సూచనలు కనుపించుట లేదు. ఇట్టి సందర్భములో యూదులకును, అరబ్బులకును జరుగుచుండు అంతర్యుద్ధము రోజురోజునకు మరింత తీవ్రరూపమును ధరించగలదు. ఇండియాలో తమ సామ్రాజ్యవసాన కాలమందు హిందువులకు, మహమ్మదీయులకుమధ్య వైషమ్యములను వృద్ధిచేసి, రహస్యముగ మహమ్మదీయులను బలపరచినవిధముగనే పాలెస్టయినులో ప్రస్తుతము బ్రిటిష్‌వారు మహమ్మదీయులను బలపరచుచున్నారు. విదేశములందుండి పాలెస్టయినుకు రాదలచిన యూదులను నిరోధించుచున్నారు. బహిరంగముగ వారు సైన్యములను తయారుచేసుకొనుటకు ఆటంకములను కలిగించుచున్నారు. ఆయుధసామగ్రిని వారికి అందకుండచేయుచున్నారు. స్వతంత్రములగు అరబ్బీరాజ్యము లన్నియు అరబ్బుల పక్షమం దుండుటచేత వారి కిట్టి ఆటంకములు లేవు. ఇట్టి సందర్భములో ఐక్యరాజ్యసమితియొక్క ప్రతిష్ఠ నిలబడుటకు అంతర్జాతీయసైన్య మొకటి పాలెస్టయినులో మే ౧ లేదీనాటికైనను ప్రవేశించవలసి ఉన్నది.

## న్యాయాన్యాయములు

ఇంతకును దేశమును రెండు రాజ్యములుగ విభజించుట న్యాయమా, అను సందేహము కొందరికి కలుగవచ్చును. విభజనము యూదులకుకూడ అంగీకారముగ ఒకప్పుడు లేకుండెను. వారు కోరినది విదేశములలోని యూదులు స్వేచ్ఛగా పాలెస్టయినులో ప్రవేశించుటయే. కాని, అరబ్బులును, బ్రిటిష్‌వారును దీనికి సమ్మతించరైరి. దీనిమూలమున ప్రస్తుతము అల్పసంఖ్యాకులుగ నున్న యూదులు అధిక సంఖ్యాకు లగుదు రను భయము అరబ్బీలను పట్టి పీడించసాగెను. ఇట్టి సందర్భములో దేశవిభజన ఒక్కటే యూదుల కోరికలు సాఫల్యము గాంచుటకు సాధనము. అది జరిగినయెడల వారి కొక ప్రత్యేకరాజ్య మేర్పడును. అందులోనికి విదేశములలో బాధపడుచుండు యూదులు వచ్చుటకు వీలగును. ఇంతకును అట్లు రాగలవారి సంఖ్య ౩౫౦,౦౦౦ కు మించదని అంచనా వేసియున్నారు. యూరపులోనిఅన్ని దేశములనుండి ౧౦ సంవత్సరములమీద ౩౫౦,౦౦౦ యూదులు పాలెస్టయినులో స్థిరనివాస మేర్పరచుకొన్నంతమాత్రాన అరబ్బీలకు కలుగు ప్రమాద మెట్టిదో తెలియకున్నది. ఇదివరకు ఉండు ౬౦౦,౦౦౦ యూదులు, ఇకమీదట రాగల ౩౫౦,౦౦౦ యూదులు అందరును కలిసి ౧౩,౫౦,౦౦౦ జనము కాగలరు. ఇట్టి చిన్నరాజ్య మొకటి పాలెస్టయినులో ఏర్పడినందున అరబ్బీలకు ఎట్టి నష్టము లేదు. మతదురభిమానము చేతను, అనవసరమైన జాతిద్వేషముచేతను వారీవిధముగ ప్రవర్తించుట జరుగుచున్నది. పాలెస్టయినులో మొలకలెత్తుచున్న ఈ అంతర్యుద్ధము క్రమక్రమముగ తక్కిన ప్రదేశములకు వ్యాపించు ననుటలో అతిశయోక్తి లేదు.

## చైనా పరిస్థితులు

గతమాసములో చైనాపరిస్థితులుకూడ మిక్కిలి విషమించినవి. ఇప్పటకు మూడు సంవత్సరములుగ జాతీయప్రభుత్వమువారికిని, కమ్యూనిస్టులకును అంత

యుద్ధము జరుగుచున్నదని చదువరు లెరుగుదురు. ఈయుద్ధములో గతమాసమందు కమ్యూనిస్టులకు అఖండమైన విజయము లభించెను. అందుచేతనే ఆ దేశమందలి పరిస్థితులు విషమించిన వని చెప్పవలసియున్నది. చియాంగ్ కై షేక్ నాయకత్వముక్రిందనుండు జాతీయ ప్రభుత్వమునకు ఇట్టి పరాజయము కలుగుటకు కారణము లేవియో తెలుసుకొనవలసియున్నది. యూరోపియనులయొక్కయు, జపానువారియొక్కయు ప్రాబల్యమును తొలగించి దేశస్వాతంత్ర్యమును సంపాదించిన చియాంగ్ కై షేక్ ఆ స్వాతంత్ర్యమును నిలబెట్టుకొనలేని స్థితికి ఎందుకు వచ్చెను? దీనికి రష్యావారి సహాయమును సంపాదించిన కమ్యూనిస్టుల ప్రాబల్యము ఒకవిధముగ కారణమేగాని, వారి ప్రాబల్యమును అతడు అణచలేకపోవుటకు అతని పరిపాలనవిధానమందు కనుపించిన ప్రబలలోపము లనియే చెప్పవలసి ఉన్నది. జాగరూకతతో ప్రవర్తించనియెడల మన స్వరాజ్యమును నిలబెట్టుకొనుటలోకూడ అంతశ్శత్రు బహిశ్శత్రువులవలన కలుగు ప్రమాదము అధికము కావచ్చును. చైనాచరిత్రమునుండి మనము నేర్చుకొనదగు పాఠము లెన్నో కలవు.

## జాతీయ ప్రభుత్వము

విస్తీర్ణమందును, జనసంఖ్యయందును చైనాదేశము ప్రపంచములోని పెద్దదేశములలో ఒకటి. ఇందు ౪౫ కోట్ల జను లున్నారు. దీనిని ప్రస్తుతము పాలించుచుండు జాతీయపక్షముయొక్క పలుకుబడి కొంతకాలమునుండి తగ్గిపోయెను. ఈ పక్షములోని ప్రముఖులనేకులయందు స్వలాభపరాయణత్వము వృద్ధిగాంచుటచేత చీలికలు కొన్ని ఏర్పడెను. ఇదిగాక సుమారు పది సంవత్సరములుగ దేశమందు యుద్ధములు జరుగుచుండుటచేత సైన్యమునకై చేయబడుచుండు ఖర్చు విపరీతమయ్యెను. పన్నులమూలమున వసూలగు ఆదాయములో నూటికి ఎనభైవంతులు ఈవిధముగ ఖర్చగుటచేత ప్రజల సౌఖ్యాభివృద్ధికై ప్రభుత్వమువారు వ్యవసాయము, పరిశ్రమలు, ప్రయాణసౌకర్యములు మొదలైనవి వృద్ధి చేయలేకపోయిరి. ప్రజలలో జాతీయప్రభుత్వముపట్ల విరోధము ప్రబలుటకు ఇదియే ప్రధానకారణము. ఇదిగాక సైనికులసంఖ్య విపరీతముగ పెరిగెను. చక్కగ శిక్షపొంది నేర్పుతో యుద్ధము చేయగలవారితో కూడిన సామాన్యసైన్యము ప్రయోజనకారిగాని శిక్షలేనట్టియు, సంపూర్ణసాయుధులు కానట్టియు సైనికు లెందరుండిన నేమి? ఈలోపమును సవరించుటకట్టి ప్రయత్నము జరుగలేదు. అనేకులు—ముఖ్యముగా నడివయస్సులో నుండువారు—సైన్యములో చేరినకారణముచేత మామూలు వ్యవసాయాదిపనులలో పనిచేసి పంటలు పండించునట్టియు, ఇతరవస్తువులను తయారుచేయునట్టియు వారి సంఖ్య తగ్గెను. ఇందుచేత దేశములో ఉత్పత్తియగు ద్రవ్యము పడిపోయెను. ఆహారాదిపదార్థములు దొరకుట కష్టసాధ్యమగు పరిస్థితులు ఏర్పడెను. దీనిమూలమున మరియొక ప్రమాదముకూడ సంభవించెను. సైనికులు దేశమందు విచ్చలవిడిగ తిరుగుటయు, ప్రజలను దోచుకొనుటయు సర్వసాధారణ మయ్యెను. ప్రజల అసంతృప్తికి ఇదికూడ ఒక కారణము. ఇదిగాక సామాన్యప్రజల కుపకరించు సంస్కరణములను జాతీయప్రభుత్వమువారు చేయగలరను ఆశ వారియందు కొంతకాలముక్రిందట ఉండెను. కాని భూమివిషయమై అట్టి మార్పు జరుగకపోవుటయే గాక ఉద్యోగస్థులలో లంచగొండితనము అత్యధికమయ్యెను. పార్టీలో పలుకుబడి గల ధనికులు వర్తకవ్యాపారములలో ఎక్కువ అవకాశములను సంపాదించి ధరలను పెంచి కోటీశ్వరు లగుచున్నారు. చెలామణి ద్రవ్యమును అధికముచేయుటచేతను, ఉత్పత్తి తగ్గిపోవుటచేతను, ధరలు పెరిగిపోయి, సామాన్యజనులు, కార్మికులు నానాబాధలను అనుభవించుచున్నారు. విదేశములనుండి రావలసిన సరుకులు తగ్గిపోయెను. అట్టి సరుకులకు బదులుగా చైనాలో తయారుచేసిన సరుకులను ఎగుమతిచేయుటకు కావలసిన అనుకూలములు తగ్గిపోయెను. కనుక మొత్తముమీద చియాంగ్ కై షేకు యొక్క జాతీయప్రభుత్వముయెడల ప్రజల సుముఖత్వము చాలవరకు నశించెను. కొన్నిప్రాంతములలో కమ్యూనిస్టులు బలపడుటకు ఇదియే ప్రధానకారణము.

## మంచూరియా

ఈవిధముగ కమ్యూనిస్టులు వశపరచుకొనగలిగిన ప్రదేశములలో మంచూరియా మిక్కిలి ముఖ్యమైనది. ఇది రెండవ ప్రపంచయుద్ధమునకు పూర్వము కొన్ని సంవత్సరములనుండి జపానువారి వశములో నుండిన రాష్ట్రము. ఇందు సుమారు నాలుగుకోట్ల జనము

ఉన్నారు. బొగ్గు, ఇనుము మొదలైన ప్రధానఖనిజములు ఇచ్చట ఎక్కువగా దొరకును. వ్యవసాయముకూడ ఇచ్చట మంచిస్థితిలో నున్నది. పారిశ్రామికముగ కూడ చైనాలోని రాష్ట్రములన్నిటిలో ఇది ప్రాధాన్యము వహించినది. ౧౯౪౫ లో జపానువారు ఓడిపోయినతర్వాత రష్యావారు, చైనావారు ఒక సంధి చేసుకొని, ఈ రాష్ట్రము చైనాప్రభుత్వముక్రిందకు రావలె నను ఏర్పాటు చేసుకొనిరి. కాని ఈ ఏర్పాటు పూర్తిగ అమలులోనికి రాకముందే వీ రుభయులమధ్య అభిప్రాయభేదము లేర్పడెను. అప్పటికే అక్కడ కొంత ప్రాబల్యము సంపాదించిన కమ్యూనిస్టులు తగిన సమయము దొరికిన దని జాతీయప్రభుత్వముపై తిరుగబడి యుద్ధము సాగించుచు గతమాసములో అఖండవిజయమును సంపాదించి ప్రధానపట్టణమగు ముక్డెనగరముతప్ప రాష్ట్రమంతను వశపరచుకొనిరి. ముక్డెన్ కూడ త్వరలోనే వారికి వశముకాగలదు. సమస్తభోగభాగ్యములతో కూడిన మంచూరియారాష్ట్రమంతయు కమ్యూనిస్టులు వశపరచుకొనుట జాతీయప్రభుత్వమునకు ఒక గొప్ప దెబ్బ.

## అమెరికా సహాయము

ఈ పరిస్థితులను గమనించి చైనాసహాయార్థమై ౫౭ కోట్ల డాలర్లను ఖర్చుపెట్టుటకు అమెరికావారు గతమాసములో సిద్ధపడిరి. కాని ఈ సహాయము చేయు విషయములో వారు కొన్ని షరతులనుకూడ విధించిరి. జాతీయప్రభుత్వములోని లోపముల నన్నిటిని అమెరికా వారి సలహాపైన సర్దుపాటుచేయుటకు చియాంగ్ అంగీకరించవలసినవా డయ్యెను. దేశమందు అంతర్యుద్ధము మూలమున స్వరాజ్యము నిలబడకుండుటయు, అమెరికా వారి పలుకుబడి ఎక్కువగుటయు తప్పదయ్యెను. ఇదియే మనము ముఖ్యముగ గమనించవలసిన విషయము.

## జెకోస్లావేకియా

గతమాసమున ఒక మంచూరియాలోనే కాక యూరపుఖండదేశములలో నొక్కటియగు జెకోస్లావేకియాయందుకూడ కమ్యూనిస్టుపక్షమువారును, తద్వారా రష్యావారును విజయము సంపాదించిరి. ఈ విజయము పశ్చిమయూరపుదేశము లందును, ఇంగ్లండునందును, అమెరికాయందును ఎంతో చంచలనమును, సంక్షోభమును కలిగించినది. దీనికి కొన్ని ప్రధానకారణము లున్నవి. ప్రజాప్రభుత్వసిద్ధాంతముల ననుసరించి పరిపాలన నేర్పడిన దేశములలో గతముపై సంవత్సరముల నుండి జెకోస్లావేకియా పేరెన్నికగన్న దేశము. రెండవ ప్రపంచయుద్ధమున ఇది హిట్లరవశమై, తర్వాత స్వాతంత్ర్యమును సంపాదించెను. అటుపిమ్మట జరిగిన ఎన్నికలలో కమ్యూనిస్టులు, సోషలిస్టులు, తదితరులు పోటీచేయగా రష్యాపలుకుబడిలోనుండిన తక్కిన దేశములవలెగాక ఇచ్చట కమ్యూనిస్టులకు అధికసంఖ్యాక స్థానములు లభించలేదు. నూటికి ముప్పైయొక స్థానములే వారికి లభించెను. అప్పుడు వారు ఇతరపక్షములతో కలిసి మిశ్రమంత్రివర్గమును ఏర్పరచి రెండుసంవత్సరములుగ దేశమును పాలించుచువచ్చిరి. అందుచేత నియంతృత్వ ప్రభుత్వముగాక, ప్రజాస్వామ్యము ఇచ్చట నిలబడి యున్నదని భావింపబడెను. ఇదిగాక పరిశ్రమలలో ఈ దేశము మిక్కిలి ప్రఖ్యాతిగాంచినది. ఉక్కు, యంత్రములు మొదలైనవాటిని తయారుచేయుగల ఫ్యాక్టరీలు అనేకములు ఇందున్నవి. ఈ దేశములోనివారు రష్యావారితోను, అమెరికావారితోను సఖ్యము కలిగి ప్రవర్తించవలెనని కోరుచుండువారు. కాని ఈ పద్ధతి రష్యావారికి రుచించినది కాదు. ఈ దేశము చిన్న దేశ మగుటచేతను, ఇతరుల సహాయము లేక నిలబడలేనిది అగుటచేతను, దీనిచుట్టు రష్యావారిచే ఆక్రమింపబడిన దేశము లుండుటచేతను వారికి విరుద్ధముగ వీ రే పనిని చేయలేని స్థితిలోనికి వచ్చిరి. ఉదాః మార్షల్ ప్రణాళికను అనుసరించి అమెరికావారి సహాయమును స్వీకరించుటకు మొట్టమొదట ఈ మిశ్రమంత్రివర్గము వారంగీకరించినను, రష్యావారి ఒత్తిడిమూలమున వారు ఆ ప్రణాళికతోడి సంబంధమును వదలుకొనిరి. కమ్యూనిస్టు సిద్ధాంతముప్రకారము అనేకపరిశ్రమలను వీరిదివరకే ప్రభుత్వపరము గావించిరి. కాని మిశ్రమంత్రివర్గ ముండుట రష్యావారికి ఇష్టములేదు. శుద్ధమైన కమ్యూనిస్టుపార్టీప్రభుత్వమును నెలకొల్పుటకు వారు కొంతకాలముక్రిందట తీర్మానించుకొని, దానికి తగిన సంవిధానమును ఏర్పరచుకొనసాగిరి. ఈ మేనెలలో దేశములోని పార్లమెంటుకు ఎన్నికలు జరుగవలసియున్నది. ఆ ఎన్నికలలో కమ్యూనిస్టుపక్షమునకు మెజారిటీ లభించునో లభించదో, అన్న అనుమానము కలదు. ఇదిగాక అప్పటికి పశ్చిమయూరపులోని దేశములకు అమెరికావారు చేయుదలచుకొనిన

సహాయమునకు సంబంధించిన కార్యక్రమము ప్రారంభమగును. ఇట్టి సందర్భములో మే నెలకు ముందే కమ్యూనిస్టు ప్రభుత్వమును స్థాపించుట అవసరమనియు, అది జరిగినయెడల మే నెలలో జరుగు ఎన్నికలలో ఆ పక్షమునకే తప్పక జయము లభించుననియు, అందుకు కావలసిన పరిస్థితులను ఈమధ్యకాలములో కల్పించుకొనవచ్చుననియు వారు విశ్వసించి మిశ్రమంత్రివర్గములో కమ్యూనిస్టుపక్షమునకు చెందని మంత్రులపై లేనిపోని నిందలను ఆరోపించి, వారిచే రాజీనామాల నిప్పించిరి. పోలీసుశాఖలోను, సైనికదళమందును కమ్యూనిస్టుపక్షమునకు చెందినవారినే ఎక్కువగ చేర్చిరి. వీటి అన్నిటికి ఫలితముగ కమ్యూనిస్టుపక్షము వారి యాజమాన్యమున క్రొత్త మంత్రివర్గము ఏర్పడెను. జెకోస్లావేకియాకూడ కమ్యూనిస్టుదేశములలో నొక్కటిగను, రష్యాకు పూర్తిగ అధీనమైన దేశములలో నొక్కటిగను మారిపోయెను. ప్రపంచములో అన్ని ప్రాంతములందు జరుగుచుండు కమ్యూనిస్టుప్రజాస్వామ్యవిధానసమరములో ఇచ్చట కమ్యూనిస్టులకు గొప్ప జయము లభించెను.

కనుక గతమాసములో గమనించదగిన అంతర్జాతీయ వ్యవహారములలో కాశ్మీరసమస్యను భద్రతాసంఘమువారు సత్యముగ పరిష్కరించుటకు ఇష్టపడక పోవుట, పాలెస్టయిను పరిస్థితులు ప్రమాదకరములగుట, మరియు జెకోస్లావేకియాలో కమ్యూనిస్టులు విజృంభించుట—ప్రధానములైనవి.

### భారత ఖండము

శాంతిభద్రతలు దేశమందు సుస్థిరమగుటకు ప్రభుత్వమువారు గతమాసములో కొన్ని ప్రధానచర్యలను తీసుకొనిరి. హిందూమహాసభకును, రాష్ట్రీయస్వయంసేవకసంఘమునకును, మహమ్మదీయ నేషనల్ గార్డ్సుకును సంబంధించిన నాయకులనేకులను కారాగారబద్ధుల గావించిరి. కొన్ని రాష్ట్రములలో స్వయంసేవకసంఘమును అక్రమసంఘముగ ప్రకటించిరి. ఈ సంఘము ద్వారా తర్ఫీదుపొందిన శాఖలను, మహమ్మదీయ నేషనల్ గార్డ్సును, ఖాక్సార్ దళములను రద్దుచేసిరి. అనగా ప్రైవేటు సైనికదళములు దేశమం దెచ్చటను ఉండరాదను సిద్ధాంతానుసారముగ ఈ చర్యలన్నియు తీసుకొనబడెను. ఈ సిద్ధాంతముయొక్క ప్రాధాన్యమును గత సంచికయందు వివరించియుండుటచేత దానినిగురించి తిరిగి ప్రస్తావించుట అనవసరము.

### వ్యక్తులు: సంస్థలు

కాని విప్లవకాలములో — ప్రస్తుతము మన దేశము విప్లవములో మునిగియున్నది— నేరము చేసిన వారితోపాటు నేరముచేయనివారుకూడ బాధపడుట సంభవించును. స్వయంసేవకసంఘముతోను, హిందూమహాసభతోడను ఏదో సంబంధమున్నదన్న కారణముచేత అనేకులను అరెస్టుచేయుటయు, కారాగారములలో పెట్టుటయు జరిగెను. ఈసంస్థలు అక్రమము లని ప్రకటితములు కాకపూర్వము వాటియందు సభ్యులుగ నున్నవారిని కారణాంతరము లేవియు లేక కారాబద్ధుల గావించుట న్యాయము కాదు. వారిలో దోషు లెవరో, ఎవరు కారో నిర్ణయించుటకు కాలవ్యవధి లేనప్పుడు, వారిని బంధించినతర్వాతనైన, కాలయాపన లేక వారు దోషులో కారో నిర్ణయించుటకు తగిన ఏర్పాటులుచేయుట అత్యవసరము. ఇట్టి సమయములలో పగ సాధించుకొను ఉద్దేశముతో నిర్దోషులైనవారినికూడ బాధించుట అధికారులకు స్వభావము. అధికారులకు బంధువులుగ నుండువారును, వారికి స్నేహితులగు వారును కూడ వారికి గల బాంధవ్యమును, స్నేహమును దుర్వినియోగముగావించి, తమ విరోధులను కారాగారబద్ధు లగునట్లు చేయుట కలదు. కనుక బందీకృతులను వెంటనే విచారణచేసి, దోషు లని అనుకొనుటకు ఆధారము లేనప్పుడు వారిని వదలివేయుట అత్యవసరము. ఈ సామాన్యసూత్రమును అనుసరించనియెడల అధికారుల నిరంకుశత్వము ప్రబలుటయు, ప్రజల స్వేచ్ఛకు అనవసరములగు ఆటంకములు కలుగుటయు, కులకక్షలు పెరుగుటయు, ప్రభుత్వమువారు క్రమక్రమముగ ప్రజాదరమును కోల్పోవుటయు సంభవించును. నిర్దోషులను శిక్షించు పరిస్థితిని కల్పించుటయే నిరంకుశప్రభుత్వమునకు లక్షణము.

### కులవివక్షారహితమగు రాజ్యము

మహాత్మాగాంధిగారి నిర్యాణానంతరము అధికారములో నుండు నాయకులందరు, మనయొక్క ఆదర్శము కులవివక్షారహితమగు రాజ్యమును స్థాపించుట అని ప్రకటించుచున్నారు. ఇది చాల అవసరమైన ప్రకటన. కాని వారు ఇట్టి భావమును ప్రకటించుట

మాత్రమేగాక, దానియొక్క అర్థమును సంపూర్ణముగ గ్రహించి, దాని ననుసరించి ప్రభుత్వమును నడుపుటకు సిద్ధులు కావలెను. ప్రభుత్వము చక్కగ జరుగుచున్నదా, లేదా అనుటకు ప్రకటితములగు ఆదర్శములుమాత్రమే సాధనములు కావు. ఆదర్శములు ఎంతవరకు ఆచరణలో నున్నవో దానినిబట్టియే ఈ నిర్ణయము జరుగవలెను. బ్రిటిష్‌పరిపాలనలో వ్యక్తియొక్క కులమునుబట్టి అతనికి రాజకీయసదుపాయములను కల్పించుటయు, కల్పించకపోవుటయు జరుగుచువచ్చెను. మహమ్మదీయు డైనంతమాత్రముచేతనే అతడు కొన్ని ఉద్యోగములకును, కొన్ని సహాయములకును అర్హుడైనట్లు పరిగణింపబడెను. అట్లే క్రైస్తవ, ఆంగ్లో-ఇండియన్, హరిజన, బ్రాహ్మణ, బ్రాహ్మణేతరవ్యక్తుల విషయమునగూడ జరుగుచువచ్చెను. ఆకలిగొన్నవా డెవ డైనను వానికి అన్నముపెట్టుటకు బదులు, అతడు మహమ్మదీయుడా క్రైస్తవుడా, అన్న విచక్షణ చేయుచుండిరి. చదువువలన లాభము పొందుట కర్హులైన వారికి చదువుచెప్పుటకు బదులు చదువువాడు బ్రాహ్మణుడా, బ్రాహ్మణేతరుడా, క్రైస్తవుడా అన్న అప్రస్తుతవిషయమును గమనించుచుండిరి. వ్యక్తియొక్క అర్హతానర్హతలను, యోగ్యతాయోగ్యతలనుబట్టి కాక వారి మతము, కులము, వర్ణము బట్టి ప్రభుత్వమువారు వారికి లాభనష్టములను కలిగించుటయే కులవిచక్షణాసహితమగు రాజ్యము. అట్టి అర్హతానర్హతలనుబట్టి లాభనష్టములను కల్పించుటయే కులవిచక్షణారహితమగు రాజ్యమునకు లక్షణము. మనము కోరదగ్గది కులవిచక్షణారహితమగు రాజ్యమనుటలో వివాద ముండదు.

## కులసంస్థలు

కాని కులవిచక్షణాసహితమగు రాజ్యాంగవిధానమును కోరు సంస్థలు హిందూమహాసభ, ముస్లింలీగు మొదలైన మతసంస్థలేనా? అట్టి సంస్థలు ఇతరము లైనవి లేవా? కాంగ్రెసుకూడ కొంతవరకు అట్టిసంస్థ కాదా? అన్న అనుమానము కొందరిలో కలుగుచున్నది. సంస్థయొక్క నిజస్వరూపము, నిజస్వభావము, దాని ఆదర్శములు ఆశయములుబట్టి కాక కార్యాచరణలో అది అవలంబించు పద్ధతినిబట్టి తీర్మానింప వలసిఉన్నది. కొన్ని రాష్ట్రములలోని కాంగ్రెసు ప్రభుత్వములు వ్యక్తియొక్క కులము, వర్ణము, మతమును అనుసరించి అతనికి సదుపాయములు కల్పించుటయు, కల్పించక పోవుటయు జరుగుచున్నది. ఎంతకాలము ఇది జరుగునో అంతకాలము కాంగ్రెసుకూడ కులసంస్థ యని చెప్ప వలసివచ్చును. కనుక ఈవిషయమై విపులముగ పరిశోధించుట అత్యవసరము. (1-8-48)



# త్యాగరాజస్వామి కృతులు

శ్రీ కె. వి. యస్. గిర్మాజీరావు

ఆదికాలములో ఋషుల మనోవీథులనుండి వాఙ్మయరూపాలలో వేదాలు ఏమాదిరిగా బయలువెడలినాయో, అదేమాదిరిగా మన త్యాగరాజస్వామి హృదయకమలమునుండి కృతులు అసంఖ్యాకంగా వెలువడ్డాయి. అయితే, ఆనాటి ఋషుల కాలంలో సంగీతసంపత్తు తక్కువ. సామవేదకాలం నాటికిగాని సంగీతసంపత్తు సరిగా అమరినట్లు లేదు. కాని, ఆదికాలంనుండీకూడా, నాదం అనంతవ్యాప్తమైన సచ్చిదానందస్వరూపంగా వారు గ్రహించినట్లు బాగా కనిపిస్తూనేఉంది. ఈనాదాన్నే వారు 'ఓం' అని గ్రహించారు. ఇంక, మన త్యాగరాజస్వామికాలంనాటికో—కావలసినంత గానసంపత్తు. ఆదికాలంనుండీ, ఏ నాదము అనంతవ్యాప్తమైనదిగాను, సచ్చిదానందమైనదిగాను భావింపబడి ఓంకారమని ఉపాసింపబడుతూవచ్చిందో ఆ నాదమే శృతి, స్వర, గ్రామ, మూర్ఛనా, జాతి, రాగ, తాళ, ప్రబంధాదిఅంగాలతో, నాదవిద్య అనే పేరుతో అపారమైన శాస్త్రాన్ని నిర్మించుకొని 'సంగీతకళ' అనే విశ్వమోహనరూపాన్ని పొంది విరాజిల్లుతూంది. మన త్యాగరాజు ఈ విశ్వమోహనరూపమైన నాదాన్నే ఉపాసించి, తద్ద్వారా అనంతవ్యాప్తుడైన పరమాత్మని పాదాలపై తన ఆత్మకుసుమమును సూటిగా సమర్పించి జీవన్ముక్తుడైనాడు. అందువల్లనే ఆ మహనీయుని కృతులు పరిపూర్ణమగు గానకళారూపములై మన సంగీతమునందు అద్వితీయమగు స్థానమును ఆక్రమించాయి.

త్యాగరాజస్వామి తన నిరంతరగానకళానుభవమువల్ల క్రమంగా ఈ క్రింది మూడువిషయాలకు చెందిన సత్యాలను ముఖ్యంగా అనుభవమునకు తెచ్చుకొనినట్లు ఆయనకృతులలో ఆ మహనీయుడు ప్రదర్శించిన అపూర్వ కళానిపుణతనుబట్టి చూస్తే విశదమవుతూంది.

(౧) ఎటువంటి వర్ణములతో కూడిన మాటలు గానకళారూపాన్ని విచ్ఛిన్నంచేయకుండా ఉంటాయి?

(౨) అటువంటి వర్ణములతో కూడిన పదములను (మాటలను) ఏరీతిగా గానంలో అమరిస్తే నాదలీనమై గానంతో కలిసిపోతాయి?

(౩) ఎటువంటి స్వరసమ్మేళనలకు ఎటువంటి పదాలను ఏ రీతిగా జోడిస్తే, పదములయొక్క అర్థం తెలియనివారికికూడా ఆయా పదముల భావము వాటికి చెందిన స్వరసమ్మేళనలచే గలిగెడి రసానుభవమువల్ల అప్రయత్నంగా అనుభవమవుతుంది?

పై మూడువిషయాలలో మూడవదానిని నిరుడు రాజమహేంద్రవరం, బెజవాడ, చెన్నపట్నములలో వైభవంగా జరుపబడిన త్యాగరాజస్వామిశతవార్షికోత్సవసందర్భములలో శ్రీ టి. వి. సుబ్బారావు మున్నగు ప్రముఖులు కొంతవరకు విపులీకరించినట్లు పత్రికలలో చదివియున్నాము. ఇంక ఒకటవ, రెండవ విషయాలలో అతిసూక్ష్మమైన శాస్త్రసత్యములు, అపురూపములైన అనేకకళాధర్మములు గోచరిస్తూన్నాయి. వాటి నన్నిటినీ ఉదాహరణాలతో వర్ణించడం ప్రారంభిస్తే అది ఒక పెద్ద గ్రంథమవుతుంది. అందువల్ల అతిముఖ్యమైన ఒకటి, లేక రెండు అంశములనుమాత్రం కొద్దిగా వివరిస్తాను. ఇందువల్ల ముఖ్యంగా గానసభలలో గానంచేసే గాత్రగాయకుని ఏయే విషయాలలో ఎట్లు, ఎంతవరకు విమర్శించవచ్చును? ఏయే విషయాలను విమర్శించినందువల్ల

దేశంలో గాత్రగానకళకు దెబ్బ తగులుతుంది? అనేవి కొంతవరకూ మనకు గ్రాహ్యమవుతాయి.

మన త్యాగరాజు తన నిరంతరగానకళోపాసనలో అనుభవించిన సత్యాలలో ఆ మహనీయుడు తన కృతుల సాహిత్యమునందు ఉపయోగించిన అచ్చుల వ్యాపకపద్ధతి ఒకటి.

భాషలోని అచ్చుల లక్షణమును పరిశీలించి చూస్తే, ఒక్కొక్క అచ్చు అన్యోన్యత్వముతో కూడిన కొన్ని ధ్వనుల రూపముగా కనబడుతుంది. కనుకనే ఆంగ్లభాషలో శాస్త్రకారులు వీటిని కాంపౌండు నోట్సు (Compound notes) అన్నారు. అనగా, అనురణనాత్మకధ్వనియుతము లైనవన్నమాట. ఇంకా, ఒక్కమాటలో నే చెప్పాలంటే, స్వరము లన్నమాట. ఇంక, అనురణనాత్మకధ్వనులు ఒక్కొక్కరకం అచ్చునందు ఒక్కొక్కమాదిరిగా ఉంటాయి. వీటిలో ౧, ౩, ౫ అని ఇట్లు బేసిసంఖ్యల క్రమములో ఉండే అనురణనాత్మకధ్వనులు గల అచ్చులు ౨, ౪, ౬ అని ఇట్లు సరిసంఖ్యలక్రమముతో ఉండే అనురణనాత్మకధ్వనులతో కూడిన అచ్చులకంటె ఎక్కువ రంజకంగా ఉంటాయి. ఒక్కొక్కరకం అచ్చుకు దాని స్వభావమునుబట్టి కాలపరిమితికూడా ఉంది. కనుకనే సాధారణముగా మాట్లాడునప్పుడు వాటి కాలపరిమితి సరిగా గమనించనందువల్ల వాటి అనురణనాత్మకధ్వనులలోని స్వయంభూధ్వనులు (upper partials) ప్రాబల్యం వహిస్తాయి. ఇటువంటి ప్రాబల్యంవల్లనే మాట్లాడునప్పుడు భాషలోని అచ్చుల ధ్వనులు ఒకవిధమైన చీలికగుణం వహిస్తూఉంటాయి. కాని, గానం చేయునప్పుడు, గానము లయయుక్తముగాను, తాళయుక్తముగాను ఉండుటవల్ల ఆయా అచ్చుల కాలము సరిగా పరిగణింపబడుతుంది. తాళాన్ననుసరించి గానము చేయునప్పుడు వడిదుడుకు ఉచ్చారణగాక, క్రమయుతమైన సమానకాలములో ఉండుటవల్లను, గానముచేయునప్పుడు నోటిరూపము గాలితో కూడిన గుల్లఆకారంగా తయారగుచుండుటవల్లను ఆయా అచ్చులయందలి అనురణనాత్మకధ్వనులలోని ఆధారస్వరముయొక్క నాదమును బలపరుచును. ఇందువల్లనే గాత్రగానమునందు అచ్చులు చక్కగా శ్రుతిపేయమై గానమును సిద్ధింపజేయుచున్నవి. కనుకనే ఏదేశమందలి గానపద్ధతిలో నైనసరే, గాత్రగానములో అచ్చుల వ్యాపకము లేనిదే గానకళ సిద్ధింపదు. ఇంతేకాదు, అచ్చుల వ్యాపకము ఎంత హెచ్చుగా ఉంటే, గాత్రగానమునందలి గానకళ అంత హెచ్చుతరమైన రంజకత్వమును వహించి ఉంటుంది. ఇంక, భారతీయ గానము రాగసంప్రదాయమైనది. అనగా రాగసంప్రదాయమే భారతీయగానకళయొక్క విశిష్టత. ఇందువల్ల ఏ సందర్భములో గాని ఇది విస్మరించరాని విషయ మనిమాత్రం ముఖ్యంగా మనము గమనించి తీరాలి. ఇందువల్ల భారతీయగానములో, విశేషించి మన కర్ణాటకగానంలో అచ్చుల వ్యాపకము మరీ ముఖ్యమైనది. సన్యాస, విన్యాస, అలంకార, గమకాదులు ఉండవలసిన క్రమమునకు భంగము వచ్చినను, లోపించినను రాగము వర్ధిల్లకపోవడమేగాకుండా రాణిల్లనేరక రసవిహీన మగును. ఇందువల్ల గానప్రయోజనము సిద్ధింపదు. గమకయుతమగు స్వరసమ్మేళనలచేతనే గానము తరతమభేదములతో వివిధరసములను ప్రతిష్ఠింపగలుగుతుంది. ఇంక సన్యాస, విన్యాస, అలంకార, గమకాదులను సరిగా గానంచేయుటకు అచ్చుల వ్యాప్తి అవసరమని అందరకూ తెలిసిన విషయమే. కనుకనే త్యాగరాజస్వామి తన కృతులలో గల సాహిత్యమునందు అచ్చులను అతిధారాళముగా వ్యాపింపజేసినాడు. ఇట్లు ఆ మహనీయుడు అచ్చులను వ్యాపింపజేయుటలో జూపిన కళానిపుణత వర్ణనాతీతము. అచ్చుల వ్యాపకపద్ధతి త్యాగరాజస్వామికి పూర్వము రచియింపబడిన సంగీతకళాప్రబంధములలో కూడ కలదు. అయితే, ఆయా స్థాయిలలో, ఆయా అంగాలలోని ఆయా సన్యాసవిన్యాసక్రమాదులలో ఎచ్చట శబ్ద ముండాలి, ఎచ్చట అచ్చులవ్యాపకముండాలి అనే విషయంలోను, ఏయే అచ్చులను, ఏయే అంగాలయందు, ఏయే రకం సన్యాసవిన్యాసగమకాదులలో ఎటువంటి క్రమము ననుసరించి ఎంతెంత వ్యాపింపజేయాలి అనే విషయాలలో పూర్ణమైన రాగానుభవంవల్ల అవిరళముగా రసప్రపూరితస్వాద

యుండై అచ్చులను అసమాన కళానిపుణతతో అతిధారాళముగా వ్యాపింపజేసి, తన్మూలమున తనకృతులను సంపూర్ణగానకళారూపములుగా సృష్టించిన ప్రప్రథమ గానకళోద్ధారకుడు శ్రీ త్యాగరాజస్వామి. ఒక్కొక్కప్పుడు ఈ మహనీయుడు రెండేరెండు వర్ణములు లేక శబ్దములు గల మాటలలో కూడ అచ్చులను బహు నిపుణతతో సంగతులయందు ఒకానొకవిధమైన పరిణామమార్గముతో వ్యాపింపజేసినాడు. ఇటువంటి సర్వసంపూర్ణములైన కళాసంశోభితములుగనుకనే ఈయన కృతులు కేవలం జంత్రప్రబంధాలుగా కూడ రక్తినిచ్చుటలో ప్రథమశ్రేణిని ఆక్రమించాయి. సర్వసాధారణంగా, జంత్రసంవిధానముతో కలిసి సంపూర్ణముగా గానకళాభూయిష్ఠమైతేనే గాని గానప్రబంధాలు జంత్రప్రబంధాలుగా రాణించనేరవు. వయొలిన్, వీణ, వేణు మొదలైన వాద్యాల స్వతంత్రసంగీతకచేరీలలో త్యాగరాజకృతులు కేవలం జంత్రప్రబంధాలుగా ప్రదర్శింపబడినప్పుడు వాటి సంగీతప్రతిభ ఎంత రసవంతముగా రక్తినిస్తూన్నదో శ్రోతలెల్లరకును అనుభవమవుతూన్న విషయమే.

ఇల్లాగే, ఈమహనీయుని కృతులలో, ఆయా అచ్చులను వ్యాపింపజేసిన పద్ధతులలో కూడ ఒకానొక అపూర్వకళానిపుణత కూడ గోచరిస్తూంది. ఇంక, అచ్చులు చక్కగా శ్రుతిపేయమై గానకళను పోషిస్తాయని ఎప్పుడైతే అనుభవమైనదో, అప్పుడే సాహిత్యములో ఉండే మాటలలోని(పదాలలోని)శబ్దాలుకూడా (అక్షరములుకూడా)అచ్చులతో అంతమైనవే అయితే గానయోగ్యమవుతాయని అనుభవమునకు వచ్చితీరుతుంది. ఇందువల్లనే మన త్యాగరాజస్వామి కేవలం అచ్చులతో అంతమయే అక్షరాల (శబ్దాల)తో కూడుకొన్న పదాలనే (మాటలనే) తన కృతుల సాహిత్యములో ఉపయోగించినాడు. ఈ పద్ధతివల్ల రసప్రపూరితమైన గానవాహినిని అచ్చులు అనబడే సెలయేళ్లద్వారా మాటలతో కూడుకొన్న భాషాశ్రేణిలోనికి ప్రవహింపజేసియూ, అచ్చులతో అంతమయే శబ్దజాలము (అక్షరములు)తో కూడిన మాటలనే వాడి (పదాలనే వాడి) తద్రీత్యా శబ్దాంత్యస్వనములైన అచ్చులద్వారా ఆయా మాటలలో గల ప్రతిశబ్దంలోనికి కూడ గానమును అంతర్వాహినిగా ప్రవింపజేసియూ త్యాగరాజస్వామి తన కృతులలో గల సంగీతముతో సాహిత్యాన్ని చక్కగా సమ్మిళితంచేశాడు. ఈపద్ధతిని అనుసరించడములో ఈయన ముఖ్యంగా (౧) లలితంగా మీటబడిన వీణమీటుయొక్క శబ్దం ఎంత శ్రుతిపేయంగా ఉంటుందో అటువంటి శ్రుతిపేయంగా ఉండేటటువంటి లలితమైన శబ్దజాలముతో, అనగా అచ్చులతో అంతమయే వర్ణములు, లేక అక్షరములతో కూడిన మాటలనే (పదములనే) ఉపయోగించాడనీ, (౨) బహు చిన్నవిగా ఉండి, ఉచ్చారణకు బహుసౌకర్యంగా ఉండే మాటలనే ఉపయోగించాడనీ, (౩) కృతిలో, మొత్తంమీద ఎంత తక్కువగా సాహిత్యమును (మాటలను) ఉపయోగించడానికి వీలు అవుతుందో అంత తక్కువగానే మాటలను, అనగా సాహిత్యాన్ని ఉపయోగించినాడనీ, (౪) ఆయా మాటలను ఆయా స్వరసమ్మేళనలతో ప్రబంధస్వరూపానికీ, రాగభావమునకూ దెబ్బ తగులని రీతిలో జోడించాడనీ, (౫) ఆయా రసముల తరతమభేదములను ప్రతిష్ఠించెడి ఆయా స్వరముల సమ్మేళనల భావములకు సరియగు అర్థభావములు గల మాటలనే జోడించాడనీ, (౬) ఆయా తరతమరసభేదములతో కూడిన రాగరంజకప్రయోగముల భావములకు సరియైన అర్థభావము గల పదములు చేర్చబడినప్పుడు ఎంత విశ్రాంతిగల ఏ గ్రహములో ఏ మార్గమననుసరిస్తే ఆయా భావాలకు, ఆయా తరగతుల తరతమభేదములకు చెందిన రసమునకు చక్కని పోషణ అవుతుందో అంతేసి విశ్రాంతులు గల ఆయా గ్రహాలలో అందుకు సరియైన మార్గాలనే ఆయా రాగతాళాలలో అనుసరించినాడనీ మనకు స్పష్టంగా ఆయనకృతులలో కనబడుతూంది. ఇందువల్ల శ్రీత్యాగరాజస్వామికృతులలో గల అనేకవిశిష్టలక్షణాలలో పై ఆరు విషయాలు ఆరు అతిముఖ్యమైన విశిష్టలక్షణా లని చెప్పవచ్చును. అయితే, పై ఆరు విశిష్టలక్షణాలలో మొదటి మూడున్నూ విశేషమైన సాహిత్యపాండిత్యంచేత కొంతవరకు సాధించవచ్చును. కాని, తరువాతివైన ౪, ౫, ౬-వ విషయాలు మాత్రం కేవలం అపా

రమైన సంగీతపాండిత్యమే కాకుండా అవిరళమైన నిజ గానకళానుభవముపైన ఆధారపడి ఉన్నాయి. అసలు, త్యాగరాజస్వామైనా కేవలం కళానుభూతికి సంబంధించిన పై ౧వ, ౨వ, ౩వ విషయాలు ఎల్లా అనుభవానికి తెచ్చుకొన్నాడో ఆ మహనీయుని చరిత్రవల్ల తెలుస్తూనే ఉంది. ఆయన తన ఇష్టదైవమైన శ్రీరామచంద్రమూర్తిని ధ్యానించేటప్పుడు మనోనిశ్చలత్వం కొరకు మొదట శ్రుతి వేయుంగా రాగాలాపన చేయడం ప్రారంభించేవాడట. అల్లా ఏకధ్యానంతో సంపూర్ణముగా తన మనసును నాదంలో లీనంచేసుకొని ఆ రాగాలాపనవల్ల కలిగే తరతమభేదాలతో కూడిన రాగరసమును సంపూర్ణముగా అనుభవించేటప్పుడు ఆ రసానుభవమువల్ల కలిగిన తన్మయత్వావస్థలో ఆయనహృదయంలో కలిగే భావపరంపర ఆ అవిరళ రాగాలాపనలో క్రమేణా సంగతిరూపం తాల్చేనట. ఆయన స్వతస్సిద్ధంగా అద్వితీయమైన సంగీతకళాకోవిదుడు, పండితుడు అయినందువల్ల ఆ సంగతే ఆ భావాన్ని, రసాన్ని చక్కగా పోషించే రీతిలో ఒక తాళంలో, అందుకు సరియైన మార్గంలో, లయబద్ధమై అందుకు తగిన గ్రహములో ప్రారంభమయేదట. ఇల్లా క్రమంగా అవిరళరాగాలాపనచే సంభవించిన రసానుభూతివల్ల ఉత్పన్నమైన భావాలు రాగసంగతుల రూపాలు తాల్చేటప్పుడే ఆ భావాలకు సరియైన అర్థాలు గల పదాలు (మాటలు) కూడా అనువుగా చేర్చబడేవట. ఈ పద్ధతిలో గానాన్ని అనుసరించే మాటలు బహులలితంగాను, చిన్నవిగాను ఉండేవిమాత్రమే. ఇంతే కాదు, మాటల సంఖ్యకూడా బహు తక్కువే. ఉదాహరణగా చెప్తాను: ఒకప్పుడు రాగరసానుభూతివల్ల ఒకరకం భావపరంపర సంగతిరూపం తాల్చినప్పుడు దాని సరియైన అర్థం గల మాటలు "మరియాద గాదుర" అని అనువుగా చేర్చబడి ఒక తాళములో లయబద్ధమైంది. అదే భావం వివిధరకాలుగా గానరూపాలు పొందేది. కాని, మాటలు మాత్రం అవే. మొదట ఉత్పన్నమైన భావపరంపరకు సందర్భించిన మరికొక భావం దానంతట అదే గానరూపం పొందేవరకూ మొదటిదే ఆ మాటలతోనే అనేక గానరూపాలు పొందేది. ఈ రూపాలే సంగతులని వ్యవహరింపబడుతూన్నాయి. ఇల్లాగే, పల్లవి, అనుపల్లవి, చరణము కూడా రాగరసానుభవమువల్ల ఉత్పన్నమైన వివిధభావపరంపరలు గానరూపంలో అనువుగా చేర్చబడిన మాటలతో గానంచేయబడి కృతిరూపం తాల్చేది. ఇందువల్లనే అనుపల్లవిగానానికి, చరణం గానానికి పల్లవిగానం చేర్చినప్పుడే ఆయా భావపరంపర పరిపూర్ణరూపాలు ఎట్లా తేలుస్తాయో అట్లే అనుపల్లవిమాటల చివరనూ, చరణంలోని మాటలచివరనూ పల్లవిలోని మాటలు చేర్చినప్పుడే పూర్ణమైన అర్థం చూపిస్తాయి.



# పూజ్య బాపూజీ!

శ్రీ చెరుకుపల్లి జమదగ్నిశర్మ

భువనోన్నతత్వమ్ము పుక్కిలించిన నీదు హత్యాప్రసంగమ్ము నాలకించి
శ్రవణేంద్రియమ్ము విశ్వాసఘాతక మేమొ కాకున్న నిదియు నిక్కంబె యనునె?
కాదు కాదని రొంచి కాలు కాలినయట్లు కదలాడి తుదకు నిక్కంబె తేలెంగి
ఆత్మోపసంహార మైనయట్లుగ విశ్వదేహమ్ము పడియె నిరూహ మగుచు
నింతదైనది, మీఁద నింకేమి యగునొ?-లోకముల శాంతిగోరు సుశ్లోకు వెడఁద
తప్తలోహికగోళ సంతప్తమైన - జగతి యేమగు? పాపదష్టమ్ము కాక !

అదయాన్యపరిపాలితాత్మీయభూమాతృదాస్యమ్మునకుఁ దీవ్రతాప మంది,
గ్రాసవాసోదీన కంకాళసమప్రజాకోటిదుస్థితికి సంక్షోభ మంది,
మాధవిశ్వాససంభూతదుర్యాంతర్నిబద్ధసంఘము చూచి బాధఁజెంది,
మతమాఢ్యమధుపానమత్తమానవరూప జంతుసంతతి దిద్ద శ్రమవహించి,
బ్రదికినన్నాళ్ళు క్షణము విశ్రాంతి గానక - నీవు చేసిన మేలు మన్నించిరైన
నూరకొనలేకపోయె మా యుక్కువుండు. - చచ్చుటకుఁగూడ పెనుబాధ తెచ్చిపెట్టె !

ఓమహాత్మ! నీయెడఁద నుండదు కోపము సంతరేని, మ
మోఘమైన నిన్ను చంపుకొనియుంటకు సిగ్గిలియేడ్తు మీఁతిరే !
స్వామి! భవద్దయామధువు సాగి స్రవించిన యీపాలాన నీ
ప్రేమ ఫలించి ద్వేషఫలబీజము చచ్చుత నిర్విశేషమై !

మానుషాకృతిఁ దాల్చి మహికి డిగ్గిన పరంజ్యోతిస్వరూపభాసురమరీచి,
లోకమంతయు వ్యతిరేకమైనను సత్యవాక్కుచే పలుకు నేకైకవాణి,
బడుగైన యొడలితో నడుగైన కదపక విశ్వమ్ము నెదిరించు వినుతశక్తి,
హింసాతమఃప్రావృతేహప్రవిష్టమ్మసామాన్యమౌ నహింసామహస్సు,
తనువు ధరియించి యారాధ్యదైవమయ్యు - నింత బలవంతమైన నిప్రాక్కంతి కిట్లు
పాల్పడిరి వన్న లోక మే పగిది సామి? - అమృతమయమైన నీరొక నగ్గిపెట్టె !

ద్వంద్వమయము, సంఘర్షణాత్మకమునైన - దైవసృష్టిని తప్పు దిద్దఁగఁబూని
ప్రకృతిశక్తుల దారుణాగ్నికిని బలిగ - ప్రాణమిచ్చిన బలివి మహాత్మ నీవు!

ఈజగమెల్ల నీదగు మహిమ్నతకుఁ ప్రణమిల్లిగూడ నీ
యోజఁ జరింపలేక ప్రతియోన్ముఖమై పయనించుచుండెఁ; ని

రాజ్యశ్రీజితవత్సల ప్రహ్లాదునివు ద్రావి సుఖించునో! పూర్వమట్లె నీ
పూజయు వర్తన మ్మెదురుదెబ్బలు పోర సహించునోగదా !

ద్వేషమ్ము నణఁగింప ప్రేమ చూపుండన్న విద్వేషమే పెచ్చుపెరిగె నకట !
హింస నహింసతో నెదిరింపవలెనన్న ప్రతిహింసయే వేరుపాతుకొనియె!
విధిచేయుచో హక్కు వెనువెంటఁ బడునన్న హక్కుకై పోరాట మయ్యె విధిగ!
దైవమే సత్య మద్వయము నమ్ముండన్న పరమంపి నిన్ను ద్వైతంబ వంటి
మెంత వలదని మాకు బోధించినావో - అంతకంతకుఁ జెరిగె మాయందు స్వామి !
స్వార్థబుద్ధి, యసత్య, మనాదరంబు; - స్వాదుబీజమ్ము నాట విషాగమయ్యె !

మట్టి తిన్నంతమాత్రాన మడిసె ననుచు - తోకత్రొక్కంగ కదలి యుద్రేకమంది
పడగవిప్పిన ప్రబలసర్పంబువోలె - బుస్సు మనుచున్న జాతి నపూర్వముగను.

రమ్యధార్మిక నాగస్వరమ్ము నూది - యట్టె యాడించినావు నీ కనుగుణముగ
భ్రమసి పాడితి వేమొ యపస్వరమ్ము - అయ్యయో! తండ్రి! తుదకు కాటందినావు.

ఇంతకు మించి యీజగ మింకేమి యొనర్పఁగఁ జాలు నిన్ను శ్రే
షాంతశాంతమూర్తి! తనయంత భరత్పృథ మందలేనిచోఁ
జింతయొ లేదుగాని దివిఁజేరిన నీకయి లోకమెల్ల సం
భ్రాంతమనస్కతన్ విమతవర్గము లొటకు నెట్టు లోర్తునో!

ఓయి సమస్తధర్మమహిమోజ్జ్వల పూర్ణదయాస్వరూప! నీ
వై యిహలోకమే పనికి వచ్చితొ యయ్యది పండకున్న నన్
పోయితి వాత్మవాగ్నిపిలుపున్ విని, నీవు నాత్మశాంతికై
యీయమనీతలమ్ము తపియించి ఫలస్థితి నందుగావుతన్.

శాంతికకాముబద్ధుయి భవ్యభవన్మహితాత్మ దేని సం
ప్రీతిగఁ జేయఁ బెంచి విరమించెనొ దానిని ముక్తబంధతా
శ్రీతను కీర్తికాయమునఁ జేసి జ్వలింపుము నిత్యజీవివై !
జ్యోతిగ నిల్చి మార్గమును జూపుచు మా కిఁక పూజ్యబాపుజీ !



# భారతభాగ్యవిధాత

శ్రీ వేదము వెంకటరాయశాస్త్రి

సత్యాగ్రహవ్రతి కదురా - సత్యంబని చాటితీవు సకలావనికిన్,
నిత్యాయుధులగువారిక - నిత్యత సాజం బటంచు నేర్పితి వయ్యా.

బుద్ధుడు తొల్లింత జనించి ప్ర - బుద్ధుండై వఱలినట్టి పుడమి స్థలిలోన్
బుద్ధుడ వీవు జనించి ప్ర - బుద్ధుల నొనరించినావు పోడిమి వెలయన్.

దైవముమానవములలో - దైవంబే కేవలంబు దైవేకరమా
కేవలబల మది వ్యర్థము - కైవల్య విహీన మంటి గాంధిమహాత్మా!

దైవము నమ్మి నీవు బలం దైన్యము నూనక నీవు చెంతనే
ఏవగలాడొ క్రౌర్యమున చేసిన బాంబును చూడవైతివే!
చేవగలాడవయ్య! "ఎటుచేసిన దైవముమీద భారమం"
చావగబల్కి క్రూరగతి చావగ మావగ నీవు చేద్యమే!

ఏసుక్రీస్తువిధంబున - వాసం బది నీవు చెల్లె వంద్యచరిత్రా,
ఏసుక్రీస్తువిధంబున - బాసెను నిన్నసువులెల్ల భవ్యచరిత్రా.

భారతావని కిష్ట ప్రక్కలో బల్లెమైయుండు పాకిస్థానఖండమునను
పోగోరి నీ వుండ పోయె నీ కాయువు; ఇంక నెవ్వడు సంధికిం గడంగ,
మనుజుల వర్తన మార్పుజేయంగను, పరిమార్ప లోకంపు బాప మెల్ల,
సౌభ్రాత్రమును సదా జనులతో గూర్పదంట తా నగువట్టి దండిమగడు?
పోయె నీతోనె భారతభోగమెల్ల, - పోగె నీతోనె భారతకాంతి యెల్ల,
తారె నీతోనె భారతధర్మమెల్ల, - కటకటా మాకు కారాని కాల మిపుడు.

హరిజనోద్ధరణకై యహరహంబును నీవ యుపవాసఖేదంబు నొందినావు,
హిందూముసల్మాను లింపొందియుండంగ నుపవాసఖేదంబు నొందినావు,
భారతదాస్యంపు భారంబు బాపంగ నుపవాసఖేదంబు నొందినావు,
బీదసాదల యార్తి చేదంగ గోరియు నుపవాసఖేదంబు నొందినావు,
లేరు నిన్బోలు ధీరులు, లేరు లేరు; - వాసికెక్కితి బహులోపవాసి నీవు,
వాసి బాసెను దేశంబు బాసి నిన్ను, - చాల పొగడంగ నిన్ను వాచామగమ్య.

యుగముల కొక్కడే గలుగు యోగ్యుడు యోగి భవాదృశుండు దు
ర్జగమున నుందురే ఘనులు, జాల్మలై చేసిరి వేలు చూడ, మా
నగరను చేర గల్గునె, నివారితక్రోధుల జైనబుద్ధులన్
జగమున విస్మరించిన ప్రజాళికి వారిని జ్ఞప్తిచేసితే!

నాఁడు జినేశ్వరుండు కరుణాపరతన్ మన యార్తి దీర్చెనో,
నాఁడును గౌతముండు కరుణాపరమూర్తి యహింస చాటెనో,
నేఁడును నీవసున్ విడప వేయివిధాల యహింసతత్త్వమున్
నేఁడు మహాత్మ నీవు కడు నేర్పున నేర్పి తదేవిధానమున్.

భారతయుద్ధంబు పరిపూర్తియైనంత కృష్ణమూర్తిని జంపె కృపణుఁ డొకఁడు,
మనుజోపకారి యేసుక్రీస్తుదేవుని కొఱతవైచిరి నాటి క్రూరు లకట,
అమెరికాస్వాతంత్ర్య మార్జించియిచ్చిన యబ్రహాముని జంపె పాతకాయి,
భారతదాస్యంబు బాపిన బాపుజీ గుండుదెబ్బల నిన్న గూల్చె ద్రోహి,
అహహా! ఇది యేమి లోకమో యరయరాదు, - మేలుచేసినవారికే మేలులేని
ద్రోహ మొనరించినారు విద్రోహు లకట, - ప్రళయ మెన్నడువచ్చునో పాపములకు!

అన్నిజాతులవారి కైక్యమ్ముగల్పించు బుద్ధుని యంశంబు నొందినావు,
అఖిలభూతావళి నతిదయామతి జూచు జినదేవునంశంబు జెందినావు,
తనప్రాణ మర్పించి మన పాపముల దోలు జీసస్సునంశంబు జెందినావు,
హరిజనోద్ధరణైకపరుఁడైన రామానుజాచార్యునంశంబు నందినావు;
సర్వదేవమయుండవీయుర్విమీఁద - వెలసినాఁడవు మాభాగ్యనియతిఁ జేసి,
తొంటి మహనీయులెల్ల నీయొంటిమీఁద - యోగమందినయట్లయ్యె యోగివర్య.

అలనాఁడు గ్రీసులో నలకసుందరు డేగ తోకచుక్కలు పుడమి తోచెనయ్య,
ఏడవయెడ్వర్డు పేడ లోకంబున తోకచుక్కలు పుడమి తోచెనయ్య,
సంగ్రామరంగాన నుగ్రంబుగా పోర తోకచుక్కలు మొన్న తోచెనయ్య,
ఇలనాఁడు నీవేగ నిండియూనుండి తా తోకచుక్కయు మొన్న తోచెగాదె,
తోచలేదయ్య మాకెల్ల తోకచుక్క - దోచుకొనిపోవు నిన్నంచు, దోచె నిపుడె;
ఇట్టి యుత్పాత మెల్లను గట్టిగాను - గొప్పవారినె కొనిపోవు టొప్పవలసె.

నీరూపము భస్మంబై - తా రూపరియున్న నేమి త్వద్రూపంబున్
నేరూప దాల్చినారము - వేరొక్కటి కానరాని విధమున లోనన్.

ఇక చెప్పెడి దేమున్నది - సకలావని దుఃఖ మడిగి శాంతింపంగా
నికమీఁదనైన మన మా - యకలుష మార్గంబు పట్టి యరుగుట మేలౌ.

ఏనాఁడు బుద్ధుండహింసావివేకంబు బోధించి లోకంబు బ్రోచినాఁడో,
ఏనాఁడు జైనుండహింసావివేకంబు బోధించి రాజుల బ్రోచినాఁడో,
ఏనాఁడు జీసస్సహింసావివేకంబు బోధించి యూదుల బ్రోచినాఁడో,
ఏనాఁడు మేల్కోటలో నాడుగ్గిరి హరిజనుల్ రామానుజార్యు మహిమ,
ఏమహోత్సాహ, మేశాంతి, యేతపస్సు - ఆసియావాసుల హృదంతరంబు నలమె
నామహోత్సాహ మాశాంతి యాతపస్సు - ఆవరించుత నేఁడు తా నఖిలములను.

---



పుణ్య దంపతులు
(మాతృశ్రీ కస్తూరీబాయి. పూజ్యశ్రీ గాంధీజీ)




[కథానిక]

శ్రీ సహజానందం

వాంధ వేగంలో రంయ్‌మని పోతున్న చిన్న కారుకు కొట్టుకొని కిందపడ్డాడు— గుడ్డి బిచ్చగాడు. కారులో కూర్చున్న వ్యక్తిగుండె కలుక్కుమంది. వ్యాకులితంగా ఉంది అతని ముఖం. ఆందోళనతో గద్గదికమౌతున్న గొంతుకతో 'పోనియ్యి...పోనియ్యి' అని డ్రైవరును హెచ్చరించాడు. మరింత విసురులో దూసుకుపోతోంది కారు.

రోడ్డుమీద కూలిన బిచ్చగాని తలకు తీవ్రమైన గాయాలు తగిలి, నెత్తురు ప్రవాహంగా కారుతోంది. వీధిలో ఉన్న నలుగురూ పోగయారు. గుడ్డి కనుకొలకుల్లో అశ్రువులు ఎర్రగా మెరుస్తున్నయ్. మృత్యు ఘాత తిన్న అనాధుని ఆక్రందనకు ఇళ్ళల్లో వారు తలుపులు తీసుకొని గుమ్మాల్లోకి వచ్చారు.

శరవేగంలో మాయమైన కారు ఆచూకీ తెలియని ప్రేక్షకులు 'కళ్ళు లేవని ఏ చెట్టునీడలోనో పడివుండక రోడ్లమధ్యన తచ్చర్లాడితే...' అని విమర్శచేశారు.

'అమ్మా...అమ్మా...' అన్న బిచ్చగాని కేకలు ప్రతిధ్వనిస్తున్నయ్. క్రమేపీ కేకలు మూల్గులౌతున్నయ్. శరీరవ్యథ తీవ్రత తగ్గుతోంది.

దారినపోతున్న వృద్ధ వైద్యుడాగి, బిచ్చగాని భిక్షాటన ముగిసిందని చెప్పి వెళ్ళిపోయాడు.

యజమానికి దూరంగా పడివుంది—కానిడబ్బుల సీసా రేకుడబ్బా. పోగైన నాలుగుకాన్లూ చెదిరి పడివున్నయ్. ఆడబ్బాను, కాన్లను బిచ్చగాని సమీపంలో పెట్టి తనమీద వున్న తెల్లగుడ్డను తీసి బిచ్చగాని మీద కప్పాడు ఒకడు.

గుమికూడిన జనం క్రమేపీ ఎవరి దారిన వారు వెళ్ళిపోయారు. రోడ్డుమీది ఇంటి కుర్రవాళ్ళిద్దరు ఈ శవాన్ని కాపలా కాస్తున్నారు. అరుగుమీద నుంచి దిగి, వీధిపక్క ఈ మృత్యుద్వారంవద్దకు వచ్చి, నిలబడ్డది.

ఈ అభాగ్యునికి చుట్టపక్కాలెవరైనా ఉన్నారా? వీని చావుబతుకులతో ఎవరికైనా సంబంధం ఉందా? ఈ విగతజీవిని రుద్రభూమికి చేర్చుభారం ఎవరిది?'

పొద్దువాలే సమయం....ఓ ముసలి.....చింపిరి తల....కృశించిన కళేబరం....సందుమలుపులో అటు ఇటు చూస్తోంది...ఖాళీగా పడివున్న గోనె గుడ్డ దులిపి, దానికింద ఉన్న రెండణాలు తీసుకొని, నలువైపులా చూసింది.

శవజాగరణ చేస్తున్న కుర్రవాళ్ళలో ఒకడు కేక వేశాడు. 'నీ కొడుకు...నీ కొడుకు.'

ముసలిది ఒక్కసారి తలెత్తి, అటువైపు తిరిగి 'ఆ!' అని అరిచి, గబగబా వాలివున్న వైపునకు తొట్రుపడుతూ వెళ్ళింది. రెండణాలూ, గోనె రోడ్డు మధ్యలోనే జారిపడ్డయ్. 'రామా' అంటూ ఒక్కసారిగా కొడుకుమీదికి కూలింది. ఇళ్ళల్లోవారంతా బైటికి వచ్చారు. మతిచెడిన ముసలిది కళ్ళుమూసిన కొడుకు

శవాన్ని ఒడిలోకి తీసుకొంది. నెత్తురు మరకలు... కొలకుల్లో ఎఱ్ఱని చార చూసి ముసలిగుండె దహించుకుపోయింది.

'ఓ అభాగ్యురాలా! నీ కొడుకు లేడు...శవం మీద పడి ఏడ్చి ప్రయోజనం లేదు.. కట్టెను కాటికి చేర్చాలి' అన్నాడు ఓ ముసలి. ఈ దుర్ఘటన అతని నెక్కువ కలవరపరచలేదు. దుష్టవిధియొక్క దార్లు అతనికి చిరపరిచితం. మెల్లగా శవాన్ని సమీపించి, చినుగులచొక్కా ఊడదీశాడు. ముసలి ఒక్కసారిగా శవాన్ని కౌగిలించుకుంది. ఆగిపోయిన గుండెను హోరెత్తుతున్న తన గుండెకు హత్తుకొని, దుఃఖపరవశురాలైంది.

'పాపిష్ఠిదాన్ని...పిశాచాన్ని'...నాతల పగలకొట్టండి బాబూ...నాబిడ్డ పోయాక...ఈప్రపంచమెందుకు నాకు?' అని ఘోషపెట్టింది.

బిడ్డ! గుడ్డివాడు! ముష్టివాడు! ఓ వృద్ధమాతకు అతనే సర్వం! ఓ అభాగినీ! మనుష్యుడూ, దైవమూ కూడా నీకన్నీటిలో జలక్రీడలాడుతున్నా, నువ్వు నీ అమూల్యసంపదను కోల్పోలేదు. ఆకలితో, సంక్షోభతో మగ్గి, మసి అయ్యే ఈ 'భిక్షాపాత్రల్లో' ఈ అమృతం ఇంకా ఇంకిపోకుండా ఉందా? చినుగుల బొంతలచీర! దుమ్ముకొట్టుకున్న శరీరం! వికారమైన ముఖం! సంస్కారంలేని జీవితం! ఇట్టిశిథిలగృహంలో కూడా ఈదీపం ఇంకా ఆరిపోలేదు.

పొద్దు కుంకనున్నది...ఏడ్చి ఏడ్చి ముసలిగొంతుక బొంగురుపోయింది. చందాలు వసూలైనయ్...ఓ చిన్న పాడె పఱిచారు...ప్రేక్షకుల్లోంచి ఎవరో నలుగురు ముందుకువచ్చి, మృత్యుభారాన్ని మోయటానికి సిద్ధపడ్డారు.

పడమట పర్వతశిఖరాగ్రాలపై నిలబడి సూర్యుడీ జీవన్మరణయాత్రను చూస్తున్నాడు. శవ-బంధువులు రుద్రభూమి చేరుతున్నారు.

దాపున నది హోరు వినబడుతోంది. చితుల ఆఖరిమంటలు తగ్గుతూ తగ్గుతూ మండుతున్నాయ్.

ముసల్ది రుద్రభూమిలో అడుగుపెట్టింది. మొదటి సారి చితులమధ్య నిలబడటం! చైతన్యం బండబారి పాడెవద్ద కూలబడి కూర్చుంది.

చితి పేర్చారు... ప్రచ్ఛన్న మృత్యువు మీది ఆచ్ఛాదం తొలగించారు. ముసలిది కొడుకును తాకలేదు. కళ్లు చెమ్మగిలలేదు. గుండె ఎండిన తటాకంలా ఉంది. జీవితంయొక్క ఈ చివరి తీరాన ముసలి తన్నుతా మరచిపోయింది...భగ్నవాంఛలు భస్మరాసులై కుప్పలు కుప్పలుగా పడివున్నయ్. విరామం లేని నదీ ప్రవాహం...అవల ఆకాశంలో వెలుగు తగ్గుతోంది.

ప్రపంచమంతా చితుల మధ్య కాలిపోతున్నట్టు తోచింది ముసలికి.

పాడెమీదనుంచి శవాన్ని పట్టుకెళ్ళి చితికి నిప్పంటించారు. రగిలి రగిలి భగ్గుమన్నది జ్వాల...ఆ జ్వాలాదీప్తిలో బిచ్చగాని వంటిమీద నెత్తురుమరకలు మెరిసినయ్.

గుండెలో కత్తిగుచ్చుకున్నట్టయింది ముసలికి. జ్వాలలమధ్య తన బిడ్డ! నేలమీది కొరిగిపోయింది ముసలిది.

ఒకింతసేపుతర్వాత మృత్యువాహకులు వెళ్ళిపోయారు. ముసలి ఒక్కతే ఎడంగా కూలబడి చితికేసి చూస్తోంది...వెళ్లిన వాహకుల్లో ఓఅర్భకుడు వెనక్కు వచ్చి, 'ఎక్కడికి వెళ్తావు? మాతో రా!' అని అడిగాడు.

ముసలి దీప్రశ్నను మరచిపోయింది. కొంతసేపటినుంచి ముసలికి మతితప్పింది. ఈ జ్వాలలు చల్లారుతాయనీ, ఈ భ్రాంతి బూడిద అవుతుందనీ, తర్వాత తాను తన నీడకు చేరి మళ్ళీ యథాప్రకారంగా తన బతుకుబండిని భుజాన వేసుకొని ఈడ్వాలనీ మరచిపోయింది. ఈ అర్భకుని ప్రశ్న విని ముసలి స్పృహలోకి వచ్చింది.

'నేను! నాకేం బాబూ!...ప్రపంచమంతా నాదే బాబూ...బిడ్డకే కరువైంది ప్రపంచం.'

'కాదు...మాతో...రా.'

'లేదు బాబూ...లేదు...పాపిష్ఠిదాన్ని.......
పూర్వజన్మలో...'

జనం వస్తున్న చప్పుడయింది.

నాలుగయిదు కార్లు వచ్చి, ఎడంగా ఆగినయ్. నిశ్శబ్దంగా ఉన్నారు జనం. గబగబా కట్టెలు చేర్చి చితిని పేర్చారు...వస్త్రాల్లో ఉన్న ఓ యువకుని కళేబరాన్ని పాడెమీదనించి పైకెత్తారు.

రగిలి, రగిలి, మళ్లీ జ్వాల భగ్గుమంది.

అర్భకుడు ముసలితో అన్నాడు—

'ఆ కారే...ఆ కారే'

ముసలి కళ్ళెత్తి చూచింది...దుఃఖభారంతో రెప్పలు కిందకు వాలినయ్. క్రోధాగ్ని కొంచెం రగుల్కొంది.

కాని మృత్యువిహారం చూస్తున్న ముసలిహృదయంలో కొత్త సంచలన మారంభమైంది. తన ఒక్కతెకే కాదు...మానవకోటి కంతకూ చుట్టుకొని ఉంది ఈ పాశం...

అర్భకుడు మళ్ళీ అన్నాడు—

'ఆ కారే...వస్తూ పై తెలియకుండా పరుగెత్తించారు.'

ముసలి అర్భకుని మాటలు విన్నట్లేదు.

అప్పుడే జ్వాలలు జిహ్వలు చాపుతున్న కొత్త చితికేసి చూస్తోంది.

ఈ అగ్నికీల్య ఈ నాటిది కాదు. ప్రాణం తొలిసారి ఊపిరిపీల్చిన నాటినుంచి ఈ కీల్య భగ్గుమంటూనే ఉంది. తరతరాలుగా జీవరాశి ఇచట భస్మీపటల మౌతోంది.

ఆ చితికి దూరంగా నిలబడి ఉంగి దుఃఖిస్తున్న గుంపుకేసి చూసింది ముసలిది. నెమ్మదిగా లేచి వారివైపుకు సాగిపోతోంది...అర్భకుడు కూడా వెంట వెళ్ళాడు.

'ఆ కారే...ఆ కారే' అన్నాడు మళ్ళీ అర్భకుడు.

దగ్గరగా నుంచున్న నలుగురిలోనుంచి ఓ నడివయస్సు మనిషి ముందుకు వచ్చి, 'అవును...మాకుర్రవానికి తీవ్రంగా ఉంది... ఆ ఆందోళనలో కారు...' అని ఇంకేమో అనబోతుండగా, అర్భకుడు అన్నాడు-

'ఆ ముష్టివాని తల్లే!'

ఆ వ్యక్తికళ్ళలో నీళ్లు నిండినయ్. ఈ దౌర్భాగ్యురాలి ఏకైక పుత్రుడు...తన ముద్దు బిడ్డ... ఇద్దరూ భస్మం అవుతున్నారు.

బికుగుల తీవి! అగర్భశ్రీమంతుడు!! ఇద్దరి హృదయాలూ నష్టానికి ఘూర్ణిల్లుతున్నయ్.

ఆ నడివయస్సు వ్యక్తికి మునిదంపతులు, దశరథుడు కళ్ళెదుట నిలబడ్డారు.

ముసలిది వణుకుతూ అతని కాళ్ళపై పడ్డది.

'ఇంకెందుకు బాబూ నా బతుకు '

కాష్ఠాగ్నికంటె, ఈ అమాయకప్రశ్న అతని మనస్సును ఎక్కువగా దహించింది.

'ఇంకెందుకు బాబూ నా బతుకు—ముష్టి బతుకు.'

దాపున నదిహోరు ప్రతిధ్వనిస్తోంది.

ఓ క్షుద్రురాలా...

ఆ తరంగఘోషలోనే

నీ సంతాపనివృత్తి !



# భ్రమరాన్వేషణం

శ్రీ వావిలాల సోమయాజులు

సమీరబాలకుడు పాడుకుంటున్నాడు. శ్రుతిపుటాలల్లో ప్రవేశించింది పాట.

"శివశివ యనవేలు తుమ్మెదా, శివ
యంచేను విన వేలు తుమ్మెదా!
శ్రీకంఠుడను పూవు తుమ్మెదా,
మూడులోకమ్ము లారయోనే తుమ్మెదా!"

ఏవేవో ఆలోచనలు. మళ్ళీ మధురకంఠం—

"ఆరు రేకుల పూవు తుమ్మెదా, అది
మీరునే వాసనల తుమ్మెదా;
చేరుసేయక నీవు తుమ్మెదా, శివు
చేరి భజియింపవే తుమ్మెదా. శివ
అష్టదళములమీద తుమ్మెదా, నీవు
అంటి చరియింపవే తుమ్మెదా;
సాకారమై యుండు తుమ్మెదా, పర
మైకాంతమున జాడు తుమ్మెదా."

అని వినిపిస్తోంది. విస్తుపోయి వింటున్నాను. ఏమిటి చెప్మా ఈ ధ్యానబిందూపనిషచ్చిహ్నితార్థప్రదీపిక? మనస్సు క్రమక్రమంగా తుమ్మెదలమీదికి తొలిసారి ప్రసరించింది. అన్వేషణ ప్రారంభించాను.

అది ఉజ్జ్వలకావ్యోపవనవాటి. ప్రథమంలో "సాకూత మధుర కోమలవిలాసినీకంఠకూజితప్రాయే, శిక్షాసమయేపి ముదే రతలీలా కాళిదాసోక్తిః" అనే అభిమానంతో ఆ యువవనంలో ప్రవేశించాను. ఆ కవికుల గురువు అప్పుడే శివతపోభంగార్థం మదనుడికి తోడ్పాటిస్తున్నాడు. వసంతప్రాదుర్భావం. ఒక్కమాటుగా వనమంతా కామోపభోగోద్రిక్తమై పోతున్నది. ఇంతలో 'మధు ద్విరేఫః కుసుమైకపాత్రే పపౌ ప్రియాం స్వామనువర్తమానః.' ఇది రసాభాసం కాదా అని ఆశంకిస్తూ, అయినా వాటి రసికదాంపత్యానికి ఆత్మామోదాన్ని పొందుతుండగా మందమందవాయువులూ, మృదుమధురకలకూజితాలూ, ఏవేవో జరిగిపోతున్నవి...

భ్రమరగణాలనుంచీ అలజడి బయలుదేరింది. ఆ దిక్కుకు చూతునుగదా "లతాగృహద్వారగతోఽథ నన్దీ వామప్రకోష్ఠార్పితహేమవేత్రః, ముఖార్పితైకాంగుళిసంజ్ఞయైవ 'మా చాపలా'యేతి గణాన్ వ్యనైషీత్." మరుక్షణంలోనే "నిష్కంపవృక్షం, నిభృతద్విరేఫం, మూకాండజం, శాంతమృగప్రచారం" అయిపోయింది కాననం. ఆ శుష్కప్రశాంతిలో నా గుండెలు దిగజారుతూ ఉన్న శబ్దం ఆయనచెవిని బడితే ఏ శాపం ముసురుతుందోనని నెమ్మదిగా వనంలోనుంచి బయటికి జారుకుంటున్నానే గాని ఆ ద్విరేఫద్వంద్వం మీదినుంచి ఎంత ప్రయత్నించినా 'అనాఘ్రాతపుష్ప'మైన ఆ శకుంతలను వీడి రాలేని దుష్యంతుని దృగిందీవరాలై పోతున్నవి కన్నులు. ఇంతలో మమకారం చేతనేమో మాటిమాటికీ అలకాపురవర్ణనాన్ని జ్ఞప్తి చేసుకుంటున్న మహాకవికంఠం నన్ను ఉద్దేశించి అన్నట్లుగా 'యత్రోన్మత్తభ్రమరముఖరాః పాదపా నిత్యపుష్పాః...' అని పలికింది.

నేను "భ్రమర ఇవ విభాతే కుంద మంతస్తుషారం, నవఖలు పరిభోక్తుం నైవ శక్నోమి హాతుం" అని సాభిప్రాయంగా చదువుకుంటూ వచ్చేశాను.

శ్రీహర్షుని "సంజాతసాంద్రమకరందరసాం క్రమేణ, పాతుం గతశ్చ కలికాం కమలస్య భృంగః;

ద్గా నిపత్య సహసైవ హిమేన చైషా। వామే విధౌ నహి ఫలం త్యభివాంఛితాని" అన్న కరుణాభిభాషణం వింటూ బిల్హణభట్టు కృత్రిమోద్యానవనం చేరుకున్నాను.

అప్పుడే పెనుగాలి చెలరేగింది. పుప్పొడి కడ్డ కళ్ళు నులుముకుంటూ, భృంగకులం ఆ వాయువును అన్వేషిస్తూ ఆకాశవీథికి ఎగసినది. కబళితకాంతులలో ఒక్కమాటు ఇంద్రధనుస్సును సృజించి అంతలోనే సమస్తగగనాంగణాన్నీ ఆవరించి కారుచీకట్లు కల్పించినది.

అన్వేషణకు ప్రయోజనం లేదనుకొని 'దేశాభిమానం నాకు కద్దని కట్టి గొప్పలు' చెప్పకుండా ఓపిక కొద్దీ పట్టుదాన్వేషణం జరుపుదా మని తెలుగువనాల వంకకు నడుస్తున్నాను.

ఆదిలోనే 'సంహితాభ్యాసి'వనం. చప్పచప్పగా ఉంటుందేమోననే సందేహంతో సాగిపోతుంటే 'కమ్మని లతాంతమ్ముల కుమ్మెనసిన మధుపఝుంకారాలు' వినిపించినవి. అవి దుష్యంతమహారాజు కణ్వదుహితావిమోహానికి ఉద్దీపనవిభావాలై ఉండటం వల్ల ఇక అక్కడ ఉండటం 'అబ్రహ్మణ్య'మని అవతలపడ్డాను.

భ్రాంతిలోనుంచి బయటపడి చూతునుగదా, అది మా ప్రబంధపరమేశ్వరుని వనవాటి. చైత్రారూఢితో 'చివురుం గెంజెడలొప్ప, పుష్పరజముల్ సెల్వార నున్నూదిపూతగ, లేదేటుల చుట్టుకోలు జపమాత్రశ్రీలుగా, కోకిలప్రసుతాత్తాధ్యయనంబుతోడ' ఆయన సకలారామాలు 'శాంభవంబగు దీక్షావిధి' నొందుతున్నవి. 'జ్ఞానప్రదీపో హరః' అనుకొని మరోవైపు చూతునుగదా, అక్కడ 'వాగర్థ ప్రణయమూర్తులు, పార్వతీపరమేశ్వరులు. పరమేశ్వరి లీలారవిందంలోని బంధురము త్రిపురదహనుని హృదయంలో చిరనిద్ర పోతూఉన్న చిత్తజాగ్నిని మేల్కొల్పుతున్నవి. అప్రయత్నంగా నా నోటినుంచి 'ఇదం అనంగో విజయతే' అన్న మాటలు విడివడినవి. అమ్మవారి కైంకర్యానికి అడ్డువస్తానన్న భయభావంతో అక్కడినుంచి నాలుగడుగులు వేశానో లేదో—

'ఉల్లలదలకాజలకణ పల్లవితకదంబముకుళపరిమళలహరీహల్లోహాలమదబంధురమల్లధ్వను లెసగ మెసగు మరుదంకురాలు' నన్ను ఆహ్వానించినవి. ఆ వాసనాలహరీవిలాసాలకు సొక్కుతూ, నిరవధికానందంలో నిస్తబ్ధత వహిస్తూ, ఆ వైపుకే నడుస్తూ 'ఈ రమ్యోపవనం ఎవరిది చెప్మా' అని ఉచ్చస్వగతం చేశాను.

"నభోవాహినీలహరీశీతలగంధవాహపరిఖేల న్మంజరీసౌరభగ్రహణేందిందిరతుందిలంబు లివి మత్కాంతార సంతానముల్" అని కామినీకలస్వనం సమాధానమిచ్చింది.

చకితుణ్ణయి నడుస్తున్నాను. చూచాను. 'చంచల్లతా విగ్రహల్, శతపత్రేక్షణ, చంచరీకచికురల్, చంద్రాస్య, చక్రస్తనిల్, నతనాభిల్, నవలాల్ ఒక మరున్నారీశిరోరత్నముల్.' 'నీ వేనా వరూథినీ !' అని మాటాడిద్దా మనుకుంటుండగానే ముందున్నడో 'చెప్పకు మిట్టి తుచ్ఛసుఖముల్ మీపాలపై లేనియల్' అని అనబోయే 'తరుణాగ్నిహోత్రి' ప్రవరుడు తికమకపడుతున్నాడు నన్ను చూచినతరువాత మరింతగా. నా అన్వేషణాభిలాష కట్టిపెట్టి, మదనలీలావిలాసానికి మనస్సులలో జోహారు లర్పిస్తూ అక్కడినుంచి మాట దక్కించుకున్నాను.

'గగనధునీశీకరముల చెమ్మ' నందితిమ్మన్న పారిజాతవనం. ప్రవేశించగానే అందులో ఓ తుమ్మెద 'ఏ విరోగకాలినీహృదయరేఖగానో' 'వేసటే లేని వెర్రి అన్వేషణం' చేస్తున్నది. ఆ అవ్యక్తకంఠనిస్వనారావంలో 'ఆమె సొగసు రేకులు విచ్చి అమృతమధురవటన కానుపింపబోదు; నా తుగాదులు లేవు, నా తమస్సులు లేవు, ఏ నర్థమ్ములేని భావగీతమ్ము సుమ్ము' అని ఏవేవో లీలగా వినిపిస్తున్నవి.

పాపము ! ఈ మధువ్రతుని బాధ ఏమిటి ! 'వాడిపోయిన ప్రతిసౌరభమ్ముకొరకు, కనుమెరంగిన ప్రతిహిమకణమ్ముకొరకు, బ్రతుకుబ్రతుకెల్ల నెదో బాష్పగీతిక' వలె కనిపిస్తున్నదే.

ఆలోచనావ్యగ్రచిత్తంతో అల్లట తల్లడై పోతున్నాను. అక్కడే ఒక 'గిరిపొంతల' చక్కగా

తీర్చిదిద్దిన పూరేకులయ ఏటికాలువదరిని, చెంగల్వ పుప్పొళ్ళు నించిన సాంద్రోపలవేదిపై అధివసించి, ఈషత్కషాయసౌరభమైన పారిజాతాన్ని మధ్య మధ్య ఆఘ్రాణిస్తూ 'సత్యభామమ్మ' వారికి ప్రహేళికలు నేర్పుతున్నారు తిమ్మన్న.

వినమ్రభావంతో దరిజేరి ప్రణామానంతరం ఆ భ్రమరబాలుణ్ణి చూపిస్తూ 'మహాశయా! ఈ ఉన్మాద మేమిటి?' అని పృచ్ఛచేశాను. 'కించిద్విషాద రేఖ' ఒకటి ఆయనముఖాన గోచరించింది. ఆయన అన్నాడు పెదవి విరుస్తూ—

"ఒక భృంగంబు పరాళినీ మదనతం
త్రోన్మాది ప్రాణేశ్వరిన్
మకరందాసవమత్త మజ్జగృహసీ
మన్ బెట్టి తా బోయి సం
జకడన్ వచ్చి, తదానమన్ముకుళ మే
జాడన్ బోరన్ రాక యా
మికుడై నా దిరుగన్"

అని అంతటితో ఊరుకోక 'కాలంబురమునన్ చే లెంత హీనంబొకో!' అని అర్థాంతరన్యసించారు.

"ఈ తుమ్మెద కులానికి మటుకు సిగ్గుందా, స్వామీ? 'పాడు మధువ్రతావళులు పద్మవనీవిభవంబు.' ఈషద్వికసించిత అశేషపత్రసరోజజాకరములు కావా ఈ పుష్పంధయాలు?" అని నే నన్నాను జంకుతూ.

"ఔనౌను. పూలంటే ప్రాణం విడుస్తవి. ఏది చూచినా ఇందీవరభ్రాంతిని పొందుతవి. అయితే వాటి మీద నాకు అనంతమైన అభిమానం. కారణం మా సత్యే. ఆమె అమరలోకంలో జలక్రీడ లాడుతూ ఉన్నప్పుడు ఆమెను ఆధారంచేసుకొని దేవతాస్త్రీల హృదయాన్ని మానుషత్వంపైపు మరలించినవి ఇవి. ఆ సందర్భంలో నేను అన్నాను: 'ఎలదేటుల్ తను వాలుకన్గవలపై నిందీవరభ్రాంతిచే మెలగన్ చేరల గప్పకో సలవిగామిన్ జీదరంజెంది యిచ్చల కాంక్షించిరి నిర్నిమేషజలజాస్యల్ మానుషత్వంబు నయ్యళి భీతిన్ ముకుళీకృతాక్షియగు సత్యాకాంత నీక్షించుచున్' అని అమ్మవారిని చూపించారు.

ఇంకా ఏమేమో చెపుతారు విందామని నేను నెమ్మదిగా వేదికమీద ఒకమూల తిష్ఠవేయబోతూ ఉండగా నా స్థితిని భరించలేనట్లు సత్యభామమ్మ వారు ముఖం చిట్లించారు. తిమ్మన్న గ్రహించి 'నాయనా! మరోమారు రా. కులాసాగా మాట్లాడుకుందాము' అనంగానే వారివద్ద సగౌరవంగా సెలవు తీసుకున్నాను.

'ప్రతివర్షవసంతోదయకుతుకాగత సుకవినికర గుంఫిత కావ్యసమృద్ధి రోమాంచితు'డౌతూ, ఆ ఆముక్తమాల్యదవాసనల 'వాణీగుంభవశోజ్జనాట్యాయత్తంబగు ధీమత్తంత్రిపయి బాహాటిస్తూ' రాయలు కావ్యోపవన విహారం చేసే సమయంలోనే నేనూ అక్కడికి ప్రవేశించాను. ఆ సమయంలో ఆయన—

"వేవిన మేడపై వలభి
వేణిక జంట వహించి విప్పగా
బూవులు గోట మీటుతరి
బోయెడు తేటుల మ్రోత కామిశం
కావహమా కృతార్థ్యసన
లౌటను దంతపు మెట్ల వెంబడిన్
జేవడి వీణ మీటుటలు
జిక్కడలించుటయున్ సరింబడన్."

అనే ఆత్మకృతిని ఆలాపిస్తూ ఆనందిస్తున్నాడు. ఆ ఉత్ప్రేక్షకు హృదయం ఒప్పచెప్పి ఊరుకున్నాను. ఇంతలో ఏవో వహ్నికీలలు. నాలో ద్యోతకమౌతున్న భయాన్ని గమనించి రాయలు అన్నాడు—

"నాయనా! అది ఏమీ లేదు. భయపడకు. మా భట్టుమూర్తి ఉపవనంలోనుంచీ ఆ జ్వాలలు బయలు దేరుతున్నవి. ఇలా రావటం ప్రారంభమై చాలాకాల మైంది. దానివల్ల ప్రమాద మేమీ లేదు" అన్నారు.

"అదేమిటండీ!" అన్నాను అర్థంకానట్లు.

ఆయన వెంటనే అతని వనంలో 'నానానూన వితానవాసనల నానందించు సారంగ మేలా నన్నెల్ల దటంచు గంధఫలి బల్కాకం తపంబూనె' అన్నారు.

"బాగుంది. అసలే వియోగతాపము. అందులో తపమా! 'న దాహజ్వరసంతప్త మగ్నినా స్యా

ద్విపక్రియా' అన్న సూక్తినైనా పాటించలేదే భట్టు మూర్తి".

'భూశాయ భవ్యమ్' అని ఆయన సమాధాన మిచ్చినారు. వారి సమాధానానికి సంతోషించాను. కాని నన్ను సమర్థించుకోటానికి యత్నించి ఏదో వాదనలోకి దిగబోతుంటే ఆయన—

'దుర్దురా యత్ర వక్తారా తత్ర మౌనంహి శోభనమ్' అన్నారు. కొంచెంగా కినుక వహించినట్లు కూడా కనిపించింది ముఖం. నా మాటలు వినిపించుకోకుండా ఆయన రాజసంతో నడిచివెళ్ళిపోతున్నారు. నేను ఆయనకు వినపడీ వినపడనట్లుగా 'కాలం మారిపోయింది. మీ సామ్రాజ్యవాదతత్వం నశించా' లన్నాను.

కొంత కాలానికి అపూర్వలక్షణలక్షితమైన ఆ శ్రీపూర్ణుని ఉద్యానవనంలో ప్రవేశించాను. మధుర లాలస నెచ్చెలిపిండుతో పేరోలగం తీర్చి కూర్చున్నది. ఆ స్త్రైణపరిహాసాలతో మనస్సుకు కొంత పరిపుష్టి కూర్చుకొంటున్నాను. స్నానవేళ అయినట్లున్నది. 'ఆ రమణీమణుల్ సరసిలో ప్రవేశించారు. 'తత్కారణవీచికాచలితకంజములన్ మధులోలభృంగముల్ వారక సారెకున్ ఎగసి వ్రాలుచు నొప్పె, తదంబుజీవతల్ నేరుపుతోడ నాడు హరినీలపు టచ్చునగండ్లకైవడిన్.'

మన మల్లెలూ, మొల్లలూ, చంపకకురువకాలూ కనుపించలేదు. అది ఎవరిదో నూతనోద్యానం. 'నవమి త్యవద్యమ్'. ప్రవేశించాను. ఆ వనంలో షట్పద పాళి తెట్టెలు పెట్టి వాటిచుట్టూ మూగుతూ మరంద సంపాదనంలో మత్తిల్లిపోతున్నది. ఒక జిజ్ఞాసువు దూరంగా కూర్చొని వాటిని వివేకదృష్టితో పరిశీలిస్తున్నాడు.

"ఎవరు స్వామీ మీరు? ఏమిటా 'తెట్టె' ను అలా చూస్తున్నారు?"

"నేనో షట్పద జీవిత ప్రియుణ్ణి. నాకు ఇదే ఆనందం. జీవితమంతా ఇందులోనే గడచిపోతున్నది."

"స్వామీ! మీరు అనుభవజ్ఞులులా కనిపిస్తున్నారు. నాకూ తేనెటీగలంటే అపరిమితప్రేమ. వాటి జీవితవిశేషాలు కొన్ని సెలవిస్తారా?" అన్నాను.

"నాయనా, ఇంత కాలానికి నీ వొక్కడివి కనపడ్డావు. సంతోష" మని ఆయన ప్రారంభించాడు.

"తెట్టెకో రాణి ఉంటుంది. షట్పదకులసృష్టి అంతా ఆమెది. ఆమె నెప్పుడూ తుమ్మెదలు 'జయ మధుకోశోద్ధర్త్రి!, ఉన్మద మధుగణ హంత్రీ, జయ అళిలోక సృష్ట్రి!' అని కైవారాలు చేస్తూ భ్రమర లోకం అనుసరిస్తూ ఉంటుంది.

పురుషజాతి పుష్పంధయాలు అనేకంగా ఉంటవి. కాని అవి పుష్పరసాన్ని సంపాదించవు. ఎప్పుడూ సుఖ స్వస్థతలో ఉంటవి. రాణికి గర్భధారణం కావటం తప్ప వాటివల్ల మరో ప్రయోజన ముండదు.

మిగిలిన తేనెటీగలన్నీ సేవకులు. తెట్టెమీద అధికారాన్ని చెలాయించేవి ఇవే. వాటి ఇష్టాన్ని అనుసరించే రాణి ప్రవర్తిస్తుంది.

రాణికి గర్భధారణం జరగటం ఒక చిత్రమైన సంఘటన. రాజ్యంచేస్తున్న రాణి చనిపోగానే తేనె తెట్టెలోనుంచి క్రొత్తరాణి బయలుదేరుతుంది. అంతకు ముందు ఆమె 'నగరి' దాటి బయటికి ఎన్నడూ రాదు. రాణి కనబడగానే సోమరిపోతులలా నిద్రపోతూఉన్న పోతుటీగల ముఖాల్లో ఉజ్జ్వలవికాసం కనిపిస్తుంది. రాణి మేఘమండలయాత్ర ప్రారంభిస్తుంది. పోతులు ఆమెచుట్టూ మూగుతూ ఆమెకటాక్షాల ముందు దాసానుదాసు లౌతూ వెన్నాడుతుంటారు. ఆమె యాత్రారంభంలోనే తెట్టెలో ఉన్న మిగిలిన రాణి గ్రుడ్లనన్నిటినీ పొడిచివేస్తుంది. లోకానికి రాణి ఒక్కతే ఉండాలని భ్రమరధర్మశాస్త్రము.

పోతుటీగలలో ప్రతివాడికీ ఒకసారి అందుబాటులోకి వచ్చి ఎవ్వరికీ అందకుండా రాణి వెళ్ళిపోతుంటుంది. ఆ తిప్పలకు అలిసిపోయి అనేకమంది పోతులు నేలమీద వాలిపోతారు. ఊర్ధ్వముఖంగా పయనం ప్రారంభించి రాణి మబ్బుల్లో మాయమయ్యే సమ

యంలో ఒక పోతుమాత్రం అనుసరిస్తాడు. ఆమెతో అతనికి సంయోగం. అనంతరం మరణం. రాణి దేహాన్ని అంటుకొని అతని దేహం నిలిచిపోతుంది.

రాణి తిరిగివచ్చినతరువాత సేవకుల మహానందాన్ని చెప్పవలవికాదు. తేనె తెచ్చి ఇచ్చి ఆమె దాహం తీరుస్తవి. భరించలేని సంతోషంలో పోతు ప్రాణం విడవగానే రాణిదేహాన్ని సేవకులు శుభ్రము చేస్తారు. ఆమె సేద తీర్చుకొని 'పునస్సృష్టి చేసి నా లోకాన్ని నేనుపాలిస్తా'నని చెప్పి బృందంతో బయలుదేరి ఏ నీపశాఖికమీదనో దృష్టి నిలుపుతుంది. క్షణం విశ్రాంతి లేకుండా సేవకులు తెట్టె తయారుచేస్తారు. గడిగడికీ పోయి గుడ్లు పెట్టి రాణి నగరులో ప్రవేశిస్తుంది. రాణి నాలుగువసంతాలు జీవిస్తుంది. తెట్టెను విడిచి పోదు. సృష్టిక్రమానికి మళ్లీ పుంయోగం అనవసరం..."

ఇవన్నీ విస్తుపోయి వింటూఉన్న నేను వాటి సత్యాసత్యాలననుసరించి ఆలోచించలేకపోయినాను. వాటిమీద నాకు నమ్మకము కలిగిందనిగానీ, కలగలేదనిగానీ చెప్పలేను. ఏవేవో మనస్సులో అనంతభావబంధురాలు తిరుగాడటం ప్రారంభించినవి. వాటి సృష్టిలో అనంతమహాత్వం గోచరించింది. ఇక అన్వేషణం చేయలేక పురోగమనం ప్రారంభించాను.

అప్పుడు నామనస్సులో కలిగిన భావాలు: 'పూల కడుపున తేనె పోసె నెవడో, దాని తీయు నేర్పుతుమ్మెదకు లభించె.' తుమ్మెదవలపు 'షట్పద ప్రణయ'మని లోకంలో పరిహాసపాత్ర మౌతున్నదిగాని అందులో దాని దోషమేమున్నది?

'ఇది యొక కన్నెపూవు హృదయేశ, మధూదయవేళ!' అని ప్రతిపుష్పకోమలీ పిలుస్తుంటే ఆ భ్రమరబాలకు లేంచేస్తారు కనక.

'హ్రస్వతరమ్ము జీవము, రహస్తృష దీర్ఘతరమ్మునైన ఈ నశ్వరమైన జీవితమునన్ క్షణ మొక్కయుగమ్ముగాగ సప్తస్వరమాతృకాయుత భవన్మృదుగాన సుధాప్రవాహ సర్వస్వము నారగించు ప్రణయిత్వర నుంటిని నీకునై ప్రియా!' అని వాసకసజ్జికలా ప్రతికుసుమమూ మందాక్రాంతమధురిమ లొలికిస్తుంటే మధువ్రతకుమారుల మనస్సు కరుణాభిభూత మౌతున్నది. అయితే లోకం ఆ తప్పిదమంతా షట్పదకుమారునిదే నని భ్రమపడుతున్నది. కారణం 'ప్రీతి నామాపి మధురమ్' 'స్వతఏవ సతాం పరార్థతా' అనే న్యాయంలో ప్రవర్తిస్తున్నది భ్రమరకులం. 'నడచెడు నట్టివాని చరణంబులకే గద రాళ్ళ తాకుడుల్'.

ఈపరార్థతే లేకపోతే ఆ వల్లవీవల్లవులకల్ల—
కృష్ణభగవానుని దూతగా వెళ్ళికూడా—

"భ్రమరా! దుర్జనమిత్ర ముట్టకుము మా పాదాబ్జముల్ నాగరప్రమదాళీ కుచకుంకుమాంకితలసత్స్రజ్జేశ దామ ప్రసూన మరందారుణితాననుండ వగుటన్ నాథుండు మన్నించుగాక మమున్నేపుచు పౌరకాంతల శుభాగారంబునన్ నిత్యమున్" అనే ఈసడింపు మాటలు ఎందుకు పడవలసి వస్తుంది. మిత్రుడికోసం పాదాబ్జాలంటి, దౌత్యం నెరపిన సహృదయత ఏ దూతలో ఉంది? అచేతనాల మాటలా ఉంచుదాము. ఆ నలుడేం చేశాడు? ఆమె కన్నీరుపెట్టిందో లేదో 'మాటిమాటికి నాదు సంసారమును నసారముగ జేయుచు నసారసారసనయన!' అని దమయంతిని తనదాన్నిగా చేసుకున్నాడు; 'అక్కట దైవతకార్యసిద్ధి విచ్ఛేదమునొందెడా' అని నెమ్మదిగా ఒక కల్లబొల్లి ఏడ్పుతో బయటపడ్డాడు.

ఈ పరార్థతమాట గగనకుసుమాల విషయంలో ఏమైంది? అది అజాగళస్తనజాతిలో చేరుతుంది కాబట్టి అవంగకు పోరు తుమ్మెదకుమారులు. 'మందారమకరంద మాధుర్యమున దేలు మధుపంబు బోవునే మదనములకు' అన్నాడు పోతరాజు. అక్కడకూడా తప్పిదం పూలదే. న్యూనతాభావంవల్ల సారంగుని సాయపడమని పిలవలేకపోతున్నది.

నేస్తానికి బంధురకులానిది పెట్టినది పేరు. సఖ్యం అంటే అది. తమంతవారిని చేస్తేగాని వారికి సంతృప్తి లేదు. లోకాన్ని ఒకందుకు మెచ్చుకోవచ్చు. ఈ విషయాన్ని గుర్తించి భ్రమరకీటన్యాయాన్ని కల్పించుకున్నది.

భ్రమరజాతి అత్యున్నతసృష్టి కాకపోతే ఆచార్య శంకరులవంటి అద్వైతికూడా 'సౌందర్య లహరి' ని ఉద్దేశించి :

"దదానే దీనేభ్యః శ్రియ మనిశ మాశా సుసదృశీ
మమన్దం సౌందర్యప్రకరమకరందం వికిరతి,
తవాస్మిన్ మందారస్తబకసుభగే యాతుచరణే,
నిమజ్జన్మజ్జీవం కరచరణైః షట్చరణతామ్"

అంబికాపాదమకరందమధుపాన్ని చేయవలసిందని యాచించాడు. అంతే కాదు, సమస్త బ్రహ్మాండం ఒక అష్టదళపద్మమైతే జగత్కారణుడు షట్పదమై ఏకత్రదసాస్వాదనం చేస్తున్నాడా అనే అనుమానం కలుగుతుంది.

మేఘమండలాలలో 'రాణి' సంచారం చేస్తున్నప్పుడు ప్రకృతిపరంగా ఎన్నెన్ని మధురభావాలు కలుగుతవి!

'శాంకరీ పల్కుమీ ఝంకార మేమిటో, మంత్రమా, గీతమా, మరి మాయయా? లీలయో, నాట్యమో, లేక నటనో, భ్రామరీ తెల్పుమీ భ్రమణ విభ్రమ మేమొ!'

'సాధకుని ఆత్మలో జ్ఞానదీపమువోలె కనుపించి మాయమై కనుపింతువే, తెలియలేమే మేము ప్రళయమో ప్రభవమో, లాస్యమో, తాండవమొ మము తెల్పవే తల్లి'—

ఎన్నెన్నో ఊహాలు.

చివరకు సృష్టిస్వరూపుడైన పరమాత్మపరంగా:

"ప్రళయావసానమున బ్రహ్మాండ మణియగా
ప్రభవించు నాత్మభవు జేరితివా,
చీకటులు విరియించి సృష్టించు లోకములు
శ్రమించు నాత్మభవు జేరితివా"—

అని కూడా అనిపిస్తుంది. అయితే ఆ జగచ్ఛిల్పి ఈ భ్రమరచిత్రణంలో ఇంత భావగోపనం ఎందుకు చేశాడనే శంక కలిగినప్పుడు 'అరసికేషు మా లిఖ, మా లిఖ' అనే సమాధానం వెనువెంటనే ద్యోతకమౌతుంది.





ఉదయం ఉత్సాహంగా
వుండేటట్లు చేసుకొనండి"

ప్రతి ఉదయం మీరు ఉత్సాహంగా వుండవచ్చు. రాత్రిళ్లు పండుకొనే టప్పుడు ఫిలిప్సు తీసుకొన్న యెడల, అమితంగా తిని త్రాగినమీదట కలిగే ఆమ్లము, అజీర్తి, నొప్పులవల్ల మీరు రాత్రిళ్లు జాగరణం చేయనవసరము లేదు. ఫిలిప్సువల్ల వెంటనే ఉపశమనం కలుగును. హాయిగా నిద్రపట్టును. నిద్రసమయములో ఫిలిప్సు కడుపును శమనపరచి మృదువుగా పూర్తివిరేచన కారివలె పనిచేయును. అందువల్ల రేపటినుండియే మొదలు పెట్టుము.

*Remember...*

**PHILLIPS**

"MILK OF MAGNESIA"

*Tonight!*




LIQUID or TABLETS

లోకప్రసిద్ధిపొందిన

# పి. వి. రాజన్

## అండ్ కంపెనివారి




**శ్రేష్ఠమైన మదరాసు నశ్యం**

**R. S. సుగంధ ముక్కుపొడి.**

అన్నిటిలో సాటిలేనిది.

ధర వివరములకు వ్రాయుడు.

తయారుచేయువారు :—

**పి. వి. రాజన్ & కంపెని,**

అర్కోణం, Arkonam, N. A. Dt.



# డోంగ్రేగారి

బాలామృతము

బలహీనమైన బిడ్డలకు

పుష్టియున్ను, బలమున్ను

ఆరోగ్యము నిచ్చును




# బి టా కే ఫి న్

(తలనొప్పి బిళ్లలు)

అన్ని నొప్పులను, జ్వరములను కుదుర్చును.

తలనొప్పి, పంటినొప్పి, కాళ్లనొప్పి, నిద్ర లేకుండుట, కీళ్ల నొప్పులు, మలేరియా, స్త్రీల బహిష్టునొప్పులు, అలసట, వగైరా అన్నిటికి గ్యారంటీగా పనిచేయును. వాడు కొను విధము పొట్లములో నుండును.

**పొట్లం 3 బిళ్లలు 1 అణా.**




# బి టా లా క్సు

చాక్లెట్ భేదిబిళ్లలు.

సుఖవిరేచనౌషధము

ఇవి సుఖ విరేచనము కలిగించి మలబద్ధమును పోగొట్టి మంచి జీర్ణశక్తి నిచ్చును. పొట్లం 2 బిళ్లలు 1 అణా.

అన్నిచోట్ల దొరుకును.

Stockists: M/S DADHA & Co.,
P. T. Madras.

*Manufactured by*

**BOMBAY TABLET MFG.. CO.,**
P. O. Box 2092, BOMBAY. 2

# కుందమాల

(ఏకాంకిక)

శ్రీ బులుసు వేంకటేశ్వర్లు

## మొదటి రంగము

(ప్రవేశము : రథములో సీతాలక్ష్మణులు, సారథి.)

లక్ష్మణుడు—దేవీ! ఈ రాలురప్పలలో ఇక రథము నడవదు. ఇక్కడ దిగుట మంచిది.

సీత—ఏమో! నాయనా! రథము తెగకుదిపి వదిలి. ఒడలంతా హూనమైపోయినది. దిగగలనో, లేనో.

లక్ష్మణుడు—సారథీ! రథ మాపు.

సారథి—బాబూ! చూచితివా? అక్కడ హంస లెంత మధురముగా కూయుచున్నవో! ఆ మధుర నాదము విని మన గుఱ్ఱములు ఒడలుమఱచి పరుగెత్తుచున్నవి. చూడు. కళ్లెము లెంత గట్టిగా లాగుచున్నానో!

లక్ష్మణుడు—సారథీ! ఏమైనా సరే. త్వరగా రథ మాపు. మనమిక్కడ దింపి గుఱ్ఱాలకు నీళ్లు పెట్టు.

(రథమాగును. సీతాలక్ష్మణులు దిగుదురు. సారథి రథము తోలుకొనిపోవును.)

లక్ష్మణుడు—(తనలో) అన్న ఆజ్ఞ... పౌరుల విమర్శ దారుణము. ఈ సీతమ్మను అడవిలో దిగవిడిచి రావలెనట. అతినిర్మలమైన వంశమునకు కళంకము సహించునా అన్న? ఇంతకు నా కర్మము! ముద్దుమురిపెములతో పెంచుచున్న లేడిపిల్లను వధ్యభూమి కీడ్చుకొనివచ్చు కిరాతునివలె...

సీత—వత్సా! నడవలేను. గంగ ఎంతదూరములో ఉన్నది? చూచిచెప్పు.

లక్ష్మణుడు—దేవీ! అదిగో! అదే. చూడు. పద్మములలోని రజస్సును, పరిమళమును తీసికొని హంసల గీతనాదములను కలుపుకొని చల్లని తుంపరలను కూడబెట్టుకొని ఈ గాలిబాలలు నీకు ఆతిథ్య మీయ నాహ్వానించుచున్నవి తల్లీ!

సీత—హాయ్! హాయ్! వత్సా! కన్నతల్లి చల్లనిచేయి సోకినప్పుడుకూడ లేనిసుఖము ఈ గంగమ్మ చుట్టాలగు గాలిపిల్ల లిచ్చుచున్నవికదా! నా బడలికే కాదు-పాపము పోయినది. ఒక్క నిమిషము ఇక్కడ విశ్రాంతి తీసికొందును. (కూర్చుండి విశ్రాంతి నందుచుండును.)

లక్ష్మణుడు—ఏమీ! మా తల్లి కిప్పుట కూడ దాసిజనమే! తరంగబాలలు చల్లనిగాలి వీచి, హంస వత్సలు గానము చేసి, ఛాయాదేవి కౌగిలించుకొని యీ మేను సుఖపెట్టుచున్నవికదా!

సీత—నిజమే! నాయనా! నాకు చాల హాయిగా ఉన్నది.

లక్ష్మణుడు—(ఆలోచించుకొనుచు, కళ్ల నీళ్లు కార్చుచుండును)

సీత—అయ్యో! వత్సా! అదేమి? ఆ కన్నీటి కాల్వ లేమి?

లక్ష్మణు—ఏమున్నది తల్లీ! ఇక నా బ్రదుకింతే.

సీత—అదేమి? నీకేమి లోటు వత్సా! మరల వనవాసము ప్రాప్తించినదా యేమి?

లక్ష్మణుడు—ఔను తల్లీ!

సీత—ఏమీ! కైకమ్మవల్ల నే?

లక్ష్మణుడు—ఈపట్టు కైకమ్మవల్ల కాదు.

సీత—మరి యెవరివల్ల?

లక్ష్మణుడు—మందభాగ్యుడను. తల్లీ! రాముడే నిన్నిట విడిచిరమ్మనినాడు.

సీత—(మూర్ఛిల్లును. లక్ష్మణుడు పరిచర్య చేయును. సీత మేలుకొనును.) ఏ నాదోషముచేత వత్సా!

లక్ష్మణుడు—నీయందు దోష మెందునా? తల్లీ!

సీత—ఎంతపాపినోకదా! వత్సా! ఏదోషము లేకపోయినా శిక్షయేనా? (దుఃఖించును.) వత్సా! ఆ మీయన్నయాజ్ఞ యేమో తెలిపి నీ వరుగుము. ఆలస్య మేల? నాగతి...(ఏడ్చును.)

లక్ష్మణుడు—తల్లీ! అన్నమాట లివి. విను "దేవీ! రూపగుణవంశభావాదులలో నీదోష మేమియు లేదు. కాని..."

సీత—కాని?

లక్ష్మణుడు—"జనవాదభీతిచే విడిచితినేకాని నీదోషము మచ్చుకైనను లేదు. నే నాజన్మాంతము ఏకపత్నీవ్రతుడనే. ఇదే నా శపథము. జన్మజన్మముల కును నీవే నా అర్ధాంగివి..."

సీత—అయ్యో! లక్ష్మణా! ఇది యేమి కర్మ మోయీ?...

లక్ష్మణుడు—తల్లీ! ప్రతిసందేశ మిచ్చి పంపుము.

సీత—ఈగతిలో ప్రతిసందేశమా? వారి కిట్లు చెప్పుము. "...స్మరణమాత్రభావముచేనైన అనుగ్ర హింప వేడుకొందును." లక్ష్మణా! అన్నయారోగ్యము చూచు బాధ్యత నీదే. నే నుండనుగదా? (ఏడ్చును) వత్సా! అయోధ్యానగరమునకు నా వందనములు. అత్త లందఱకు పాదాభివందనములు. ప్రతిమాగతులగు మహా రాజులకు శుశ్రూషలు. నాసఖులెల్లర నాదరింపుము. మందభాగ్యను నన్నెప్పుడైన స్మరింపుము! (దుఃఖిం చును)

లక్ష్మణుడు—ఈకన్నతల్లి నిట్లొంటరిపాటున నే నెంతటి పాపినోకదా! అయ్యో! ఈయమ్మను చూచి లేళ్లగుంపులు నేడ్చుచున్నవి, హంసలు దుఃఖించు చున్నవి, నెమిళ్లు జాలిపడుచున్నవి. నరులకంటె పశు వులే మేలుగదా!

లక్ష్మణుడు—తల్లీ! నా తుదిప్రార్థనము.

సీత—ఏమది?

లక్ష్మణుడు—పూజ్యురాలా! నీవు ఎంతటి దుఃఖస్థితిలోనైనా నీ కడుపుననున్న రాఘవవంశము కాపాడవలయును...

సీత—అట్లే నాయనా!

లక్ష్మణుడు—అన్నయాజ్ఞ పాలించిన నన్ను మన్నింపవలయును.

సీత—నీ తప్పు లేదుకదా!

లక్ష్మణుడు—(సీతకు నమస్కరించుచు ప్రదక్షి ణము చేయును.)

సీత—(దుఃఖించును.)

లక్ష్మణుడు—ఓ దిశాధిపులారా! ఈ సీతమ్మను కాపాడుచుండుడు. ఓ గంగమ్మతల్లీ! ఈ నాతల్లిని రక్షించుము, నీలో స్నానము చేయవచ్చునపుడు ఆమె నాదరించుచుండుము. ఓ వనవాసులగు మునిరాజు లారా! ఈ మీ బిడ్డను కాపాడుబాధ్యత మీదే! ఓ వనదేవతలారా! ఈమె క్షేమమరయుడు. ఓ క్రూరజంతువు లారా! మా తల్లి చుట్టుపట్టులకు రారాదు. ఓ హరిణు లారా! మీకే సేవామహాభాగ్యము లభించుచున్నది. సీతమ్మను సేవింపుడు. ఓ నదులారా! మీరే యామె చెలికత్తెలు. ఓ గిరికుమారులారా! మీరే యామె తోబుట్టువులు. ఓ గంగామాతా! మా మాతను కాపాడు చుండుము. వందనము. వందనము. వందనము. (నిష్క్రమించి)

సీత—అయ్యో! లక్ష్మణా! వెడలిపోతివా? కీకారణ్యము...పులులు, సింహములు...ఒంటికత్తెను. ఏమి పాపమో...లక్ష్మణా!...వనదేవతలారా...... మహర్షులారా...(మూర్ఛిల్లును.)

వాల్మీకి—(ప్రవేశించి) ఎవరమ్మా! నీవు?

సీత—(మేలిముసుగు ధరించి) లక్ష్మణా?

వాల్మీకి—నేను లక్ష్మణుడను కాను.

సీత—అయ్యో! కష్టము. కష్టము. పరపురుష భయమున బలుకజాలను. తండ్రీ! ఏకాకిని, స్త్రీని.

వాల్మీకి—విన, నేనున్నాను. నీకు భయము లేదు. రామరాజ్యమున లోకములు సుఖించుచుండగా నీ కీగతి యేమమ్మా? నిన్నెవరిట విడిచిరి?

సీత—పూర్ణచంద్రునుండియే యశనిపాతము.

వాల్మీకి—ఏమీ! ధర్మరాజగు రాముడే నిన్నిట విడిచిన నీకు స్వస్తి. నేను పోయివచ్చెదను.

సీత—ఆర్యా! నాపై కోపమే యైనను, ఈ గర్భగతసంతానము రఘువంశసంబంధమైనది. కనుక, నన్ను రక్షింపుడు.

వాల్మీకి—ఏమీ? ఇక్ష్వాకువంశము నుద్ధా రించుచున్నావు? నీవు దశరథునికోడలివా?

సీత—చిత్తము.

వాల్మీకి—జనకుని కూతురవా?

సీత—చిత్తము.

వాల్మీ!—ఏమీ? సీతామహాసాధ్వివా?

సీత—సీతను కాదు. తండ్రీ. మందభాగ్యురాలను.

వాల్మీకి—అయ్యో! లోకజననీ! నీ కీగతి యేలమ్మా? (దివ్యదృష్టిని జూచి) వత్సా! సర్వము తెలిసినది. శ్రీరాముడు నిన్ను లోకపరివాదభయముచే విడిచెను. కాని నీ దోషమావంతైనా లేదు. నీకేమియు భయము లేదు. ముందు శుభమగును. నాయాశ్రమమునందువుగాని రమ్ము.

సీత—పూజ్యపాదులు తామెవరో?

వాల్మీకి—నన్నెఱుగవా? నీతండ్రికి ప్రియమిత్రుడను. నీమామకు బాల్యహితుడను. నీ కిపుడు తండ్రిని, మామను కూడను. వాల్మీకిని.

సీత—(లేచి నమస్కరించి) తండ్రీ! రక్షింపుము.

వాల్మీకి—శీఘ్రమేవ వీరసుపుత్రావాప్తి రస్తు. రమ్ము. పోదము. (నిష్క్రమించును)

సీత—ఓగంగామాతా! నీదయచే నేను సుఖప్రసవనైతినా, నీకు దినదినము ఒక కుందమాల సమర్పించుకొందును. పోయివచ్చెదను. (నిష్క్రమించును)

## రెండవ రంగము

(ప్రవేశము: సీతచెలికత్తెలైన యిద్దఱు మునికన్యలు)

మొదటియామె—చెలీ! మన పుణ్యమే పుణ్యము. మన సీతక్కకు కవలపిల్లలు. ముద్దులొలుకుచున్నారే!

రెండవయామె—సఖీ! అదే నేను అనుకొనుచున్నాను. వారి కప్పుడే గురువుగారు కుశలవులని పేరు పెట్టినారు కాదటే.

మొదటియామె—ఔనౌను. వారు వేయు తప్పటడుగులు, పలికే చిలకపలుకులు చూచుచు, వినుచు మునిబాలురు తపమే మఱచిపోవుచున్నారు.

రెండవయామె—ఇందులో ఆశ్చర్యమేమున్నదే! ఇంత ఉన్నారో లేదో కాని అప్పుడే లేడిపిల్లలతో సమానముగా పరుగులు, సింహపుపిల్లలతో కుస్తీలు—చిత్రము కాదటే! అప్పుడే రామాయణము చెప్పుచున్నారట గురువుగారు వారికి!

మొదటియామె—అప్పుడే వారికి కంఠతః వచ్చినది. ఇంకా చెప్పుచున్నారందువేమే? ఇంకా విశేషాలు? నైమిశములో రామరాజాయజ్ఞమట!

రెండవయామె—ఔను. అన్నీ సిద్ధమైనవి. దేశదేశాలకు పిలుపులు వెళ్లినవి. మనవాల్మీకులవారిని పిలిచినారు.

మొదటియామె—బాగు. బాగు. నడు. సీతక్కదగ్గఱకు పోదము.

## మూడవ రంగము

(ప్రవేశము: చింతతో సీత.)

సీత—ఔను. మగవారిని నమ్మరాదు. సహజముగా వారి భావములు నిష్ఠురములు. లేకపోయినచో స్వర్గములో పార్వతీపరమేశ్వరులను చెప్పుకొన్నట్లు భూలోకములో సీతారాములను చెప్పుకొన్న ప్రజలే నా కీగతి కల్పించిరికదా! జక్కవలవలె మేమిరువురము కలకూడి ఉదయించుచంద్రుని చూచి ఉప్పొంగిపోయెడివారము. కోకిలపలుకులు విని, మలయమారుతము కని యెంత సంతోషించెడివారమో! ఇపుడో!... సిగ్గు. సిగ్గు. వెనుకటిబ్రతుకు తలచుకొన్నకొలది బాధ యెక్కువగుచున్నది. ఇంతకన్న చచ్చుటే మేలేమో! మునివాటికలో నుండి వియోగబాధ తప్ప. ఏదియు కలదు.

చెలికత్తె—(ప్రవేశించి) చెలీ! ఏమట్లున్నావు?

సీత—సఖీ! రమ్ము, రమ్ము. ఏదో బాధ...

చెలికత్తె—నే నెఱుగుదును. ఆ క్రూరహృదయుని తలచుకొని ఏల కృశించెదవు?

సీత—చెలీ! అట్లనకు. అతడు క్రూరుడు కాడు.

చెలికత్తె—ఏల కాడు?

సీత—ఎట్లౌను?

చెలికత్తె—నిన్ను విడిచిపెట్టుటచే.

సీత—మనస్సుచే విడవలేదుకదా!

చెలికత్తె—పిచ్చిమాట. చాలు ఈపిల్లలు ఆ బాధ పోగొట్టజాలుట లేదా?

సీత—వారి పోలికవారే వీరు అగుట ఈబిడ్డలను చూచినపుడెల్ల వారు జ్ఞాపకము వచ్చుట, బాధ ఎక్కువగుట జరుగుచున్నది. ఏమే చెలీ! ఎప్పటికైనా వారు...

చెలికత్తె—సఖీ! తప్పదు. త్వరలోనే నీకు శుభమగును.

(తెరలో) "ఓయాశ్రమవాసులారా! ఈచేరువనే శ్రీరామమహారాజులు యజ్ఞము చేయుచున్నారు. మనయందఱకు పిలుపులు వచ్చినవి. త్వరగా బయలు దేఱవలయును. కనుక మునులందఱు తీర్థజలమును, సమిధలు, దర్భలు మున్నగునవి తీసికొని సిద్ధపడుడు. మునికన్యలందఱు మంగళములు పాడవలయును. ఆలస్యము చేయవలదు. గురువుగారి యాజ్ఞ."

సీత—చెలీ! తొందరగా కుశలవులను తీసికొని రమ్ము. వారికి త్వరగా మంగళాభిషేకము చేసి సిద్ధపఱచెదను.

## నాల్గవ రంగము

(ప్రవేశము: నెత్తిని బరువుతో అలసిపోయిన తపస్వి-ఉస్, అబ్బ! ఏమి యెండ! ఏమి యెండ! ఈ చెవిగాడుపు ఆచెవికి కొట్టుచున్నది. కాళ్లు మాడిపోయినవి. అతికాళ్లు పొక్కులెక్కినవి. అవి చితికి బాధించుచున్నవి. ఉస్! రామ! అప్పుడే సూర్యాస్తమానము కావచ్చుచున్నది. సీతక్కపిల్లలు సాకంటె ముందే వెళ్లినారు. అంత సుకుమారులు కూడ నడకలో నాకంటె చుఱుకే. ఇంకా ఒకక్రోసు తక్కువ లేదు నైమిశము. కూడా ఎవరు సాయములేరు. (చూచి) ఎవరో పీరిద్దఱును? రామలక్ష్మణులవలెనున్నారు ఏమి, ఆ మహానుభావుడు శ్రీరామచంద్రుడు! ఏమి అందము! ఏమి చందము! ఏమి యోగ్యత! అంత మహానుభావుడు లోకములో లేడు. నేను నెమ్మదిగా ఫిరి వనుసరించెదను.

## ఐదవ రంగము

(ప్రవేశము: రామలక్ష్మణులు)

లక్ష్మణుడు—(దారిచూపుచు) ఇటు ఇటు! (నడచి) అక్కటా! వెనుక సీతామహాసాధ్విని ఈ దారినే తీసికొనిపోయి అడవులపాలు చేసితిని. ఈ రామచంద్రుని నేను మరల ఈ దారినే తీసికొనిపోవుచున్నాను. ఎంత పాపినో కదా! (రామునివైపు చూచి) ఎంత చిత్రము! మేరుపర్వతముతో సమానమైన ధైర్యము కల మహారాజు నేడెటులు మారిపోయినాడు! ప్రమాదమువలన సంపదయే పోవును. వ్యసనము వినయమును నశింపజేయును. కాని శోకము ధైర్యమును చంపును. ఆర్యా! ఇటు ఇటు.

రాముడు—ఆమెకొఱకదా వారిధి కట్టితిని. అగ్నిదేవుడే సాక్షి యన్నమాటే మఱచితినే. ఆమెగర్భమున గల యిక్ష్వాకువంశముమాటే ఆలోచింపనైతిని! అక్కటా! ఆమెను విడిచిపెట్టి నేను చేసిన ఘనతయేమి! (నడచి) ఎవరిని జూచి యామె జీవములు నిలుపును? అయ్యో!

లక్ష్మణుడు—అన్నా! అటు చూడుడు. అదే గోస్తనీనది. ఆ చిఱుగాలులు, ఆ సుగంధము. ఆహా!

రాముడు—వత్సా! అన్నియు మఱచిపోతిని. కాని, ఇపుడు స్మృతికి వచ్చుచున్నదేమి! ఇక్కడ సీత లేదుకదా! (ఇరువురు గంగదగ్గరగా కూర్చుందురు.)

లక్ష్మణుడు—అన్నా! ఈయిసుకతిప్పలో అడుగులజాడ, పూలుపండ్లు,...చూడు చూడు. ఈ కెరటములమీదనుండి ఆ కుందమాల మీ పాదములకడకే వచ్చుచున్నది—శతత్రాచుపిల్లవలె.

రాముడు—ఈ చేరువ నెవో యిండ్లు ఉన్నట్లున్నవి.

లక్ష్మణుడు—(నీటిలోని కుందమాల చేతితో తీసి) ఈ మాల యెంత బాగున్నదో! ఎవరు గ్రుచ్చిరో యేమో!

రాముడు—(చూచి) ఎవరో అందువేల? సీతయే. ఈ నిపుణత మఱియొకరికి లేదు. (పుచ్చుకొని) చాల హాయిగా నున్నది. కాని ఇది దేవతా ద్రవ్యము. (విడిచివేయును)

లక్ష్మణుడు—అన్నా! ఆవైపు చూడు. పాదులు. సామగానము వినపడుచున్నది. (ఇరువురు లేచి నడతురు) ఈ యడుగులజాడ యెవరిదో?

రాముడు—(చూచి సంతోషముతో) సీతవే. చూడు. ఆ పదరచన, ఆ రూపము, ఆ రేఖలు—అన్నీ ఆమెవే.

లక్ష్మణుడు—వినచో సీత యీ ప్రాంతమున నుండవలయుఁగదా!

సీత—(దూరముగా ప్రవేశించి) తెల్లవారగనే లేచితిని. నీళ్ళు పోసికొంటిని. సంధ్యోపాసన చేసితిని. గంగమ్మకు కుందమాల సమర్పించితిని. పూలు కోసికొని పోవుదును. (అట్లు చేయును)

రాముడు—వత్సా! లక్ష్మణా! వత్సా!...

సీత—(విని) ఏమి! ఈ మాట యెవరిది? రోమాంచమైనది. అన్యపురుషుని వచనమే యిదియైన

నా కిట్లగునా? రామునిదే—సందేహము లేదు. చూడనా? నన్ను విడిచినవానిని జూడనా? ఇపుడు సంతోషమా, దుఃఖమా కర్తవ్యము?

లక్ష్మణుడు—అన్నా! పిలిచి యూరకుంటి వేమి?

రాముడు—ఏమియు లేదు. ఈప్రదేశము చూడగనే వెనుక సీతతో హాయిగా ప్రణయభాషణము చేయుచు ఇసుకలో షికారుచేసిన దినములు స్మృతికి వచ్చినవి... ఆమెకు పాపి మెప్పుడు కష్టములే, అట్టి సతిని పెండ్లాడినయామె కింతే కదా ఫలము! అయ్యో! సీతా...(దుఃఖించును)

సీత—ఆర్యపుత్రుడు అతిమాత్రముగా విచారించుచున్నాడు. ఏమిచేతును? ఎదుట పడిన తపోజనులు కలుగురు నవ్వరా? కావున, నే పోదును. (నిష్క్రమించును)

ఋషి—(ప్రవేశించి) మహారాజా! వాల్మీకులవారు తాముభయులు ఇటకు వచ్చుట యెఱిగి తమ్ము తీసికొనిరమ్మని పంపిరి. తాము దయచేయవలయును.

రాముడు—(ధైర్యముతో) మహాత్మా! వందనములు. అట్లే వాల్మీకులను దర్శింతము. సాయంసమయ మైనది. నడువుడు.

ఆరవ రంగము

(ప్రవేశము: ఇద్దఱు తాపసస్త్రీలు.)

మొదటియామె—ఏమే చెలీ! నిన్న కుశలవులు చేసిన రామాయణగానము వినుటకు వచ్చిన తిలోత్తమ నాతో ఏమి చెప్పినదో ఎఱుగుదువా? తాను సీతరూపము ధరించి రామునికి సీతపై ఎంత ప్రేమకలదో పరీక్షించునట!

రెండవయామె—సరి! నీవు, తిలోత్తమ ఈ మాటలు అనుకొన్నప్పుడు రామహితుడు విదూషకుడు చాటున నుండి ఈమాటలు విన్నాడు.

మొదటియామె—అయ్యో! గొప్పచిక్కే. ఈ మాట తిలోత్తమతో చెప్పనా?

రెండవయామె—చెప్పు. సీతక్క ఎక్కడ ఉన్నది?

మొదటియామె—ఈ చెఱువుదగ్గఱే ఉన్నది. ఒక చిత్రము. నిన్న మే మందఱము వాల్మీకులవారితో పురుషులు చూడని మఱుగు లేమియు లేవని చెప్పినాము. అంతట, ఈచెఱువు దగ్గఱ తిరుగు స్త్రీలు పరపురుషులకు కన్పింపకుండ నుందురుగాకయని వారు సెలవిచ్చినారు. కనుక పురుషులు ఎవరికి కనపడకుండ సీతక్క యిక్కడనే తిరుగుచున్నది.

రెండవయామె—ఓహో! ఐతే, రామరాజును కుశలవులు ఎఱుగుదురా?

మొదటియామె—అబ్బే. చిన్నతనము చేత, ముని బాలుర స్నేహముచేత వారు తల్లిపేరే యెఱుంగరు. ఇక తండ్రిసంగతి అసలే తెలియదు. పోదము. (నిష్క్రమింతురు)

ఏడవ రంగము

(ప్రవేశము: ఉత్తరీయము కప్పుకొని సీత, చెలికత్తె)

చెలికత్తె—సఖీ! ఈ చక్కని ఉత్తరీయము నిన్నెవరు ధరింపు మన్నారమ్మా!

సీత—ఈ చలిగాలి.

చెలికత్తె—ప్రవాసినివికదా! ఇది తగునా?

సీత—చెలీ! వెనుక మామగారి యాజ్ఞవలన మే మడవుల కేగి చిత్రకూటమున ఉన్న దినములలో ఆ వనదేవత మాయొక్క నురిచేతులందు పెట్టి బహూకరించినది. అపుడు దీని యందచందములు, సువాసన చూచి మే మెంత మురిసిపోతిమో! ఇపుడో... (దుఃఖించును.)

చెలికత్తె—సఖీ! దుఃఖింపకుము. తపోవనవాసము వనవాసమే కాదు.

సీత—అయ్యో! చెలీ! ఆర్యపుత్రుడుకూడ ఇక్కడనే ఉండగా...నాబాధ మఱింత యగుచున్నది.

చెలికత్తె—చెలీ! ఓపికపట్టుము. శుభమగును. ఇపుడే వచ్చెద. (నిష్క్రమించును)

సీత—ఆహా! ఈ రాజహంసదంపతులు ఎంత సుఖముగా నున్నారు? అయ్యో! పక్షులుకూడ శృంగారచాటువు లాలాపించుచున్నవి.

(ప్రవేశము: ఒకముని, రాముడు)

ముని—వాల్మీకులవారు విరహబాధతో నుండు రాముని వినోదింపజేయు నన్నంపిరికదా! ఈతడు చెంతతో నా మాటలే వినిపించుకొనుట లేదు. ఎట్లో! ఓ రాజా!

రాముడు—అయ్యో! తాపసమిత్రమా! "కోడలా!"అని పిలువుము. సరే! ఏమి చెప్పుచున్నావు?

ముని—రమ్యమైన పరిమళముతో నున్న పువ్వులు, పండ్ల బరువుతో వంగిన కొమ్మలు, కొమ్మలతో నిండిన చెట్లు—ఈ అడవి యెంత మనోహరముగా నున్నదో!

రాముడు—ఔనౌను. చాల మనోహరముగా నున్నది. ఈ నైమిశము నాకు పరమపూజ్యము. (నమస్కరించును.)

ముని—అంతే కాదు. ఈసమీపమున నున్న యీశ్వరుని తలపై నున్న చంద్రకళవలన చల్లపడిపోవుచుండు సూర్యరశ్మివలన చెట్ల ఆకులు వాడిపోవు. పరస్పరలో నీ శ్రీంకవు. ప్రాణులకు శ్రమ కలుగదు. ఈ యడవి ఆనందకంద మగుచుండును.

రాముడు—ఆహా!

ముని—రాజా! చూడు. ఈ మునుల సామగానము వినుచు చెవులు ఆడించుచునే మఱచిపోయిన యేనుగుల మదజలము గ్రోలుచున్న తుమ్మెదలకు విఘ్నమే కలుగుట లేదు.

రాముడు—(నవ్వి) ఇం దాశ్చర్యమే లేదు. నావంటి ప్రవాసికే యింత ఆనందమిచ్చు సామగానము మదపుటేనుగుల కెంత సుఖప్రదమో యెవరు చెప్పగలరు?

ముని—ఆహా! విరహులు జంతువులకన్న కావ్యహృదయులనియూ నీభావము!

రాముడు—(పొగబాధ నటించి) అబ్బ! ఈ ఋష్యాశ్రమమునుండి వచ్చుచున్న పొగ కన్నుల నలము కొనుచున్నది. ఈ కొలువులో కళ్లు కడుగుకొందును.

ముని—అట్లు చేయుము. నే నిప్పుడే వచ్చెద. (నిష్క్రమించును)

రాముడు—(కొలువులోనికి దిగి) ఈ నీరు కలకలేక యున్నది. (ఒక నీడ చూచి) ఏమీ! ఈ నీడ సీతదేమో! సీతదే! ఇది ఎక్కడనుండి వచ్చినదో? ఆశ్చర్యము!

సీత—(చూచి) ఓహో! పరధ్యానమున నుండగా ఆర్యపుత్రుడు వచ్చి వేసినాడు. నేను చూడనే లేదు. తొలగిపోదును. (తొలగును)

రాముడు—అయ్యో! ఇన్నాళ్ళకు ఈ రూపమున కనిపించి అప్పుడే తొలగిపోయినదే! పట్టుకొనెదను. (అట్లు చేసి) అరె! ఇది వైదేహి కాదే! ఆమె నీడయూ నేను చూచినది! ఐతే, సీతలేనిదే ప్రతిబింబము కనబడదు కదా! (వెదకును)

సీత—ఓహో! తెలిసినది. వాల్మీకుల యనుగ్రహమున ఇచటి స్త్రీలు పరులకు కానరారు కదా! నేను కానరాక నా నీడ ఆర్యపుత్రునకు కానవచ్చుచున్నది.

రాముడు—అయ్యో! సీత కానరాదు. ఆమె నీడ చూచియైన ఆనందింతును (చూచి) కానరాదే—సీతా! (మూర్ఛిల్లును)

సీత—అయ్యో! అయ్యో! ఆర్యపుత్రుడు మూర్ఛిల్లెనే! నా ప్రాణప్రాణమునకే ప్రమాదము వచ్చినతరి తెలుగుదు నవ్వుదు రని చేరకుందునా? నేను అవినీతిచే తాకుచుంటినో కాదో లోకపాలకు లెఱుగరా? ఏమైనను నాథుని రక్షించుకొందును. (చేరి కౌగలించుకొనును)

రాముడు—(మూర్ఛ తేఱును)

సీత—(తొలగును)

రాముడు—సాధ్వీ! క్షమింపుము. దర్శనమిమ్ము. తప్పు నాదే. నిన్ను విడిచిపెట్టుట—దోషమే లేని నిన్ను అడవికి త్రోలుట—ముమ్మాటికి నాతప్పే. సఖీ! మరల మనము కలిసికొందుమా? అయ్యో! సీతా... (మూర్ఛిల్లును)

సీత—(ఉత్తరీయముతో విసరును)

రాముడు—(మూర్ఛ తేరి ఉత్తరీయము లాగివైచుకొని) ఏమి? ఇది సీతదే. చిత్రకూట వనదేవత యిచ్చినదే యిది. నా పుణ్యమువల్ల లభించినది. ఇది కప్పుకొని నా యుత్తరీయము పాఱవేయుదును (అట్లు చేయును.)

సీత—(రాముని యుత్తరీయము తీసికొని, వాసన చూచి) ఏమీ నా పుణ్యము! రాఘవులు సత్యసంధులు. అన్యస్త్రీగంధమే దీనికి లేదు.

రాముడు—సఖీ! సీతా! నీకోసము ఎంతి వలవించినా దర్శనమీయవేమి? నాతప్పు క్షమింపవా! అయ్యో! సీతా!...(విచారించును)

సీత—(దూరమున విదూషకుని చూచి) అదిగో! ఆర్యపుత్రుని స్నేహితుడు వచ్చుచున్నాడు. నే పోయినను బాధలేదు. నావని యైనది. శ్రీరాముని ప్రేమ పరీక్ష యైనది. (నిష్క్రమించును)

విదూషకుడు—(ప్రవేశించి) రాజా! ఓరామ రాజుగారూ! ఎక్కడ! రాజాగారూ!

రాముడు—(నవ్వి) ఓహో! మిత్రరత్నమా! ఏమిటి సమాచారము?

విదూషకుడు—మంచి వాడ వే! నీకోసము ప్రొద్దుటనుండి తిరుగుచున్నాను. చులకనగా సాయంకాలమైనది. దర్శనమే కాదాయె!

రాముడు—ఏమిటికథ?

విదూషకుడు—ఏమా? అదవతో తిలోత్తమట. సీతవేషముతో నిన్ను మోసగించునట.

రాముడు—అదియా! తెలిసినది—అంతపని జరిగినది. మోసపోతిని.

విదూషకుడు—ఊహూ, మోసపోతివా? వెఱ్ఱినాయనా!

రాముడు—వంచనయే జరిగినది. చిత్రము! రమ్ము చెప్పెదను ఎట్లో.

## ఎనిమిదవ రంగము

(ప్రవేశము: విదూషకునితో రాముడు)

విదూషకుడు—రాజా! సిద్ధమైతివా?

రాముడు—ఆ. స్నానము, జపము, సంధ్యార్చన, అగ్నిహోత్రము అన్నీ అయినవి.

విదూషకుడు—ఐన, ఈ ఆస్థానమండపమున ప్రవేశించు.

రాముడు—(ప్రవేశించి, చింతతో) నిన్న ఎంత పని జరిగినది! తిలోత్తమమోసమే? సీత కాదా! ఎట్లు నమ్ముట? ఆ కుందమాల ఆమెయే గ్రుచ్చవచ్చును. ఆ ఇసుకలోని అడుగుజాడ లామెవే కావచ్చును. కాని, ఆ తిలోత్తమ పయిటచెఱగుతో నన్నెట్లు వీచును!

విదూషకుడు—రాజా! ఆ తిలోత్తమమాట మఱచిపోవయ్యా! గతజలసేతుబంధనము. చూచితివా? నీవు కూర్చున్న ఆసనసింహాములు నిన్ను, నీ మనస్సులోని సీతమ్మను మోయలేక వెఱుగులువిడుచుచున్నవి, చూడు.

రాముడు—మిత్రమా! నీ తెలివి గొప్పదే. నా మనస్సు సతమీదనే ఉన్నది. నిజమే.

విదూషకుడు—ఆమెద్రోహమువలనా? గుణములవలనా?

రాముడు—వెఱ్ఱివాడా! సీతారాముల దాంపత్యము, ప్రేమావేశము కారణరహితము.

విదూషకుడు—ఈ దొంగమాటలవల్లనే నన్ను, సీతను మోసపుచ్చితివి. ఆ యిల్లాలిని—ఏ పాపమెఱుగని ఆ యిల్లాలిని అడవులపాలు చేసితివి. అయ్యో! సీతమ్మతల్లీ...(ఏడ్చును.)

రాముడు—మిత్రమా! ఊఱకిల్లు ఊఱకిల్లు. మునులువచ్చు వేళ యైనది. ద్వారపాలురతో జాగ్రత్తగ నుండుమని చెప్పిరమ్ము.

విదూషకుడు—(వెళ్ళి, వచ్చి) రాజా! మంచి మాట. ద్వారముదగ్గఱ ఇద్దఱు ముద్దుబిడ్డ లున్నారు. నీ దర్శనముకోసమట. రామాయణము నీకు వినిపింతురట.

రాముడు—అట్లనా? వారిని తీసికొనిరమ్ము. సందేహ మేల? త్వరగా.

విదూషకుడు—(వెళ్ళి, తీసికొనివచ్చును.)

(ప్రవేశము కుశలవులు.)

రాముడు—(దూరమునుండి చూచి) నిజముగా ఈ బిడ్డలు నా బిడ్డలే. అయ్యో! నన్ను నేనే మఱచిపోవుచున్నానే! ఆనందబాష్పములు బయలుదేరుచున్నవి! చిత్రము! ఔను. పూర్వజన్మసంబంధములు తెలియవుకదా! కాదు. వీరు నాబిడ్డలే. ఆఁ.

కుశుడు—(తమ్మునితో) ఈ రాజునకు నమస్కరింతమా?

లవుడు—వలదు. మనము ఋషిబాలురము. అతడు రాజు.

కుశుడు—ఏమో కాని, నాకు నమస్కరింపకుండ ఉండ బుద్ధికలుగుటలేదు.

లవుడు—అన్నా! నాకు అంతే. సరే-కానిమ్ము.

(ఇరువురు రామునకు నమస్కరింతురు)

రాముడు—అయ్యో! మునివత్సలారా! నేను మీకు నమస్కరింపదగ్గవాడను కాను. ఐనా, మీ నమస్కారములు మీ గురుదేవులకు చేరుగాక! వత్సలారా! రండు. ఈ అర్ధాసనమున కూర్చుండుడు. (కుశలవులను ఆసనముపై కూర్చుండబెట్టుకొనును)

విదూషకుడు—రాజా ! మా తల్లి సీతమ్మ మగ పిల్లలనే కన్నచో వారీపాటి ఇంతంత ఉందురు. ఆ పిల్లలను చూచు యోగము నావంటిమీద లేదెపో !... (ఏడ్చును.)

రాముడు—మిత్రమా ! విచారించకు. ఒక ప్రవాసి చాలకాలమునకు తనబిడ్డలవంటి బిడ్డలను చూచి నప్పుడు అతని బాధ వర్ణించగల్గవా ?

విదూషకుడు—(తొందరగా) అయ్యో ! అయ్యో ! పిల్లలను దింపు. పాము ! పాము !

రాముడు—(తొందరగా పిల్లలను దింపును.) ఏమిది మిత్రమా !

విదూషకుడు—రాజా ! రఘువంశజులు కాని వారు ఈ సింహాసనముమీద కూర్చున్న వారి తల బ్రద్దలై పోవునట! ఇపుడు జ్ఞప్తికి వచ్చినది. ఆ పిల్లలను చూడు. ఏ ఆపద కలుగలేదుకదా !

రాముడు—(చూచి) వత్సలారా ! మీ కేఆపద కలుగలేదుకదా !

కుశలవులు—రాజా ! మా కేఆపద లేదు. పైగా సుఖముగా ఉన్నది.

రాముడు—అహా ! ఇది పరమ చిత్రముగా నున్నదే ! మునిప్రభావము కాబోలు ! వత్సలారా ! మీవర్ణము ?

లవుడు—ద్వితీయము.

రాముడు—మీరు అగ్రజన్ములు కారా ! ఆశ్రమము ?

లవుడు—ప్రథమము.

రాముడు—మీ వంశకర్త ?

లవుడు—సూర్యుడు.

రాముడు—ఓహో! మాతో సమానులే యైనారే! మీరు ఇరువురు ఏమగుదురు ?

లవుడు—మేము అన్నదమ్ములము. కవలము.

రాముడు—మీ పేళ్ళు ?

లవుడు—గురువుగారికి వందనముచేయుచు నేను లవుడనని చెప్పుకొందును.

కుశుడు—గురువుగారికి వందనముచేయుచు నేను కుశుడ నని చెప్పుకొందును.

రాముడు—ఆహా ! ఏమి సముదాచారము ! మీ గురువుగారి పేరు ?

లవుడు—శ్రీ వాల్మీకులు.

రాముడు—మీ పిత ?

కుశలవులు—మే మెఱుగము. నిరనుక్రోశు డేమో ! అపుడపుడు, మాయమ్మ కోపముతో మమ్ము 'నిరనుక్రోశుని పుత్రులారా !' అనును కనుక.

రాముడు—చిత్రము ! చిత్రము ! అయ్యో !

విదూషకుడు—మీ అమ్మపేరు ?

లవుడు—'దేవి', 'వధువు'. మొదటి పేరుతో మునులు రెండవ పేరుతో గురువులు పిలతురు.

రాముడు—(విదూషకునితో) మిత్రమా ! ఈ కుమారుల వృత్తాంతము మన వృత్తాంతముతో సమానముగా లేదా ?

విదూషకుడు—తప్పక అట్లే కనపడుచున్నది.

(తెరలో)

"ఓయీ ! కుశా! ఓయీ! లవా! ఎచటనున్నాడు ?"

కుశలవులు—ఆc, ఆc, ఇద్దఱము ఇక్కడే ఉన్నాము.

(తెరలో)

"అంత ఆలస్యమేల ? త్వరగా సిద్ధముకండు. వాల్మీకులవారు చెప్పిన రామాయణము రామరాజులకు పాడి వినిపించి బహుమతి పొందవలయును. త్వరగా రండు."

కుశలవులు — రాజా ! ఉపాధ్యాయుడాత పిలుచుచున్నాడు. పోదము.

రాముడు—వత్సలారా ! మంచిది. ఆదికవి కావ్యము, మీరు గాయకులు. పద్మనాభుని చరిత్రము. తప్పక మేము విందుము. వెళ్లిరండు. వయస్యా ! ఈ బాలుర రామాయణగానము వినుటకు లక్ష్మణుని పిలుతుము. నేనును వచ్చెదను. (నిష్క్రమింతురు)

## తొమ్మిదవ రంగము

(ప్రవేశము : రామలక్ష్మణులు, కుశలవులు)

కంచుకి—(ప్రవేశించి) రాజా ! జయము ! జయము ! ఆస్థానమండపము తయారైనది. ఇవే ఆసనములు. దయచేయుడు.

(అందఱు కూర్చుందురు)

కంచుకి—ఆర్యా ! వీరే ఆ తెరమాటున కౌసల్య, కైకేయి, సుమిత్ర. ఈవల మువ్వురు ఊర్మిళ, మాండవి, శ్రుతకీర్తి.

రాముడు—మంచిది. నీవు నీతోటికి పొమ్ము.

కంచుకి—చిత్తము. (నిష్క్రమించును)

రాముడు—ఆర్యులారా! మీ గాన మారంభించవచ్చును.

కుశలవులు—

అంత దశరథ నామధరాకాంతు డలరి
మరులఁ గౌసల్య కైకేయి మఱి సుమిత్ర
నతిసుగుణవతుల ముగ్వురు సతుల ధర్మ
పత్నులనుగా వరించి యుద్వాహమయ్యె.

రామలక్ష్మణులు — కథానాయకులు పూజ్యపాదులు దశరథులే. (లేచి నమస్కరింతురు)

కుశలవులు—

గర్భములు దాల్చి కౌసల్య కనెను రాము.

లక్ష్మణుడు—(లేచి నమస్కరించును)

కుశలవులు—

భరతునిం గనె కైకేయి పరమహర్ష
మొదవఁ జేయ సుమిత్ర యాపిదప గవలఁ
గనియె లక్ష్మణశత్రుఘ్ను లను సుతులను.

రాముడు—(లక్ష్మణుని కౌగిలించుకొనును.)

కుశలవులు—

రామచంద్రుండు సీతను రమణిమీఱ
లక్ష్మణుం డూర్మిళాకన్య లలితముగను
మాండవీశ్రుతకీర్తుల మహిఁ గ్రమమున
భరతశత్రుఘ్ను లెన్న నుద్వాహమైరి.
బాల్యయౌవనమధ్యమా వయసునందు
వెలుగుచుండిన యా రాజవరకుమారు
లాత్మభార్యల ననురాగ మతిశయింపఁ
గనిరి బుద్ధివికార మౌత్కంఠకలన.

లక్ష్మ—ఆహా! రమణీయము! రమణీయము!

రాముడు—తరువాత?

కుశలవులు—

అపుడు రామాభిషేకార్థ మఖిలవస్తు
సమితి సిద్ధంబుగా నున్న సమయమందు
మాతులుని జూడ శత్రుఘ్ను మైత్రిఁ గూడి
భరతుఁ డరిగె మాతామహు పురమునకును.

రాముడు—(తనలో) కైకమ్మదోషము ప్రకటించును కాబోలు. (ప్రకాశముగా) ఈ కథ కట్టు దాటించి సీతాపహరణమునుండి గానము చేయుడు.

కుశలవులు—

శూర్పణఖ మూలమున సీతసుందరతను
పంక్తికంఠుఁడు వినినంతఁ బటుతరాశ
నపహరించె సీతాదేహ మంతెకాని
అపహరింపఁగలేఁ డయ్యె నామె చరిత.

లక్ష్మణుడు—(రాముని వైపు చూచును)

కుశలవులు—

వారినిధి సేతువుం గట్టి పంక్తికంఠు
సపరివారంబుగా యమసదన మంపి
సీతఁ దోడ్కొని రాముండు శీఘ్రముగను
వచ్చిచేరెను సాకేతవర పురంబు.

రాముడు—ఆహా! చక్కని సంక్షేపము!

కుశలవులు—

ప్రాప్తరాజ్యుండు నా రామభద్రుఁ డంత
నించుక జనాపవాదంబు నెంచి మదిని
మంతనంబున లక్ష్మణు నంతఁ బిలిచి
అడవి సీతను విడువగా నాజ్ఞ చేసె.
బావ్వపరాత్మకులతఁ బడఁతి సీతఁ
గడు వనాధను వైక్లబ్యకలిత నబలఁ
బుణ్యగర్భంబునకొ రఘుపురమదివ్య
సంతతి వహించు బహుపుణ్యసాధ్విఁ గొనుచు.
నిర్జనారణ్యమందు ననేకఘోర
మృగకులాకీర్ణభూమిని మేదినీసు
తనుఁ గుదమ్ముండు లక్ష్మణు డాక్షణంబ
జనకజాతను విడనాడి చనియెఁ బురికి.
మాగీతము దీనితో సరి.

రాముడు—అయ్యో! లక్ష్మణా! ఎంతకష్టమెంతకష్టము! అడవిలో సీత అసువులు వీడిపోయుండవచ్చును. అందుచేతనే కవి అప్రియకథ విడిచియుండు నేమో! అయ్యో! సీతా!

కుశుఁడు—ఏమీ! రామాయణకథా నాయకులు మీరేనా?

లక్ష్మణుడు— ఔను వత్సా!

కుశుడు—సీతను విడిచినది నీవేనా?

లక్ష్మణుడు—ఔను వత్సా!

కుశుడు—తరువాత సీతగతి యేమైనది?

రాముడు — మాకు తెలియదు. మీకు తెలియునా?

కుశుడు—మాకు తెలియకే మిమ్మడిగితిమి.

ఋషి—(ప్రవేశించి) ఆర్యులారా! ఆతరువాత కథ వినుడు. వాల్మీకిశిష్యులవలన విని సీతదగ్గఱ కేగి ఆమె నూఱడించి తన యాశ్రమమున సంరక్షించెను.

అందఱు—సంతోషము, సంతోషము.

ఋషి — తొమ్మిదినెలలు నిండి ఆయమ్మ అక్కడ కవలపిల్లలను కన్నది.

రాముడు—(తనలో) వీరే వారేమో!

ఋషి—వాల్మీకులు వారికి నామకరణపువేళ 'కుశు'డని, 'లవు'డని పేరుపెట్టిరి.

రాముడు—ఏమి! వీరే సీతాపుత్రులా! హా పుత్రులారా! హా! సీతా!

కుశలవులు—తండ్రీ! తండ్రీ! రక్షింపుము.

(ఒకరి నొకరు కౌగిలించుకొని మూర్ఛిల్లుదురు)

(ప్రవేశము: వాల్మీకి, సీత)

వాల్మీ—(చూచి) వత్సా! అదిగో! కుశలవులు, రామలక్ష్మణులు నీకష్టకథ విని మూర్ఛిల్లినట్లున్నారు. త్వరగా సేదదేర్చి రక్షింపుము.

సీత—తండ్రీ! ఆర్యపుత్రుని చూడ నా కనుజ్ఞ లేదుకదా! అయ్యో! ఎట్లు!

వాల్మీకి—నేనుండగా ఇంక అనుజ్ఞ? త్వరగా సేవింపుము.

(సీత పరిచర్యచేయగా రామలక్ష్మణులు, కుశలవులు మూర్ఛ తేలుదురు.)

కుశలవులు—హా! తండ్రీ! రక్షింపుము.

వాల్మీకి— వత్సలారా! తొందరవలదు.

రామలక్ష్మణులు — ఓహో! వాల్మీకులే! (నమస్కరింతురు) ఇదిగో! సీత!!!

వాల్మీకి— ఓరామా! కఠినహృదయా! పరమపూజ్యురాలిని విడువదగునా? అగ్నిసాక్షి మఱుపునకు వచ్చెనా? పామరు డన్న మాట కిట్లు చేయుదువా?

రాముడు— (బద్ధహస్తముల తో!) మహాత్మా! రక్షింపుడు. ప్రపన్నుల కండు.

వాల్మీకి— సీతా! నీ పావిత్ర్యశుద్ధికి శపథము చేయుము.

సీత— (అంజలిబట్టి దిశలు పరికించి) ఓసమస్త లోకపాలురారా! మహర్షులారా! సూర్యదేవా! రాఘవకులపితామహా! సమస్తభూతములారా! నేను రాముని తక్క పొరపాటునకైన అన్యపురుషుని తలచితినైన కెలుగనేని నాయాత్మశుద్ధి భూదేవి ప్రకటించుగాక!

అందఱు — ఆశ్చర్యమాశ్చర్యము! ఆ నిర్ఘోష మేమి? నదులు, సముద్రములు పొంగిపోవుచున్నవి. భూమ్యాకాశములు దద్దరిల్లుచున్నవి. ఓహోహో!

(తెరలో)

"గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యం! లోకా స్సమస్తా స్సుఖినో భవంతు!" ఓహో! సీతప్రతిజ్ఞ విని భూదేవి సాకారయై వచ్చుచున్నది. ఓజనులారా! లేచి మ్రొక్కుడు! మ్రొక్కుడు!

వాల్మీకి—ఓహోహో! ఆశ్చర్యము! అదే భూదేవికి రామలక్ష్మణులారా! నమస్కరింపుడు. కుశలవులారా మ్రొక్కుడు. మునులారా! పుష్పములు! పుష్పములు!

(ప్రవేశము : కొందఱు స్త్రీలు పూలు చల్లుచుండగా భూదేవి.)

(అందఱు నమస్కరించి పూలుచల్లుదురు)

అందఱు—భగవతీ! విశ్వంభరా! నమో నమః.

సీత—(నమస్కరించి) అమ్మా! కరుణించి నా పరిశుద్ధి వీరి కెఱుకపఱుపుము.

భూదేవి—తథాస్తు! ఓసకలజనులారా! సూర్యరశ్మియైన చొఱలేని పాతాళమునుండి యీసీతామహాసాధ్వీమాట ననుసరించి యిట్లవతార మెత్తవలసివచ్చినది. త్రికరణశుద్ధిగా, పంచభూతములు సాక్షిగా సీత మహాసాధ్వియే. దేవతలు పుష్పవృష్టి కురిసి యీమాట ధ్రువపఱతురుగాక!

(ఆకాశమునుండి పుష్పవృష్టి, జయజయధ్వనులు.)

అందఱు — ఆహాహా! సీత మహాపతివ్రతయే. ఏసందేహము లేదు.

వాల్మీకి—రామా! సీతను గ్రహింపుము.

రాముడు — గురుల యాజ్ఞ. (సీతచేయిపట్టుకొని) కళ్యాణీ! రమ్ము.

సీత—(నమస్కరించును)

భూదేవి — ఓజనులారా! సీతారామసమాగమమైనది. శుభమగు గాక! శుభమగు గాక. (అంతర్ధానమగును)

రాముడు—మహర్షి పుంగవా! లక్ష్మణు నభిషేకింపుము.

లక్ష్మ—ఆరాజశబ్దము కుశున కమరుగాక!

వాల్మీకి— ఇది రఘువంశమర్యాదయే. (కుశుని అభిషేకించి పట్టముగట్టును)

రాముడు—ఓమహాజనులారా! మీరాజు, మీ యాజ్ఞలచే లవుని యువరాజునొనరించెదను. (హర్షధ్వనుల మధ్య లవుని అభిషేకించి పట్టముగట్టును)

వాల్మీకి—రామా! ఇక నీ కేశుభము కావలయును?

రాముడు—ఇక లేమ అనుగ్రహమే. సమస్తము సిద్ధించినవి.

వాల్మీకి—వినవిట్లగుగాక! ఈపుత్రులు సకల శుభములు పొందుదురుగాక! గోకులము వర్ధిల్లుగాక.

---

# మబ్బు

— శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి —

చిఱుతగొడ్డలి వ్రేటు చుఱుక సోకినది
ఒక మహావిటపి నేలకుం గూలి పడినది—
ఒక హాలహలవాయు వొలసి వీచినది
కైలాసశిఖరి గ్రక్కదలి చెదరినది—
తులువచిమ్మటకు రెక్కలు వాఁడిమైనవి
ఒక జగజ్జ్యోతిజీవిక మ్రోడువడినది—
ఒక శిఖండిధనుర్గుణోక్తి మ్రోగినది
ఆచార్యునకు భౌతికాంగ మాఁగినది—
ఒక బోయగుండె యూరక జాయిమైనది
అవతారమూర్తిదేహము పూర్తిమైనది—
అవలీనమైనది కవుల భావన యుబ్బు
అలముకొన్నది భారతాభ్రమ్ములో మబ్బు.

---

# హాస్యరచనలో ఉన్న సాధకబాధకాలు*

●

'నిరంజన్'

ఆఁ, మరేం లేదు. నే నొక మాసపత్రికలో మంచి రసవంతమైన ప్రహసనం ఒకటి వ్రాశాను.

అది చదివిన నా ఆంతరంగిక స్నేహితులందరూ పొట్ట చెక్కలయ్యేటట్లు నవ్వారు; అయితే చెప్పవలసిన విషయం ఏమంటే, నా విరోధులు కూడా కడుపు ఉబ్బేట్లు నవ్వుకుంటున్నారు. అముదాలపల్లి, చెల్లిమర, పోనపానపల్లి నుంచి ముగ్గురు పాఠకులు నాకు ఉత్తరాలు వ్రాశారు— ఈ ప్రహసనంయొక్క అర్థమేమిటో చెబుతారా అని.

వీరిలో కొంచెం పెద్దమనిషి తరహా ఉన్న ఒకాయన "బహుశా ముద్రణలోనే ఏదో దోషం ఉండి ఉంటుం"దని అనుమాన పడ్డాడు. రెండో ఆయన అనావశ్యకమైన సహృదయతతో రచయిత మానసిక స్థితి విషయమై ఆదుర్దా కనబరిచాడు. మూడో వ్యక్తి అనుమానానికీ, ఆశంకకూ అతీతమైన స్థితిలో పడ్డాడు. పర్యవసానంగా, నేనే ఆయనవిషయంలో ఆదుర్దా పడవలసివచ్చింది.

శ్రీనివాసమూర్తిగారు చికాకోల్ నుంచి ఇలా వ్రాశారు: "గోవిందంగారు వ్రాసిన ఈ ప్రహసనం యొక్క ఉద్దేశ్యం ఏమిటి? దీనివల్ల దక్షిణఆఫ్రికాలో మన సాటివాళ్ళు పడుతున్న అగచాట్లు ఏమైనా తీరుతయ్యా? పోనీ, దేశంలో రోజూ ఇంతమందిని పిచ్చి కుక్కలు కరుస్తున్నయ్యే. కనీసం దానికైనా గ్రంథకర్త ఈ రచనలో ప్రతిక్రియ సూచించాడా?"

అజ్ఞానతిమిరనివారిణీపత్రిక నా రచననుగురించి ఇలా సమీక్షచేసింది: "పొలాలలో వరిసాగు తగ్గించేసి దానిస్థానే పట్టు పండిస్తూఉండడంవల్ల రైతుల స్థితి వెనకటికంటె ఇప్పుడు మెరుగైందనేగనక గోవిందంగారు అభిప్రాయపడుతున్నట్లయితే, మాకూ గ్రంథకర్తకూ మతం కలవదని చెప్పకతప్పదు. కాని ఒకవేళ, పట్టు పండించడంకన్న వరిసాగు చేయడమే శ్రేయస్కరమని ఆయనఉద్దేశ్యం అయినట్లయితే, అదీ సంపూర్ణ సత్యం కాదు. అయితే, ఈ రెంటిలో ఆయనఉద్దేశ్యం సరిగ్గా ఏదో, వ్రాసినదానినిబట్టి నిర్ధారణచేయడం అసంభవం."

అసంభవమే, సందేహం లేదు. ఎందుచేతనంటే నే నింతవరకూ పట్టు పండించడం విషయమై ఎక్కడా ఒక్క ముక్కయినా వ్రాసిన పుణ్యానికి పోలేదు.

జ్ఞానప్రకాశ్ ఇలా వ్రాసింది: "మన దేశంలో చాల వితంతువులు పడుతున్న కష్టనిష్ఠురాలు చూసి, పాఠకులకు ఏడుపు వచ్చేట్లు చేయడానికి రచయిత ప్రయత్నించాడని మాత్రం ఆభాసగా అర్థం అవుతోంది. పీసీ ఏడుపూ, పీడూ బంగారంగాను! మాకు గ్రంథం చదువుతున్నంతసేపూ ఎక్కడా ఏడుపు రాలేదు సరికదా; మొదట్నుంచీ చివరి దాకా పొట్ట చెక్కలయ్యేట్లు నవ్వొచ్చింది."

సమీక్షకుడి పొట్ట చెక్కలకడానికి నేనే పూర్తిగా బాధ్యుణ్ణి అని అంగీకరిస్తాను. కాని పుస్తకం చదివిన మీదట, తన కేదైతే ఆభాసగా అర్థం అయిందని ఆయన చెప్పాడో అందుకు మాత్రం ఆయన బుద్ధికుశలతే పూర్తి బాధ్యత వహించాలి.

---

* రవీంద్రనాథటాగూరు రచన ననుసరించి.

'సమ్మార్జనీ' అనే వారపత్రిక ఇలా వ్రాసింది: "హరిహరపురం మునిసిపాలిటీని విమర్శిస్తూ గోవిందం గారు వ్రాసిన సుగభీరరచన సుబోధకంగానూ, సునిశితంగానూ ఉన్నదనడంలో సందేహంలేదు. కాని ఒక్క విషయం మాత్రం మాకు చాలా దుఃఖమూ, ఆశ్చర్యమూ కలిగించివది. ఈయన ఇతరుల అభిప్రాయాలను స్వంత అభిప్రాయాలుగా ప్రదర్శించడానికి ఏమాత్రమూ సందేహించడు.

రచయిత ఒకచోట వ్రాశాడు: 'పుట్టిన తరువాత చావక తప్పదు' అని. ఈ చమత్కార భావం గ్రీకు పండితుడైన సోక్రటీస్ గ్రంథంలో కనిపించి ఉండక పోయినట్లయితే, రచయిత యొక్క స్వతంత్ర ఆలోచనాశక్తిని తప్పకుండా ప్రశంసించిఉండేవాళ్ళం. ఇటువంటి వే దొంగసొత్తు నమూనాలు మరికొన్ని ఈ కింద పొందుపరుస్తున్నాము—

గిబ్బన్ వ్రాశాడు—'రాజ్యంలో రాజు లేకపోతే ప్రజలు విశృంఖలం అవుతారు' అని. గోవిందంగారు వ్రాశారు—'ఒకవంక అరాజకత, దానికి తోడు అనావృష్టి. గండస్యోపరివిస్ఫోటకం' సంస్కృత శ్లోకంకూడా కాళిదాసు కావ్యంలోంచి దొంగిలించిందే.

రస్కిన్ వ్రాసిన పుస్తకంలో ఈ వర్ణన ఉంది—'ఆకాశంలో పున్నమిచంద్రుడు ఉదయించాడు; సముద్రపునీళ్ళమీద వెన్నెల పడ్డది.' గోవిందం గారు తమ రచనలో ఇలా వ్రాశారు—'పంచమి చంద్రుని వెన్నెల రామస్వామిగారి బట్టతలమీద పడి మిలమిలలాడుతోంది.' ఏమి ఆశ్చర్యకరమైన చౌర్యం! ఏమి అద్భుతమైన వంచన! ఎంత అపూర్వమైన దుస్సాహసం !!!"

సంవాదసారం ఇలా విమర్శించింది: "గోవిందం గారి గ్రంథంలోని రామస్వామి బెజవాడ పట్టణవాస్తవ్యులైన కృష్ణమూర్తిగా రనడంలో ఇసుమంత అయినా సందేహం లేదు. బెజవాడ కృష్ణమూర్తిగారికి బట్టతల లేనిమాట నిజమేకాని ఆయన భ్రాతుష్పుత్రుడికి ఇప్పుడిప్పుడే జుట్టు రాలిపోయి బట్టతల ఏర్పడడం ప్రారంభించిందని మాకు నమ్మకంగా తెలియవచ్చింది. ఈ విధంగా వ్యక్తిగతమైన ఆక్షేపణలు చెయ్యడం పూర్తిగా గర్హితం"

నాకు నిజంగా బుర్ర తిరిగిపోతోంది. నా ప్రహసనం హరిహరపురం మునిసిపాలిటీని విమర్శించడానికి వ్రాసిందేనని సమ్మార్జనీపత్రిక ప్రకటించింది. ఈ అభిప్రాయాన్ని ఖండించడానికి లవలేశమైనా అవకాశం లేదు; ఎందుచేతనంటే, హరిహరపురం ఇరవైనాలుగు పరగణాలలో ఉందో, లేక టిబెట్టులో ఉందో, లేక గుడివాడ తాలూకాలోనే ఉందో కూడా నేను ఎరుగను. అక్కడ ఇప్పుడు మునిసిపాలిటీ ఉన్నదా, ఉండిందా, లేక రాబోతోందా—ఇదీ నేను జోస్యం చెప్పలేను.

ఇక పోతే, నేను బెజవాడ కృష్ణమూర్తిగారిమీద నా గ్రంథంలో అన్యాయమైన పక్షపాతం చూపించానని సంవాదసారం పత్రిక చేసిన ఆరోపణనుకూడా అసత్యమని నేను నిరూపించలేను. ఎందుచేతనంటే, సంవాదసారం తన వాదాన్ని రంధ్రాన్వేషణకు ఎడం ఇవ్వకుండా ప్రమాణాలతో సహా సమర్థించుకున్నది. కృష్ణమూర్తి అన్న పేరుతో ఉన్న వ్యక్తిని ఒక్కణ్ణి మాత్రం నేను ఎరుగుదును. అయితే, ఆయన మూర్తి కాదు, శర్మ. ఆయన ఇల్లు బెజవాడలో లేదు; ఏలూర్లో ఉంది. భ్రాతుష్పుత్రుడి బట్టతల బంగారంగాను! నేను ఎరిగిన కృష్ణశర్మగారి అన్నగారికి కుమారుడే లేడు. అయితే ఆయనచెల్లెలికిమాత్రం ఇద్దరు కూతుళ్లు ఉన్నారు.

ఇక నా గ్రంథంలో బొగ్గుగనుల అసాముల మలీమసచరిత్రను బొగ్గు మసితో పోల్చానని సమీక్షలలో వ్రాసినవారికి నా విజ్ఞాపన ఇది.

అసలు అటువంటి గనులు ఎక్కడైనా ఉండడం సంభవమో కాదో, సంభవమయే పక్షంలో అవి ఎక్కడ ఉన్నవో వారు తెలిపి గనుల విషయమై నా అజ్ఞానాన్ని తొలగించవలసిందని ప్రార్థిస్తున్నాను.

ఎవరు ఏమి అన్నప్పటికీ, ఉప్పు పన్ను, విధవా వివాహం, ఆవునెయ్యి గురించి నేను ఏమీ వ్రాయలేదని ఒట్టువేసి చెప్పగలను.

సైటసంగతి ఇలా ఉండగా ఇటు ఇంట్లోకూడా నాకు రొష్టు తప్పలేదు. ఏదో గంభీరమైన భావాన్ని వెల్లడిస్తున్నవాడిలాగా ప్రహసనంలో ఒకచోట ఇలా వ్రాశాను: "ఈ జగత్తు ఒక పెద్ద పశుశాల" అని.

నేను అనుకున్న దేమంటే, ఇది చదివి పాఠకులందరూ నవ్వుకుంటారు అని. కాని మగ్గురు పాఠకులు మాత్రం నవ్వుకోలేదని ఉత్తరోత్తరా నాకు దాఖలాలు లభించినవి. మొట్టమొదట నా బావమరిది వచ్చి నన్ను తిట్టిపోయడం ప్రారంభించాడు.

"నువ్వు వెయ్యి చెప్పు, లక్ష చెప్పు నువ్వు పశువు అన్నది నన్నే" అని మోరాయించుకు కూర్చున్నాడు.

నేను అన్నాను: "ఒకవేళ నిన్ను నేను అలా అనిఉన్నా తప్పేమీ లేదు. కాని నీమీద ఒట్టు. నిన్ను అనలేదు." అన్నగారు చేసిన అవమానానికి చెల్లెల్ని పుట్టింటికి పంపేస్తానని బావమరిది బెదిరించాడు.

జమీందారు పశుపతిశాస్త్రిగారు నోటి వెంట మాట రాక ఉక్కిరి బిక్కిరై పోయినారు. తనను 'శాలా' (బావమరిది) అని సంబోధించడానికి అవసరమైన అధికారంగాని, చనువుగాని నాకు లేదనీ, నన్ను గురించి పదిమంది ఎదుటా తాను అంటున్న మాటలు కూడా ఏమంత శ్రావ్యమైనవి కావనీ, ఆయనఅన్నాడు.

ఇక, పక్కింటి జగద్బాబు ఒక రోజు న టీ తాగుతూ నా రచన చదువుతున్నాడట. ఉండి ఉండి ఉబికి ఉబికి వస్తున్న నవ్వును ఆపుకోలేక, ఇంకా గుటకవేయని టీని, నములుతున్న రొట్టె ముక్కలను మధ్యమధ్య సైటికి పిచికారిచేస్తూ, 'జగత్తు పశుశాల' అన్న వాక్యందగ్గరికి వచ్చేసరికి, హఠాత్తుగా హాస్యవేగం అంతా ఆగిపోయి ముఖం కందగడ్డయింది. గొంతు కొలమారి ఉక్కిరిబిక్కిరై పోవడంతో డాక్టర్ను పిలిచేటంత పని అయింది. ఊళ్లో ప్రతివాళ్ళ అభిప్రాయమూ ఏమంటే, నా ప్రహసనంలో నేను వారి పరమపూజనీయులైన శ్వశ్రూభ్రాతనో, లేక మామగారినో, లేక అల్లుడినో దృష్టిలో ఉంచుకొనే ఈ వర్ణనలన్నీ చేశాను అని. వాళ్లుకూడా నా తుచ్ఛమైన రచనను ఖగ్నం చెయ్యడమే తమ కర్తవ్యమని ప్రకటించారు.

'నా ఉద్దేశ్యం అది కాదురా బాబూ' అని ఎంత చెప్పినా వారికి నమ్మకం లేదు; కాని నా విషయంలో వారు వెల్లడించిన ఉద్దేశ్యాన్ని మాత్రం నేను శంకించలేకపోయినాను. నిజానికి వారి భావకూడా ఉత్తరోత్తరా చాలా అసందిగ్ధమైన స్వరూపం దాల్చడం ప్రారంభించింది. చిట్టచివరకు నేను తేల్చుకున్న దేమంటే— ఇల్లు మార్పు చేయడం మంచిది అని. ఇంటితోబాటు నేను నా రచనలలో ఉపయోగించే భావనుకూడా మార్చుకోడం చాలా అవసరం అనిపించింది. ఇకమీదట నేను ఏమి చేసినప్పటికి ఇతరులను నవ్వించడానికిమాత్రం ప్రయత్నించను.



విల్సన్ పర్వతముమీది నక్షత్రశాలలోని

# గొప్ప టెలిస్కోపు

= శ్రీ. గొబ్బూరు వెంకటానంద రాఘవరావు =

విజ్ఞాన మనేకశాఖలుగా వృద్ధి పొందుచున్నది. అందు కొన్నిశాఖల శాస్త్రాంశములు మనుష్యుల నద్భుతరసమగ్నులను చేయగలవు. జ్యోతిశ్శాస్త్రవిషయములు మానవుల కాశ్చర్యము కలిగించి యద్భుత మొందించుటేకాక దిగ్భ్రమ నొందింపజేయుచుండును. ఆ శాస్త్రప్రభావము లపారములై ఒక్కొక్కప్పుడు తల కెక్కవు. ఆ గణితములు, ఆ సంఖ్యలు చూచినపుడు బుఱ్ఱ గిర్రున తిరుగును. సామాన్యజనులకు జ్యోతిశ్శాస్త్రవేత్తలు తెలుపు సంఖ్యలును, గణితవివరములును అర్థము కావు. సాధారణముగా అంగుళములు, అడుగులు, మూరలు, గజములు, మైళ్లు, వందలు, వేలు సంఖ్యలు సులభముగా అర్థము కాగలవు. కాని ఈచిలుతకొలతలలో జ్యోతిశ్శాస్త్రాంశములు చక్కగా తెలుపుట సాధ్యము కాదు. సముద్రోదకమంతయు నెన్ని గిద్దలో, ఎన్ని సోలలో ఎంచి చెప్ప నెవరితరము? జ్యోతిర్విషయములను విశదముగా తెలుపుటకు అనుకూలమైన పెద్ద పరిమాణముగల వేరు ఒరవడులను, వేరు మానములను ఉపయోగించుకొనవలసియున్నది.

కొన్నివందల మైళ్లు మన మర్థముచేసికోగలము. చెన్నపట్టణమునుండి విశాఖపట్టణము సుమారు అయిదువందలమైళ్ల దూరమున నున్నది. చెన్నపట్టణమునకు, కలకత్తాకు మధ్యదూరము సుమారు వేయిమైళ్లు. కాబట్టి చెన్నపురికి విశాఖపట్టణముకంటె కలకత్తానగరము రెండురెట్ల దూరమందున్నది. భూమిచుట్టుకొలత ఇరువదియైదువేలమైళ్లు. కనుక చెన్నపురి-కలకత్తానగరముల మధ్య దూరముకంటె భూప్రదక్షిణదూరము ఇరువదియైదురెట్లు ఉండును.

చంద్రుడు సగటున మనకు రెండులక్షల నలుబదివేల మైళ్ల దూరమం దున్నాడు. భూగోళపు చుట్టుకొలత ఒరవడినిపట్టి చూచినపక్షమున చంద్రుడు భూమధ్యరేఖనిడివికి తొమ్మిదిన్నరరెట్లు అధికదూరమున నున్నాడు. భూమి, చంద్రుల మధ్య దూరమును సంగ్రహముగా 'భూ-చం' దూర మనుకొందము. ఈ 'భూ-చం' దూరమునకు మూడువందల యేబదిరెట్లకు పైబడిన దూరమున సూర్యు డున్నాడు. దీనిని 'భూ-సూ' దూర మనుకొందము. 'భూ-సూ' దూరము ౯ కోట్ల ౨౯ లక్షల మైళ్లని నిర్ణయింపబడినది. ఇంత దూర మనగా నెంతో స్ఫుటముగా నవగాహన చేసికొనుటే కష్టము.

భూమిమీద కొలతలు అంగుళముతో ప్రారంభించినట్లే సూర్యగోళమున కావల గంభీరవేగముతో సంచారము చేయు ఖగోళచారుల దూరములు నిర్ణయించుటకు మొదటి మెట్టుగా యీ 'భూ-సూ' దూరమే తీసికోవలసియున్నది. ఏమనగా చుక్కల దూరములు నిర్ణయించుటకు అత్యంతముగా నల్పతమ మన దగిన మానము 'భూ-సూ' దూరమే. ఇందుకు హేతువు నారయుచో, సూర్యకుటుంబమును విడిచి నక్షత్రమండలమున ప్రవేశము భావించుకొనునపుడు, 'భూ-సూ' మధ్యదూరము ఒక్క పదము—మొదటి యడుగుమాత్రముగా గ్రహింపవలసియున్నది. విశ్వమంతయు విశాలదృష్టితో పరికించి చూచినపుడు మన సూర్యుడు సముద్రపుటొడ్డున గల యిసుకరాసులలో నొక యిసుకరేణువువలె గణనకు రాజాలడు. భూగోళముకంటె పదుమూడులక్షల రెట్లు అధికపరిమాణము గలిగి మహాతేజముతో వెలుగొందు సూర్యుడు విశ్వరచనలో నొక మిణుగురుపురుగుమాత్రమైనను కాజాలడు. విశాలవిశ్వ మను మహాసముద్రములో సూర్యకుటుంబ మంతయు చేరి ఒక్క నీటిబొట్టుమాత్రమైనను కాదు.

సూర్యుడు, నక్షత్రములు మొదలగువాని కాంతి ఒక సెకెండు కాలములో నొక లక్షయెనుబదియారు వేల మూడువందల ఇరువదియారు మైళ్లు పోగలదు. సూర్యుని కాంతికిరణములు సూర్యగోళమును విడిచి పైని వ్రాసిన యురవడితో యానము సాగించుచు ఎనిమిది నిమిషములలో భూమిని చేరుకొనుచున్నవి. ఒక సెకెండులో ౧,౮౬, ౩౨౬ మైళ్లు పోగల కాంతికిరణము ఒక నిమిషములో నా సంఖ్యకు అరువదిరెట్ల దూరము పోగలదు. ఈ లబ్ధమును అరువదిచే గుణించగా వచ్చు సంఖ్య గంటలో వెలుగెంత దూరము పోగలదో తెలుపును. ఈ లబ్ధమును ఇరువదినాలుగుచే గుణించగా వచ్చు సంఖ్య దినమునకు వెలుగెంతదూరము గడిచిపోగలదో వ్యక్తముచేయును. ఈ క్రొత్త లబ్ధమును మున్నూట అరువదియైదును పావుచే గుణించగా వచ్చు సంఖ్య వెలుగు ఒక సంవత్సరములో ఎంతదూరము పోవునో స్పష్టముచేయును. ఈ సంఖ్య గల మైళ్ల దూరమునే 'వెలుగు-వత్సరము' (Light year) అందురు. ఈసంఖ్య సుమారు ౫,౮౮౦,౦౦౦,౦౦౦,౦౦౦ మైళ్లు. అనగా ఐదులక్షల, ఎనభయియెనిమిదివేలకోట్ల మైళ్లు. మన కతిసమీపమున నున్న దనుకొనుచున్న చుక్క వెలుగు మనకు చేరుసరికి ౪⅓సం— నాలుగుసంవత్సరముల ఎనిమిదిమాసములు పట్టుచున్నది. అనగా ఒక వెలుగు-వత్సరదూరమును ౪⅓చే గుణించగా వచ్చు లబ్ధము మైళ్లు మన కతిసన్నిహితమై మన పొరుగున నున్న చుక్క దూరమును తెలుపును. యంత్రసాయము లేక మనకన్నులకు సామాన్యముగా కనబడు ఖగోళదృశ్యములలో నత్యంతదూరమున చిన్న విభూతిబొట్టువలె ధవళధవళమై తోచు నొక్క తెలిమబ్బు వెలుగు మనకు చేరుసరికి తొమ్మిదిలక్షల వెలుగు-వత్సరములు పట్టు నని శాస్త్రవేత్తలు గుణించిరి. ఈ తెలిమబ్బు ఉత్తరభాద్రపద కుత్తరముగా నున్న ఇంద్రమదగణమునకు (Andromeda) చేరిన చుక్కల మధ్య కానవచ్చును.

'నభోరమావక్షోజహారలతిక'యని మన కవులు ప్రశంసించిన వియద్గంగను, పాలమున్నీటి ని పడమటివారు పాలపుంత (Milky way)యందురు. ఆ ధవళదృశ్యములో కోటానకోటులు నక్షత్రము లున్నవి. మన సూర్యు డా పుంతలో చేరిన యొక చిన్న చుక్క. ఆ చుక్కలు మనసూర్యునివలెనే తేజోమయములైన గొప్ప గోళములు. పాలపుంతమధ్యమునకు ఐదుకోట్ల వెలుగు-వత్సరముల దూరములో మన సూర్యు డున్నాడని పరిశోధకులు అంచనావేయుచున్నారు. తెలిమబ్బులు కొన్ని ఎనిమిదికోట్ల వెలుగు-వత్సరముల దూరములో నున్నవట! ఈవిషయమును లోకమునకు మొదట తెలిపిన వారు అమెరికాఖండములోని కాలిఫోర్నియా మండలమున నున్న విల్సన్ పర్వతముపై ప్రతిష్ఠింపబడిన గొప్ప టెలిస్కోప్ ద్వారా పరిశోధనలు చేసినఖగోళవేత్తలు. ప్రపంచములో నిప్పటికి గల టెలిస్కోపు లన్నింటిలో పెద్దది విల్సన్ పర్వతస్థమైన యీ టెలిస్కోపే. ఈ దూరదర్శిని కమర్చబడిన యద్దముయొక్క వ్యాసము నూరు అంగుళములు = ఎనిమిది అడుగుల నాలుగు అంగుళములు = సుమారు నిలివెడున్నర నిడివి. పదమూడు అంగుళములు మందము. ఆ యద్దము తొమ్మిదివేల పౌనుల భారము గలది—అనగా మూడువేల వీసెలు = ౩౭౫ మణుగులు తూగును. పగటివేళ వేడి తగలకుండ చన్నీళ్లలో దానిని భద్రపరుతురు.

సర్ విలియమ్ హెర్షెల్ దొరగారు ౧౭౮౯ సంవత్సరములో నాలుగడుగులు=నలుబది యెనిమిది అంగుళముల వ్యాసము గల అద్దములో ప్రతిబింబమును చూపు యంత్రమును ఇంగ్లండులో ప్రతిష్ఠించిరి. ౧౮౪౫ లో రోసే (Rosse) ప్రభువు డెబ్బదిరెండంగుళముల వ్యాసముగల అద్దముతో ఒక దూరదర్శినిని ఐర్లండులో నెలకొల్పెను. అలాగుననే క్రమముగా పెద్దపెద్ద అద్దములతో ఒకదానికంటె శక్తివంతమైన మరొక దూరదర్శినియంత్రములు నిర్మింపబడుచున్నవి. ౧౯౧౪ లో మొదటి ప్రపంచయుద్ధమునకు ముందు ౭౨ అంగుళముల వ్యాసమును, ౨ టన్నుల బరువును కలిగిన అద్దము బెల్జియములో పోతపోయించి బ్రిటిష్ కొలంబియాకు పంపిరి. కెనడా ప్రభుత్వమున కీ యద్దమందిన మూడుదినములలో జర్మనులు ౧౯౧౪ సంవత్సరములో బెల్జియములో ప్రవేశించిరి. ఈయద్దము జర్మనుల చేతిలో పడియుండినయెడల విజ్ఞానాభివృద్ధికి చాల నష్టము కలిగియుండెడిది.

దీనితరువాత చెప్పదగినది విల్సన్ పర్వతమున ప్రతిష్ఠింపబడిన నూరంగుళముల దర్పణసహితమైన దూరదర్శిని. ఈదర్పణమునకు గాజుపోత ఫ్రాన్సుదేశములో ౧౯౧౭ కు ముందే పూర్తియయ్యెను. కాని మొదటి ప్రపంచయుద్ధము పూర్తియైన మూడేండ్లకు ౧౯౨౧ సంవత్సరమునకుగాని యంత్రప్రతిష్ఠ పూర్తి కాలేదు. ఈ యంత్రమెంత పెద్దదో తెలుపుటకు ఈ క్రింది వివరము లవసరము. ఈయంత్రమును మీదికి, క్రిందికి, ప్రక్కలకు కదిలించుటకు వీలైన యంత్రభాగములు ౧౮౦ టన్నుల బరువు తూగును. యంత్రమంతయు నూరుటన్నుల బరువున్నది. మీది 'డోము' అనబడు కప్పును, క్రింది యంత్రమును నలుబదిమోటారు యంత్రముల సాహాయ్యమున కదల్చుచుందురు. ఈ మోటారులు విద్యుత్ప్రవాహపు బలముచేత పనిచేయుచుండును. నీటిమీద తేలుచున్న పడవను ఇష్టము వచ్చినట్లు నడపుకొనునట్లు పాదరసపు చెరువులో నీ మహత్తరయంత్రమును తేల్చియుంచి, ఖగోళమున నేప్రాంతమునకైన నున్న ఏ యే ఖగోళచారులనైనను చూచుటకు వీలగునట్లు యంత్రమును త్రిప్పుచు నడుపుకొనుచుందురు. ఇందలి యద్దమునకు పేసిన కళాయి ఆరు మాసములకంటె ఎక్కువ నిలవయుండదు. కాబట్టి ఆరు నెలల కొకమారు తప్పకుండ క్రొత్త కళాయి పూతపెట్టుదురు. ఈ యద్దము తయారగుటకు పూర్వము, ఏడు సారులు పేర్వేరుగా గాజు కరిగించి, ఎనిమిది పోతలు పోసి, అవి యన్నియు చెడిపోగా తొమ్మిదవ సారి పోతపోసి యీ అద్దము తయారు చేసినట్లు పోతపనివాండ్రు తెలిపిరి. ఇంతకంటె పెద్దయద్దము పోత పోయుట మనుష్యమాత్రులకు సాధ్యము కాదని ఆ గాజుపోతపనివాండ్రు తెలిపిరి.

ఏ యంత్రసాయము లేకుండ మామూలుగా మన కనులతో మాత్రము చూచునపుడు మన కనుల జొచ్చు వెలుగుకంటె విల్సన్ టెలిస్కోపు రెండులక్షల ఏబది వేల రెట్లు ఎక్కువ వెలుగును ఖగోళమునుండి ఆకర్షించి తన వంక త్రిప్పుకొని తనపై ప్రసరించునట్లు చేసికొనగలదు. నలుబదియైదు కోట్ల వెలుగు-సంవత్సరముల దూరమును భేదించి విశాలవిశ్వమున చొచ్చుకొనిపోగల శక్తి యీ యంత్రమునకు గలదు. ఆ దూరమునుండి కాంతి కిరణములను మరల్చి పట్టి పరిశోధకులకు చూపగలదు. నూటయేబదికోట్ల ఖగోళచారులను ఫొటోగ్రాపు చేయుటకు ఈ టెలిస్కోపు సావకాశము లమర్చిపెట్టినది.

మన భూమిమీద నిలబడి చూచినపుడు ఒక ప్రాంతమున కనబడు చుక్కలు మరొక ప్రాంతమున కానరావు. ఉత్తరధ్రువప్రాంతములవారికి దక్షిణదేశములలో కనబడు చుక్కలు తమామూ కనబడవు. దక్షిణదేశములవారికి ఉత్తరాకాశపు చుక్కలు కనబడవు. ఒకవేళపుడు కనబడిన చుక్కలు మరొకవేళ కనబడవు. ఎక్కడనైనను, ఒకప్పుడు సుమారు రెండు వేల చుక్కలు లెక్కింపవచ్చును. భూగోళమంతటను అన్ని వేళలను పట్టి పరికించిచూడగా యంత్రసాయము లేక మనకు కనబడు చుక్కలమొత్తము పది వేలకు మించదు. చిన్న టెలిస్కోపులో చూచినపుడు మొత్తముమీద ముప్పదిమూడువేల మూడువందల నలుబదిరెండుచుక్కలు కనబడునని శాస్త్రవేత్తలు లెక్కించిరి. ఈ చుక్కలే దేవతలట. ఏమనగా, దేవశబ్దమునకు ప్రకాశించునది యని యర్థము. ఖగోళమున మెఱయు నక్షత్రములనే మనవారు దేవతలనిరి. "నక్షత్రాణి రూపమ్" అని శ్రుతి తెలుపుచునేయున్నది. ఒక పెద్ద టెలిస్కోపులో కనబడు చుక్కలను మొత్తముమీద లెక్కించియే మన పూర్వులు దేవతల సంఖ్య ముప్పదిమూడుకోట్లని నిర్ధరించినట్లు నాకు కనబడుచున్నది. పట్టి కనులతో చూచినదానికిని, విల్సన్ టెలిస్కోపులో చూచినదానికిని ఎంత భేదము కలదో రవంత గ్రహించుటకు పైసంఖ్యలతో వివరములు వ్రాయబడినవి.

అయితే విల్సన్ టెలిస్కోపుతో మానవుని ఖగోళవిజ్ఞానతృష్ణ తృప్తియైనదా? దానితో నాగి నిలిచినదా? ఇంకను శక్తివంతమైన యంత్రమును కాంక్షించుచున్నదా? అంతే తృప్తి కాలేదని, అంతకు రెండురెట్ల వ్యాసము గల పెద్ద యద్దము నమర్చిన మహత్తరదూరదర్శినితో పరిశోధన ద్విగుణీకృతోత్సాహముతో సాగించవలయు ననియే వైజ్ఞానికులు నిశ్చయించిరి. విల్సన్ టెలిస్కోపు తెలిమబ్బు

లను కొంతదూరమువరకే వెంటాడగలిగినది. అటుపైని శక్తి చాలక విరమించుకొనినది. మన క్షీరోదము (Milky way) చే పరివృతమైన ఖగోళము మనము విశ్వ మనుకొనుచున్నాము. కాని ఒక్కొక్క తెలి మబ్బు (Nebula) ఈ క్షీరోదావృతమైన మన విశ్వమునకు తీసిపోదు—ఏ విషయమునందును తీసి పోదు. ఇట్టి తెలిమబ్బు లొక్క యిరువది లక్షలకు పైగా లెక్కింపబడినవి. ఈ తెలిమబ్బులు సెకండునకు ఇరువది వేల మైళ్ల త్వరతో మనలను, మన విశ్వమును విడిచి ఎందేని దూరముగా పోవుచున్నవి. ఇటువంటి ఉపపత్తులను పట్టుకొని విశ్వము పెరిగి పెద్దదగుచున్నదనియు, ఇది Expanding Universe అనియు ఖగోళ పరిశోధకులు కొంద రభిప్రాయపడుచున్నారు. సబ్బు బుడగ మొదట చిన్నదైనను క్రమముగా పెరిగి పెద్దది కాగలిగినట్లే, వామనుడు త్రివిక్రమ స్ఫురణచే బ్రహ్మాండము నాక్రమించినట్లే, విశ్వము పెరిగి పోవుచున్నదని శాస్త్రవేత్త లభిప్రాయ పడుచున్నారు. అవునా ! కాదా ! ఏది యెట్లున్నది ? అని స్పష్ట పరుచుకొనవలసిన ఇట్టి యంశములు వేలకొలది ఉన్నవి. విల్సన్ టెలిస్కోపుకంటె శక్తివంతమైన టెలిస్కోపువలన కాని ఆ సంశయములు తీరవు. కాబట్టి, రెండు వందల అంగుళముల వ్యాసము గల గొప్ప యద్దముతో కూడిన మహత్తర దూరదర్శినిని నిర్మించుటకై వైజ్ఞానికులు నిశ్చయించిరి.

కాని యిందుకు డబ్బో ! "ధనమూల మిదం జగత్" కదా ! దృఢసంకల్పము ఉన్నప్పుడు డబ్బు లేమి అడ్డురాదు. ధనలోపము ఉండదు.

అమెరికాలో బహు కోటీశ్వరుడు రాక్‌ఫెల్లర్ ప్రతిష్ఠచేసిన ధర్మనిధు లున్నవి. ఆ నిధిద్రవ్యములను ఖర్చుపెట్టువారు అంతర్జాతీయ విద్యాసమితి వారు. ఆ సమితివారు "ధనలోపమున ఈ ప్రయత్న మాగ నక్కరలేదు. ఈ నిధిద్రవ్య మిచ్చెదము; పనికానిండు" అని అభయమిచ్చిరి.

ఇంకేమి ! అమెరికా, ఇంగ్లండు, జర్మనీదేశముల జ్యోతిశ్శాస్త్రవేత్తల సంఘమువారు చాల కాలము సంప్రతించి, తయారుకావలసిన క్రొత్త టెలిస్కోపునకు అమర్చవలసిన అద్దము విల్సన్ పర్వతము మీది యంత్రపు దర్పణముకంటె రెండురెట్లు పొడుగైన వ్యాసమును, నాలుగురెట్లు బరువునుకలది కావలెనని నిశ్చయించిరి. అనగా రెండువందల అంగుళముల వ్యాసము=పదునారడుగుల ఎనిమిదిఅంగుళముల వ్యాసమును, పదిహేనువందల మణుగుల భారమును గలది కావలయును. ఇందుకు పన్నెండులక్షల సవరనులు మంజూరుచేయబడెను. అనగా ఇప్పటి మారకపురేటునుబట్టి ఎనిమిది కోట్ల నలభయిలక్షల రూపాయి లన్నమాట. ఇటువంటి అద్దము పోతపోయుట యనగా మాటలతోనున్నదా ? పోతపోసిన తరువాత అద్దము ఎంత కాలమైనను చెడిపోక నిలిచే గట్టితనము కలిగియుండవలెను. కాని అతిభారము కలది కాకూడదు; పెళుసుగా నుండరాదు; వేడి తగిలినపుడు లోహజాతుల విధమున ఎక్కువ విస్తరింపకూడదు. శీతోష్ణప్రసారమునకు లొంగి సంకోచవ్యాకోచముల కధికముగా పాల్పడకూడదు. హెచ్చుచు తగ్గుచుండెనేని కొక్కిరిబిక్కిరి రూపము వచ్చి అద్దము చెడును. కనుక ఎప్పటికప్పుడే తగిలిన వేడిని పరిసరమున కందిచ్చుచు పైకివదిలివేయు స్వభావముకలది కావలెను. అన్నిరంగుల వెలుగుకిరణములను చక్కగా ప్రతిబింబింపజేయు శక్తి గలిగియుండవలెను. సున్నితములు సూక్ష్మములు ఐన వివరములనుకూడ చెడకుండ చక్కగా చూపవలెను; కగ్గక, నిగ్గు చెడక, సున్నగ మెఱుగుదేరి స్ఫుటముగా ప్రతిబింబము చూపునట్టిది కావలెను. ఈ లక్షణము లన్నియు పూర్ణముగా గల గాజు అద్దము తయారుచేయుట సాధ్యము కాదు. కాని చాలవరకీ లక్షణములు గల యద్దము తయారుచేయుటకు వెలిగారమను ఒకజాతియుప్పును కొన్ని పాళ్ళలో కలిపి జాగ్రతగా పోతపోయవలె నని అనుభవమువలన తెలియవచ్చినది. ముందు ముప్పది అంగుళముల వ్యాసముగల అద్దమును, తరువాత అరువది అంగుళముల వ్యాసముగల అద్దమును, అటుపిమ్మట నూటఇరువది అంగుళముల వ్యాసపు టద్దమును పోతలుపోసి చూచిన పిమ్మట రెండేళ్లనాటికిగాని అసలు తలపెట్టిన పెద్ద యద్దపు పూతకు సన్నాహములు చేయుట సాధ్యముకాక పోయెను. ఈ పోతగాజును పైరెక్స్ (Pyrex) గాజు

అందురు. పోతకు ముందు గాజు కరిగించుటకు ముప్పది యడుగుల వ్యాసముగల రాకాశికొలిమిని పదిరోజు లహర్నిశలు జ్వాలలెగయగాల్చిరి. నలుబదిటన్నుల గాజు పదార్థ మిందులో సుమారు మూడువేల డిగ్రీలు (ఫారెన్‌హీటులెక్కను) వేడెక్కుటకు మూడువారములు ఉంచిరి. ఈ వేడిమి ఏమాత్రము తగ్గకుండ ఇరువదియొక్క రోజు కొలిమిలో కాగి ద్రవపదార్థమై యున్నంతరువాత ౧౯౩౪ వ సంవత్సరము మార్చినెల ౨౫ తేదీని పోత ప్రారంభించిరి. ఈ విచిత్రము చూచుటకు బహుదేశములవారు విజ్ఞానవేత్తలు వేలకొలది మైళ్ళు ప్రయాణము చేసి వ్యయప్రయాసముల కోర్చి ఆనాటి కచ్చటికి హాజరైరి. కొలిమికంటెను ఉష్ణోగ్రత కల ఇటుకమూసలో నీ కరిగిన గాజుద్రవమును తడవ కొక పుట్టెడుచొప్పున, కుంభకర్ణుడు తెరచిన నోటివలె నున్న రాకాశిగరిటెతో ఉపాయముతో తీసి మూసలో వేయుచుండిరి. ఐదేసి నిమిషములకును, ఒకప్పుడు పదేసి నిమిషములకును కరిగిన గాజును ఆ గరిటెతో మూసలో పోయుచు రాగారాగా తుదకు మూస నిండుటకు పదిగంటల కాలము పట్టెను. ఆరంభములోనే ఈ దారుణపుకాకకు నిలబడలేక మూసలోని నాలుగిటుకలు పట్టుదప్పి, మూసలోని గాజు ద్రవపు టుపరిభాగమున తెప్పున తేలిపోయెను, పనివాండ్రా యిటుకలను తీసివైచిరి. ఈ మహాయత్నమంతయు వృథయగునేమోయని ఎల్లవారును భయపడిరి. ఆ తరువాత సగటున దినమునకు ౧.౪ డిగ్రీల చొప్పున మూసలోపలి వేడిమిని తగ్గించుకొనుచు మెల్లగా చల్లారనిచ్చిరి. అక్టోబరు మాసాంతమునకు, అనగా ప్రారంభించి పోతపోసిన ఏడు నెలలకు ఉపరిభాగమున నొక మనుష్యుడు నిలిచి తాళగల వేడిమికి గాజు అద్దము చల్లారెను. అద్దములోపల పగుళ్ళు, బీటలు, గాలి బుడగలు ఏవైనా చేరి అద్దము చెడునేమో, ఎందుకైన మంచిది అని మరొక అద్దము పోతపోయుటకు కూడ యజమాను లాజ్ఞ యిచ్చిరి. పదకొండు మాసములకుగాని పైకి తీయుటకు వీలుగాని యీ పోతగాజును ఏడుమాసములకే వెడలించిన గాని రెండవ అద్దపుపోతకు వీలులేక పోయెను.

౧౯౩౫ సంవత్సరపు వేసవిలో రెండవయద్దము చల్లారుచుండగా వరదల భయము కలిగెను. కాని ప్రమాదము తప్పెను. ౧౯౩౬ లో మొదటి యద్దమును నునుపు చేయ ప్రారంభించిరి. అది మూడేండ్లు పట్టిన పని. ఇంతలో రెండవ ప్రపంచమహాయుద్ధము ఆరంభమయినది. అందువల్ల టెలిస్కోపుపని ఆగినది.

అద్దము మెఱుగుదేరి పరిశోధన ప్రారంభించుటకు ఇంకను చాల పనులు కావలసియున్నవి.

ఈ యద్దముతో కూడిన మహత్తర దూరదర్శినిని అమెరికాఖండములోనున్న పలోమర్ పర్వతసానువుపై ప్రతిష్ఠింతురు. దీనిని ఆ కొండమీదకు తీసికొని వెళ్ళుటకు ప్రత్యేకముగా ఇరువది మైళ్ళ రోడ్డు వేయబడినది. ఈ యద్దము నమర్చవలసిన టెలిస్కోపు గొట్టము ౪౦ అడుగులపొడుగును, ౨౦ అడుగుల వ్యాసమును కలిగియుండును. యంత్రము వాడుక చేయుటకు సాధనములతో సహా గొట్టము, అద్దము అన్నియు కలిపి ౫౦౦ టన్నుల బరువుండును—అనగా పూటుగా సామానులతో నిండిన నలుబదివేగనులు గల గూడ్సుబండియంత బరువన్నమాట!

దీనిని ప్రతిష్ఠింపనెంచిన పలోమర్ కొండ ఐదువేల ఏడువందల అడుగుల యెత్తు గలిగియున్నది. ఐదు సంవత్సరములు పరిశీలన చేసిచేసి ఈ యంత్రరాజమును ఈ పర్వతముపై ప్రతిష్ఠింప నిశ్చయించుటకు కారణమున్నది. పసుపువన్నె మీద మెఱుపురంగువలె నలుపు మీద తెలుపు ఎక్కువగా శోభించును. అమెరికాలో ఇతర ప్రదేశములలోకంటె ఈ పర్వతసీమపై నున్న ఆకాశరంగము శ్యామలతరమై ఖగోళపరిశీలనకు మిక్కిలి అనుకూలముగా నుండునని నక్షత్రవేత్త లీకొండమీద నీ మహాద్భుతయంత్రమును నిలుప నిశ్చయించిరి. ఈ యంత్రము యథావిధిగ ప్రతిష్ఠించిననాడు జ్యోతిశ్శాస్త్రవిజ్ఞానము ఉరకలువేయుచు నభివృద్ధి నొందగలదు.

ఏమనగా :—

౧. ఈనాడు పరిశోధకులు మెడలు నొప్పులెత్తునట్లు చుక్కలకొఱకు మీదికి చూచుట అనవసరము. పుస్తకము చదువునట్లు దృశ్యప్రతిబింబమును చూచుచు ఖగోళమును పరిశీలింపగలరు. ఇపు డదికూడ అనావశ్యకము. ఫొటోగ్రఫీ (తేజఃపట నిర్మాణము)

మూలముగా పరిశీలన మతిసుళువుగ జరుగుచున్నది. ఈ క్రొత్త టెలిస్కోపునందలి ఉబ్బెత్తుగాజు లెన్సు బహుశక్తివంతమైనది. ఇంతకు ముందు యంత్రములు మూడు సెకెండ్లు వెలుగందుకొనినగాని తీయలేని ఫొటోగ్రాఫులు ఈ యంత్రము ఒక సెకెండులోనే తీయగలదు. అనగా ఇదివరకున్న వాటికంటె ఈ యంత్రము మూడు రెట్లు ఎక్కువ శక్తివంతమైన దన్నమాట.

౨. మానవనేత్రముకంటె ఈ యంత్రము పది లక్షల రెట్లు పరిమాణముగల వెలుగును పట్టి వశీకరించుకొని తనవంకకు మరల్చుకోగలదు. విల్సన్ కొండపై టెలిస్కోపుకు నడుపు డైరెక్టర్ హాబల్ పండితుడు (Docter Hubble) ఈ విషయమై ఇట్లు తెలిపెను: "ఈ క్రొత్త యంత్రము పదివేల మైళ్ళ దూరమున వెలుగు కొవ్వొత్తిదీపపు కాంతిని పొదివిపట్టి స్ఫుటముగా చూపగలదు."

3. ఇంతకుముందు పదిహేనులక్షల నక్షత్రములను గురించి మాత్రము తెలిసికోనైనది. అంతకంటె ఎక్కువగా చుక్కల సంగతులు తెల్లము చేయుటకు ప్రాత యంత్రములకు వశ చాలకుండెను. ఇప్పు డంతకు నాలుగు రెట్లు—అనగా అరువదిలక్షల—చుక్కల వివరములు దీనివలన తెలియగలవు.

౪. మానవనేత్రము మైలుదూరములో కనబడు మేడ ఒక అంతస్తు కలదో, రెండు అంతస్తులు కలదో పరిశీలించి చెప్పగలదు. ఈయంత్రము మూడువేల మైళ్ళ దూరములోనున్న మేడ ఎన్ని యంతస్తులదో స్ఫుటముగా చూపగలదు.

౫. చంద్రమండలములో నూరు గజముల వ్యాసము గల పదార్థమును మాత్రము విల్సన్ కొండ మీది టెలిస్కోపు చూపగలదు. ఈ క్రొత్త యంత్రము ఆ మండలముమీది పది గజముల వ్యాసము గల పదార్థములను గూడ చక్కగా చూపగలదు. మనకు రెండు లక్షల నలుబదివేల మైళ్ల దూరమందున్న చంద్రమండలము ఎనుబది మైళ్ళ దూరములో మాత్ర ముండిన నెట్లు కనబడునో ఆ దృశ్యమును ఆ వివరములతో చూపగలదు.

౬. అంగారకగ్రహముమీద మన గోదావరి, కృష్ణ నీటి కాలువలవంటి కాలువ లున్నవనియు, ఆ గ్రహోపరిభాగమున మనవంటి మనుష్యులు జీవించుచున్నారనియు కొందరు జ్యోతిశ్శాస్త్రవేత్త లనుచున్నారు. అదేమియు లేదని మరికొందరు చెప్పుచున్నారు. ఈ క్రొత్త యంత్రము ఆ తగవు తీర్చి ఉన్నది ఉన్నట్లు చూపుచు నిజము బైటపెట్టగల దని లోకు లాశించుచున్నారు.

౭. "ఇతర గోళములపై నరసంచార మున్నదో లేదో దీనితో పరిశోధించి తేల్చి చెప్పవచ్చును" అనుచున్నారు డాక్టరు స్పెన్సరు జోన్సుగారు. వీరిప్పుడు ఆంగ్లరాజ్యస్థానజ్యోతిశ్శాస్త్రవేత్తగా పనిచేయుచున్నారు.

౮. గ్రహరాజు, సూర్య కుటుంబాధిపతి సూర్యుడు క్షీణించి క్షీణించి క్రమముగా అరి నశించి పోవునని జోన్సు మొదలగు జ్యోతిర్విద్యావిదు లభిప్రాయపడిరి. భూమిమీది సమస్తప్రాణులకు వేడి, వెలుగు, అన్నము, ఆహారము సమకూర్చు సూర్యుడు లేనినాడు భూమి లేదు. మానవజాతి ఉండదు. సూర్య గోళమును గూర్చిన వివరములు—ఇదివరకు తెలియనివి—క్రొత్త సంగతు లెన్నో తెలిసికోవచ్చును.

౯. ముఖ్యముగా క్షీరోదపరివృతమైన మన విశ్వమునుండి సెకెండునకు ఇరువదివేల మైళ్ళ త్వరతో దూరముగాపోవుచున్న తెలిమబ్బులనుగూర్చి క్రొత్త వివరములు తెలిసికోగలము. ఏమనగా, విల్సన్ కొండమీది టెలిస్కోపు ఎనిమిదికోట్ల వెలుగువత్సరముల దూరమున నున్న ఖగోళచారులైన తెలిమబ్బుల వెలుగునుమాత్రము పట్టి చూపుచున్నది. ఈక్రొత్త టెలిస్కోపు ఎనుబది కోట్ల వెలుగువత్సరములదూరముననున్న తెలిమబ్బులను చొచ్చుకొనిపోయి ఆలోపుననున్న తెలిమబ్బుల వివరములను మనకు బాగుగా తెలుపగలదు. మనకు తెలిసిన విశ్వమునకంటె పదిరెట్లు ఎక్కువ కనపరుచును.

౧౦. ఖగోళచారులైన నక్షత్రములు, గ్రహములు, ఉపగ్రహములు లోనగువానినుండి వెడలు వెలుగు శక్తిని ఈ సాధనమువలన ఉపాయముగా పట్టి మనకు కావలసిన పనులు చమత్కారముగా నిర్వహించుకొని వినోదింపవచ్చును. ఈ వాక్యార్థము చక్కగా బోధ

పడుటకు ఇదివరకు జరిగిన రెండు విశేషములు ఈ క్రింద వ్రాయుచున్నాను—

(అ) ౧౯౩౩లో షికాగోనగరమున ప్రపంచ వస్తుప్రదర్శనము జరిగెను. ఆ మహోత్సవప్రారంభకు లెవ్వరో తెలుసునా ?

హనుమంతుడు !

౧౮౯౩ సంవత్సరములో షికాగో (Chicago) నగరమునందు ప్రపంచమునందు గల సమస్తమతములవారు తమతమ మతవిశేషము లెట్టివో వివరించి తెలుపుకొనుటకు Parliament of Religions అను బహు ప్రపంచమతమహాసభ జరిగెను. అపుడే స్వామి వివేకానంద అమెరికా వెళ్ళి ఆ మహాసభలో హిందూ మతాధిక్యమునుగూర్చి ఉపన్యసించెను. నాటినుండి పశ్చిమ ఖండములవారికి తూర్పున హిందూదేశపు మత సంస్కృతులనుగూర్చి తెలిసికొనవలెనను ఉత్సాహము జనించి దినదినప్రవర్ధమాన మగుచున్నది.

ఆనాడు ౧౮౯౩లో స్వాతినక్షత్రమునుండి బయలుదేరిన వెలుగు సెకండుకు లక్షయెనుబదియారు వేల మూడువందల ఇరువదియారు వేల మైళ్ళచొప్పున వెక్కడను ఆగక ఏకారీతిని ప్రయాణము సాగించి సాగించి నలుబదియేండ్లనాటికి భూమండలము చేరుకొనినది. అనగా ౧౯౩౩ సంవత్సరమునాటికి భూమండలము చేరుకొన్నది.

౧౯౩౩లో ఆ షికాగో నగరములోనే ప్రపంచ వస్తుప్రదర్శనోత్సవము జరిగినది. ఆ యుత్సవము ప్రారంభించుటకు స్వాతినక్షత్రమునుండి వచ్చు వెలుగును యెర్కు నక్షత్రశాలలో (Yerkes Observatory) పట్టి ఆ వెలుగును విద్యుచ్ఛక్తిలోనికి మార్చుగల సాధనము (Photo-electric Cell)మీద కేంద్రీకరింప జేసిరి. స్వాతివెలుగుకిరణముల స్పర్శ తగిలినంతనే విద్యుత్సాధనములోని విద్యుత్కణములు కొన్ని (Electrons) పైకి నెట్టివేయబడినవి. ఈ విద్యుచ్ఛక్తి అక్కడికి ౮౦ మైళ్ళ దూరమునందున్న షికాగోనగరమున కంపబడెను. ప్రదర్శనప్రారంభమునకు సిద్ధముగానున్న దీపములను వెలిగించుటకు స్విచ్ సాధనపు బొత్తామును నొక్కినది విద్యుచ్ఛక్తిగా మారిన స్వాతివెలుగే! బొత్తాము నొక్కుసరికి ప్రదర్శనపు విద్యుద్దీపము లన్నియు గప్పున నొక్కమారు వెలిగి ప్రదర్శనమును తెరచి చూపినవి!

స్వాతి వాయుదైవత్య మని మన వేదము ఘోషించుచున్నది! హనుమంతుడు వాయు అంశ సంభూతుడు. ప్రదర్శనప్రియుడు! లంకను కాల్చి అర్ధరాత్రి ఎఱ్ఱని వెలుగుతో లోకమునకు ప్రదర్శించినాడు!

(ఆ) చంద్రకాంతి ఇటలీనుండి అమెరికా వెళ్ళి షికాగోసభ తెరచుట—

మరి ఆరు నెలలకు—౧౯౩౩ అక్టోబరు నెలలో మరొక విచిత్ర విశేష మిట్టిదే జరిపించిరి. పాశ్చాత్య వైజ్ఞానికులలో మొదట టెలిస్కోపును నిర్మించిన వాడు గెలీలియో మహాశయుడు. ఇప్పటికి మూడు వందల ముప్పది యేండ్ల క్రిందట ౧౬౧౦ లో ఇటలీలో ఫ్లోరెన్సు నగరములో గెలీలియో నిర్మించిన టెలిస్కోపులోనికి చంద్రకిరణములను జొనిపి, విద్యుత్సాధనములచే నా కిరణశక్తిని శబ్దశక్తిగా మార్చి, హ్రస్వ తరంగమూలముగా ఫ్లోరెన్సు(Florence)నుండి రోమున కంపిరి. రోమునగరమునుండి నిస్తంత్రీమార్గమున అమెరికా తీరమున నున్న Rocky Point కు అందజేసిరి. అటనుండి యా కిరణశక్తి షికాగోసభ కందజేసి స్విచ్చిబొత్తము నొక్కించి సభాప్రారంభము చేసిరి. చంద్రమండలము విడలిన కిరణము ఈ తికమకలుబడి ఫ్లోరెన్సుమీదుగా షికాగో చేరుసరికి ౨౫/౧౦ సెకండ్లు మాత్రము పట్టినది.

పలోమర్ పర్వతసానువున ప్రతిష్ఠించిన పిదప రెండువందల అంగుళముల వ్యాసము గల దర్పణముతో కూడిన గొప్ప టెలిస్కోపు మూలముగా ఖగోళచారుల శక్తిసామర్థ్యము లింక నెన్నెన్ని చిత్రవిచిత్రములు ప్రదర్శింపగలవో !

ఇంగ్లండుదేశపు వాతావరణపరిస్థితులనుబట్టి ౩౬ అంగుళముల వ్యాసము గల ప్రతిబింబదర్పణము కంటె శక్తివంతమైన యంత్రము అచ్చట పనికిరాదు. ఇట్టి మహత్తరసాధనములతో మన దేశమున నెంతటి శక్తివంతమైన యంత్రమునైనను ప్రతిష్ఠింపవచ్చునుగాని— అధోదృష్టియేగాని ఊర్ధ్వదృష్టి యంతగా లేని మన దేశపు ప్రస్తుతపరిస్థితులలో నిట్టి యంత్రస్థాపనకు ఎన్నో దశాబ్దములు, కాదు—శతాబ్దములు గడువవలెనేమో!

# అభయం

— శ్రీ సుందరాచారి —

ఎవతె నిను గన్న తల్లిరా! ఎన్ని నెలలు
నిన్ను కడుపున మోసెరా! నిజముగాను
నిండు నవమాసముల కాన్పు నీవు కాదు-
మధ్యకలిగిన పెనుభూత మగుదువేమొ!

కాకపోయిన, నీకర్మ కాలిపోను-
ఇట్టి బలి కోరుకొందువా!- ఏడ్చిఏడ్చి
ఎన్ని గుండెలు వ్రీలెరా!- ఇంత కసికి
ఏమి కారణ ముండెరా! రామ! రామ!

ఏళ్లుమీరిన ముసలాడు; నీళ్లు తాగి
పస్తుకాలిచిన అస్తుల పంజరంబు;
పేదలకు పేద; తిరిపాల బిచ్చగాడు;
మాలలకు మాల; మా గాంధిజోలి యేల?

ఉక్కుగుండియరా నీది; చిక్కనైన
పచ్చిగరళంబు మింగిన పాడుగుండె;
సిరులు దొరలించు చిరునవ్వు దొరను దరిసి
కరుణ విరియని కాల్పులు కాల్చినావు!

దొరల పరువులు విరిచిన చిరుతనవ్వు;
పగకు ప్రేమలు నేర్పిన పసిడినవ్వు;
పుడమి లోగొని యేలిన బోసినవ్వు —
ముగిసెనా మాకు; పెదవులు మూసినావు!

పిల్లగాలుల సోకుకే తల్లడిల్లు
పెళుసుబొందియ కేలరా, పిడుగుపోట్లు?
'వలదు నీ వింక, మా' కన్న, వలచి, 'నన్ను
చంపిపో' మ్మను సాధువు, చంపినావె!

బెదరు నీ కేల, హంతకా! వెన్నపూస
మనసు కలవాడు మా రేడు, మంచివాడు;
రామనామము పలికె, నీరతు కనుచు —
ప్రాణభయ మేడ; నూరేళ్ళ బ్రతుకు నీకు!

---



ప్రయాణ సన్నాహము

ప్రార్థనాసమావేశమునకు వెళ్లుటకై చేతికఱ్ఱ తీసుకొని, ఉత్తరీయము కప్పుకొనుచున్న గాంధీమహాత్ముడు



పా ద పూ జ

మహాత్ముని చరణకమలములను కడిగి, ఆనీళ్లను ప్రోక్షించుకొని, తడిఒత్తి పాదపూజచేయుట పతివ్రతాశిరోమణియైన శ్రీమతి కస్తూరిబాయికి నిత్యవిధులలో ఒకటి

# ఆంధ్రశ్రీ

## శ్రీ ఓరుగంటి రామచంద్రయ్య

నేటి ఆంధ్రులకు రాష్ట్రము లేదు, రాజధాని లేదు. వీని సంపాదనానికి ఆవశ్యకమైన ఏకత, ఏకనాయకత్వము అసలే లేవు. ఉన్నది మన చరిత్ర, చిరకాలానుగతమైన ఆ చరిత్రస్మృతి.

"మే మాంధ్రులం" అని మనవా రుచ్చరించే ఫక్కిలోనే "మే మిప్పటివార మేమి?" అనే ధీమా గోచరిస్తుంది. కాని ప్రాచీనంకావడమే సాధుత్వాన్ని గాని, గౌరవాన్ని గాని ఆపాదించదు. మన ప్రాచీనాంధ్రులు పురుషార్థపరులు కావడమే వారి వైశిష్ట్యము.

ఆంధ్రులం మనము "ఐతరేయబ్రాహ్మణకాలం వారం". నిజమేగాని, ఆ బ్రాహ్మణం పేర్కొన్న ఆంధ్రులే కారు మన గర్వకారణాలు. వారి తరువాత శాతవాహన నామంతో ౪౫౦ యేండ్లు దక్షిణాపథపతులుగా పాలించినవారే మన కీ తలయూపో, తలవిసరో ప్రసాదించినవారు.

అయితే, ఆంధ్రశాతవాహనుల అభేదం మనం సాధించుకోవలసిరావడం చరిత్రరచనలో మనవారు ముందంజవేయకపోయినందువలని ఫలితం. శాతవాహనులు లాంధ్రులే. కాని వారు సాధించిన దేమి? మొదటిది వారి ౪౫౦ యేండ్ల పాలనమే. మౌర్యులకాలానికి శాతవాహనశ్రీముఖుడు స్వతంత్రుడు కాలేదు. కాని నాటికే ఆంధ్రభాగ్యోదయశ్రీ అరుణారుణంగా కనుపించింది. కృష్ణప్రథములుగా వీరు స్థాపించిన స్వతంత్రరాజ్యం వెలిగే కాలంలోనే, మగధలో మౌర్యశుంగకాణ్వులు, కళింగంలో చేదివంశ్యులు, బ్రహ్మావర్తంలో యవనశకపహ్లవకుషాణులు—వీరి రాజ్యాలు పుట్టినవి, గిట్టినవి. అందరితో అన్నివిధాలుగా పోరుతూ ఆంధ్రాభ్యుదయాన్ని వర్ధిల్లజేయగలిగిన గౌరవం శాతవాహనులు దక్కగొన్నారు.

ఆ రోజులు భారతచరిత్రలో మహోత్పాతాలను, మహోన్నతులను రెంటినీ చూడగలిగాయి. అంతిమ మౌర్యుల కాలంలో మగధరాజ్యం ఛిన్నాభిన్నమై బహుధా విభక్తమైపోయింది. క్రీ.పూ. ౨౦౬లో యవన అంటియోకస్ సుభగసేనునితో చేతులు కలిపిన ప్రణయం తరువాత ఆరేండ్లలో భారతానికి ప్రళయంగా మారిపోయింది. డిమిత్రియస్, అపొలొడొటస్, మినాండరులు యమునాజలాల్లో క్రీడలిడే ముద్దుముచ్చటలు తీర్చుకున్నారు. యుగపురాణం వాకొన్నట్లు, వారిపాల బడి సాకేతం (Oudh) సాంతమైంది; పాంచాలం (గంగాయమునామధ్యం) పంచత్వం భజించింది; మాధ్యమికం అనామకం అయింది; పుష్పపురం పావసిపోయింది.

అది శివుని డమరుకపు ఢమాము కాదు; శత్రుజనోచ్చాటనమైన భారతీయుల హుంకరింపు. అది రుద్రుని శూలపు ముమ్మొనలు కావు. భారతసంస్కృతిశరణ్యులగు పుష్యమిత్ర, ఖారవేల, శ్రీశాతకర్ణుల మొగ్గరపు మొనలు. యవనసేనావాహిని ఆ కులపర్వతములను తాకి క్రమంగా మగధలో, మాధ్యమికంలో, సురాష్ట్రంలో భంగురమై పోయింది.

చేది ఖారవేలుడు యవనదిమిత్రుణ్ణి తరుగగొట్టి, శుంగుని శృంగభంగం చేసి రాజసూయం నెరవేర్చినాడు. కాని త్వరలోనే అతడు దివంగతుడైనాడు. ఖారవేలుని కలికి తలవంచి పాటలిని కాపాడుకొన్న పుష్యమిత్రుడు పుత్రపౌత్రులగు అగ్నిమిత్రవసుమిత్రుల ముందంజల

కంటక, యవనులు సింధునదిని దాటి పరారులు కాగా, రెండశ్వమేధములను, ఒక మారు రాజసూయమును యజించినాడు. జనమేజయుని తర్వాత యజ్ఞయాగోద్ధరణకీర్తి ప్రప్రథమ మితనికే దక్కినదట. కాని తనకు ప్రకృత్యమిత్రుడగు మౌర్యసచివుని బంధుగు యజ్ఞసేనుని చే వదిరాధిక్షితమగు విదర్భను, నవసంరోపిత శిథిలతరువుగవలె పెల్లగించుటతో పుష్యమిత్రుడు ఆంధ్రసిరి శాతకర్ణికి సమీపస్థుడై అతనికి కోపకారణమైనాడు.

పశ్చిమాంధ్రంలో, సురాష్ట్రపు పొలిమేరల్లో, యవనుల నరికట్టే యత్నాల్లో మగ్నుడైయున్నాడు సిరిశాతకర్ణి. తన భూములపై భారతేలని పొందు కొంత పొర్లితే నేమాయె. అది యవనభంజకమాటచే సహింపవచ్చినదే. కాని యీ పుష్యశుంగుని కీ పోగాలమేమి? మాగధేయుల బలాన్ని విదిశావిదర్భల్లో విస్తరించిన శుంగుడు సమీపాంధ్రంపైపు కన్నువేయడా? ఇది సహించినచో తనకు తలవంపుమాట అటుంచి, ఆంధ్రశ్రీ అటునిటు కాదా?

శ్రీ శాతకర్ణిబలము లిటు పొరలినవి; శుంగుల కార్యము లటు విఱిగినవి. ఆకరావంతులు (East & West Malwa) ఆంధ్రుల విహారభూము లైనవి. సాంచీస్తూపకళావైదగ్ధ్యంలో సాంధ్రశిల్పివాసిష్ఠీపుత్ర ఆనందుడు తాండవించాడు. ఇక రాజా? తాను వీరుడు, శూరుడు, అప్రతిహతచక్రుడు, దక్షిణాపథపతి. పుష్యమిత్రుడు రెండశ్వమేధములు చేసినాడేమి? రాజసూయమునుకూడ నిర్వహించెనా? ఆంధ్రసిరి శాతకర్ణి తానును రెండశ్వమేధములు, ఒక రాజసూయము నిర్వహించెను. కాళింగునికి శుంగుడు 'హాహా' వ్వనలేదా? భారతేలని అసంకీర్ణమునకైన తా నా భూముల నాక్రమించినాడా? అవి లేదు శ్రీశాతకర్ణిమొదల నాదలకహించాయి. మాంచాపురిశాసనం పేర్కొన్న కళింగాధిప కూడెవ సిరియొక్క 'సిరి' అంతానికీ, ఆంధ్రాధిప సిరిశాతకర్ణకూ ఏమి సంబంధం?

అనుకొన్నారేమి ఆంధ్రకు మగధ అంత చేరువౌననీ? కలగన్నారేమి శ్రీ శాతకర్ణి అంతలో దివంగతుడౌననీ? అతడొక అద్భుతవ్యక్తి. అతని దొక అలౌకిక శక్తి. అందరికిని సాధ్యమూనా అతడు త్రొక్కిన త్రోవల బోవుటకు? అతని తరువాతి రాజులు శ్రీ శాతకర్ణిని మందాకినీజలవిగాహనశీలునిగ, తమ్ము భోగవతీ సలిలవిప్లవదాశ్రయులగు భుగ్నభోగులుగ పోల్చుకొన్నారు. మగధ దూరమాటే కాదు, ఆకరావంతులలో మాగధేయశుంగభాగవతుని యధికారం బలసికొన్నది. ఉత్తరాపథమున శాతకర్ణి గాంచిన విజయములు, కొనిన దేశములు ఆంధ్రుల చేజారినవి. కాని ఆంధ్రుల చేవ చివికిపోలేదు. వారి ప్రభుమంత్రోత్సాహశక్తులలో కొఱవడినది ఉత్సాహశక్తిమాత్రమే. తరువాతిరాజులలో వాత్స్యాయనుడు పేర్కొన్న కుంతలశాతకర్ణి, కుంతలమునంటిటను పాలనము సాగించి సడలనున్న ఆంధ్రుల స్థైర్యకంచుకమును బిగించి, వారిని ద్విగుణీకృతోత్సాహులుగ నొనర్చినాడు. ఆంధ్రసైన్యములు రణసన్నద్ధము లైనవి.

ఎవరీ ఆంధ్రకోపాగ్నిపాత్రములు? కుంతలశాతకర్ణి అరివీరుల నిర్దేశింపలేదు. కాని వాని దూరదృష్టికి దేశారిష్టసూచన లగుపించియేయుండును. క్రీ.పూ. ౧౦౧ లోనే తక్షశిలాధిపతియగు యవన అంటియాల్కిడాసు పంపున హెలియొడోరస్ భాగశుంగునితో రాయబారము నెఱపినాడట. ఈ రాయబారి భిల్సాపరిసరములలో బెజ్ నగర్ వద్ద వాసుదేవు నర్చింప శిలాస్తంభము నిలిపినాడట. సర్వభారతమును కబళింప నుద్యమించిన యవనులకును, వారి బారినుండి బ్రహ్మప్రయత్నముపై విడివడి ఎట్లో యింతవరకు నెట్టుకొనివచ్చిన శుంగునికిని మైత్రియా? ఆ యవనులే వనుల పాలైరా?

భారతవీరుల నోహటింపక పలాయితుడైన యవనదిమితుడు (Demetrios) యూక్రటైడిస్‌కత్తికెఱ యైనాడు. ఆతనివాత అపొలొడొటస్‌గతికూడ నట్లే అయినది. కాని యూక్రటైడిస్ బ్రతికి బావుకొన్నదేమి? పార్థియనుల రాజు మిత్రిడేటిస్ అతని పాలిట యముడైనాడు. పార్థియనులును, వారికి బావలైన శకులును అతని పశ్చిమభూముల పెంపరలాడగా, మధ్యదేశమున మిళిందుడు మధుర రాజధానిగా సర్వస్వతంత్రుడైనాడు.

పుష్యమిత్రశుంగుడు చనిపోయి నాలుగేండ్లు కాలేదు. మిళిందుని కింటలో మృత్యువు ముంచుకొని

వచ్చినది. యూక్రెటైడీస్ కొడుకు హెలియోక్లీస్ నకు మరల భారతభూములలో నిలువ నీడ దొరకినది. అతని తరువాతివాడే ఆంటియాల్కిడాసు. భాగభద్రుని మైత్రి వర్ధించిన దాతడే. కాని, యీ రాయబారముల వలన వతని కొరిగినది లేదు. నిరవధిగ పారలిన శకపహ్లవసేనావాహినులు యూఫ్రటిస్ జమునా జలసంగమము సాధించినవి. తక్షశిలలో, సురాష్ట్రములలో, మధురలో, అకరావంతులలో అజీస్ ఆజ్ఞానువర్తులగు క్షాత్రపులు శాసకు లైనారు.

పులిమీద పుట్ర. యవనుల విలయానికి సంత సింపనేలేదు భారతం. ఇంతలోనే శకపహ్లవవిజయాట్టహాసములు ములుకులవలె భారతీయుల శ్రవోనిర్భేదకము లైనవి. కాళింగమాగధులు ఈ ప్రళయ మాపలేరు. మగధలో శుంగవంశము నశించినది. కాణ్వులలో వాసుదేవుని దొట్టి మువ్వురు నృపులు గతించినారు. సుశర్మ కాణ్వుడు తన్ను రక్షించుకొనగలడా, దేశమును రక్షింపగల్గుటకు? మగ్గిన పండు మగధశకపహ్లవుల పాలైనచో అది ఆర్యావర్తమా, శకార్ణవమా?

ఎవరయ్యా యీ ప్రబలారిష్టాన్ని అరికట్టే నాథుడు? ఎవరయ్యా మగధను చేపట్టి భారతభూముల పెట్టని కోటయై మాగధాంధ్రకాళింగుల మానమును పరిరక్షింపగల్గినవాడు? అతడేనా ఆకరావంతులలో శుంగులనే సహింపని శాతవాహనకులుడు? కాణ్వసుశర్మాంతకు డతడేనా? అతడేనా ఆ శ్రీముఖవంశీయుడు?

నాటినుండి శకపహ్లవుల కెదిరి ఒకడే, శాతవాహనుడు. ఆంధ్రుల నోముపంట సుశర్మాంతకు డంతలో మృతించినాడు. ఆంధ్రదేశమంతటి కది యొక కాళరాత్రి; శకపహ్లవుల కది సుప్రభాతము. మధురలోని మహాక్షాత్రప 'రాజులుడు' రాజరాజట, త్రాత యట. 'రాజుల' సహాయుడై మహాక్షాత్రపనహపానుడు పశ్చిమ భారతములో కుదురుకొనుటేగాక శాతవాహనపాలితాలగు మహారాష్ట్రాపరాంతముల నాక్రమించినాడు. నాటి నుండి శ్రీశాతవాహనుల సిరి తీసికట్టయినది. క్షహరాటుల ఒత్తిడికి శాతవాహనుల రేవుపట్టణములు సోపారా కళ్యాణములు నిర్జనములై పాడరిపోయినవి.

కాని ఆంధ్రుల సుకృత మంతరించిపోలేదు. ఆ క్షాత్రపసంపన్నాకాశకర్ణధారులలో కడపటివాడు గోండోఫర్నిస్ "మహారాజు, రాజాధిరాజ రాజపరమేశ్వరుడు" చనిపోవుటతో శకపహ్లవసామ్రాజ్య మస్తంగతమైనది. కాబూలులోయలలో, వాయవ్యభారతములో కుషాణులు ప్రబలి, క్రమముగా క్రీ. శ. ౭౮ కి సింధునదీ ముఖద్వారమువరకు తమ అధికారమును విస్తరించినారు. కాని శకపహ్లవక్షహరాటక్షాత్రపులు తమ తమ నెలవుల కింకను తప్పిపోలేదు.

ప్రాపులేని యీ క్షాత్రపులనుండి తన పూర్వుల రాష్ట్రములను కైకొనుట శ్రమ యనిపించలేదు గౌతమీపుత్త్ర శాతకర్ణికి. గోవర్ధనవిజయస్కంధావారమున కూడిన యాతని వైజయంతిసేనలు బహుముఖముల కదలాడినవి. అర్బుద (Aravalli) పర్వతపు దరులు ఆంధ్రవీరుల విజయనాదములను ప్రతిధ్వనించినవి. శాహోర్గశస్తంభు డాతడు వైరిభయంకరుడే కాని నవోత్ఫుల్లపంకజకోమలవదనుడు. పరరాజుల నుండె దిగు లాతడు అవశ్యము కానిపట్ల వారిలో నొక్కనినైన చెనకలేదు. ఓటమి నెఱుగని అతడు క్షత్రియదర్పమానమర్దనుడు, క్షహరాటవంశనిరవశేషకరుడు, శకయవనపహ్లవనిషూదనుడు, ఏకైకధనుర్ధరుడు, ఏకైకశూరుడు.

శత్రుదుస్సహుడగు గౌతమీపుత్త్రుడు తన ప్రజలను కన్నబిడ్డలనువలె కాపాడినాడు. కాల మెఱిగి కర్మ మెఱిగి అతడు త్రివర్గములను సాధించెను. ప్రజల సుఖదుఃఖములలో నాతడు సమభాగి. ఏకబ్రాహ్మణు డాతడు వర్ణాశ్రమధర్మముల గాపాడెను. ఉత్తమపుత్త్రు డాతడు విసువు నెఱుగక తల్లిని శుశ్రూషించెను. శాతవాహనకులయశఃప్రతిష్ఠాపకు డాతడు తనకు, తనవారికి, తన ప్రజలకు, తనభూమికి గర్వకారణు డైనాడు.

గౌతమీపుత్త్రు డుద్ధరించిన భూమి అతని పుత్త్రునికి దుర్ధర మైనది. వాశిష్ఠీపుత్త్రపులుమాయి దక్షిణాపథేశ్వరత్వముతో తృప్తిచెందినాడు. కనిష్క హువిష్క వసిష్కుల కుషాణ రాజ్యము ఆసింధుమధురానగరమై యున్నదట; ఉత్తరాపథమున నతనికి నిలుకడ ఎట్లు? గౌతమీపుత్త్రుని తోడి యుద్ధములలో పుత్త్రుని జయదాముని గోల్పోయిన చష్టనుడు పులుమాయిలోపమును గ్రహించి యతని

మలికాలమున నవంతి నాక్రమించినవైచెను. అకరము శాత్రవాకర మైసట్లు సాంచీలోని వాసిష్కశాసనమే సాక్షి. కార్దమకచష్టనుడు పౌత్రరుద్రదామసహాయుడై వెనలి క్రీ. శ. ౧౩౦ నాటికి ఘూర్జరసౌరాష్ట్రములకబళించినాడు. పులుమాయితరువాతి శివస్వాతి స్కంద స్వాతులు దుర్బలులు. అనువుజూచి భ్రష్టరాజ్యప్రతిష్ఠాపకుడైన రుద్రదామమహాక్షాత్రపుడు మహాంధ్రముపై కన్ను వైచి తరుణము వేచినాడు.

యజ్ఞశ్రీ శాతకర్ణి సింహాసన మధిష్ఠించుటలో శాతవాహనకులమున ముసలము శివస్వాతికుమారుడు వాసిష్ఠీపుత్రశాతకర్ణిరూపమున ప్రవేశించినది. శక క్షాత్రపులతోడి యుద్ధములలో శా నెన్నిమారులు పరాక్రమింపలేదు? పశ్చిమాంధ్రము కార్దమకుల పాలు కాకుండుట తనవలన కాదా? మరి యజ్ఞశ్రీ యెవడు శాతవాహనకిరీటమును వహించుటకు? ఇది సహింపరానిది. ఇదే యదనుగా రుద్రదాముని కూతురు వాసిష్ఠీపుత్రుని దేవి యైనది. ఆమెమంత్రి రహస్యాధికృతుడు సాతేరకుడు వాసిష్ఠీపుత్రుని నమ్మిన బంటు. ఆ ప్రాకృత మహాసముద్రమున రెండే సంస్కృతశాసనలు—రుద్రదాముని గిర్నారుశాసనము, వాసిష్ఠీపుత్రశాతకర్ణిని కాన్హేరిశాసనము. ఇదియును సంస్కృతియేనా?

యజ్ఞశ్రీ కఠిన పరీక్షాసమయము. నాసికా ప్రాంతములలో మహాసేనాపతి భావగోపుడు శత్రువులతో శక్తికొలది పోరి యోడి పరువిడినాడు. యజ్ఞశ్రీ కాన్హేరిభూములలో వీరవిహారము కావించినాడుగాని, దైవము వేరైనపుడు మానుషము మాటేమి? రుద్రదాముకు ఆంధ్రశ్రీ వశమైనది. ఎంత శత్రువైన నేమి, యజ్ఞశ్రీ అతని కదూరసంబంధి; అత్మసదృశుడగు మేటి వీరుడు. యజ్ఞశ్రీని ముక్తుని జేయుట రుద్రదాముని కీర్తికుముములను మరింత వాసింపజేసెను.

యజ్ఞశ్రీ శేషకాలమును పూర్వాంధ్రమున గడపినాడు. నాగార్జునుని శూన్యవాద మీవిధముగ నతని దృష్టి నాకట్టెనా యేమి? మహాంధ్రము, మహాంధ్రస్వాతంత్ర్యము మాయమైనవి. శాతవాహన మద్భిక్షుపున నడగిపోయినది.

౨

ఒక వేయేండ్లతర్వాత. అది క్రీ. శ. ౧౨౯౬ వర్షము. దేవగిరిలో హేమాద్రి చతుర్వర్గచింతామణిరచనలో మున్నాడు. అతని వ్రతఖండపరిశీలనమున తన్మయుడైనాడు వృద్ధయాదవుడు రామచంద్రుడు. హేమాద్రి గంటము ఒరలో చేరలేదు. అల్లాయుద్దీన్ చాలితులగు తురుష్కుల ఖడ్గము లొరలలో ఇముడలేదు. ఉరుముని పిడుగుగ వచ్చిన యీ యాపద కనదరై దేవగిరి పాతాళములకు క్రుంగినది.

ఏకశిలానగరమున విద్యానాథు డింకను పాడుచున్నాడు:—

"దూరా దాకర్ణత విశ్వ
ప్రసృమరమహసో వీరరుద్రస్య జైత్ర
ప్రస్థానారంభభేరీ
నినద మరినృపాః పూర్ణకర్ణజ్వరార్తాః..."

అని.

కాని, ఆ భేరీనినాదములు నవలక్షధనుర్ధరాధినాథునకు కాకతీయవీరరుద్రునివి కావు. ఆ కర్ణజ్వరము తురుష్కులకును గాదు. ప్రస్థానమును లేదు; ఆరంభమును లేదు. స్వాతంత్ర్యము నోచుకొనని యాంధ్రుడు మానమునకును పేదయైనాడా? ఒక మారు విజితుని తన్ను 'రాయరాయ' నిగ కొనియాడినంతనే తురుష్కనృపుని కిన్ని సలాములు, ఖుర్నీసులునా? నాటి కాకతీయనృపుని యెడల నింత ద్రోహమా? కానిచో మజిలీమజిలీకిని మాలిక్ కాఫరునకు సరఫరాలు దేవగిరినుండి అందునా?

అదిమొదలు క్రీ. శ. ౧౩౨౩ లోగా ఒకమారు కాదు, రెండుమార్లు కాదు, ఏడుపర్యాయములు ఆంధ్రనరేశ్వరునికిని, మ్లేచ్ఛులకును ఎడతెగని పోరు. భీమేశ్వర పురాణ కృతికర్తయగు కొండపూడి అన్నమంత్రితాత అన్నమంత్రి, మహాప్రధాని గన్నయప్రెగ్గడ కొడుకు అన్నయ, మన్మగన్నని సుతుడు కొలని రుద్రదేవుడు, రేచెర్ల యెరదాచానాయకుని పుత్రు డేచనాయకుడు, పానుంగలు ప్రభువు యాదవ శార్ఙ్గపాణి దేవుడు—ఒకరేమి, ఎందరెందరో తురుష్కపస్లవమేదినీసముద్ధరణ

కీర్తి గడింప నుద్యమించి విఫలిగినారు. కడకు ఆంధ్ర నరేశ్వరుడు ఉలుఘ్‌ఖాను చేతుల బందీయైనాడు. ఏకశిలానగరములో ఏకచ్ఛత్రితసార్వభౌములై పాలించిన వీరు నేడు కరబంధములతో ఢిల్లీ చేరునా? దారిలో నున్నది సోమోద్భవ, సర్వకల్మషనాశిని నర్మద. ఆ నదిలో గ్రుంకులిడిన ఆంధ్రవీరరుద్రుడు "స్వేచ్ఛమై, స్వస్థానము" పొందినాడు.

## 3

క్రీ. శ. ౧౩౨౮ మొదలు ౧౩౩౬ వరకు ఒక పంద్రెండేండ్లు హైందవుల పాలిటికి దుస్స్వప్నమైనవి. ఈ కాలమున దక్షిణభారతము నంతటను తురుష్కు లొనరింపని యకృత్యములు లేవు. హిందువులు పలవింపని యవమానములు లేవు. శ్రుతి యస్తమించినది; నయమడగారినది, ధర్మనిరతి సడలిపోయినది; చరిత్ర గతించినది; ఆభిజాత్యము చ్యుతమైనది; వేయేల, కలి ధన్యుడైనాడు.

ఈ ధర్మగ్లాని దుస్సహము కాగా పీడితప్రజలు అది బ్రతుకో చావో నిర్ణయించుకొనలేకపోయినారు. శాత్రవులపై వారి యలుక కవధి లేదు. అది రొమ్మున కట్టిన చిచ్చు; వారిది రక్కసతాలిమి.

కాని, వీరి యీ శక్తిని ఏకముఖముగ త్రిప్పి ఆంధ్రుల స్వాతంత్ర్యమును పునరుద్ధరించుకొను నాయకుడు లేడే? సూర్యచంద్రవంశ్యులు రాజులు లేరు. కాని ఆ తురుష్కప్రళయవారాశిలో మునిగిపోవని అన్నయ గజసాహిణి, కొలని ప్రతాపరుద్రుడు, రేచెర్ల సింగమనీడు లున్నారు. వారు కారణముగా చేరినారు మహాసామంత మాండలికవంశ్యులు ముసునూరి ప్రోలానాయుడు, కొప్పుల ప్రోలయ, అద్దంకి కోమటి వేమారెడ్డి, రేచెర్ల సింగమనాయుడు, మంచికొండ గణపతి నాయకుడు. వారి యభిమతముతో ముసునూరి ప్రోలయ ముందు నడచినాడు. ఇతరులు వానికి అండ యైనారు. తురుష్కబలములు పటాపంచ లైనవి. ఏకశిలానగర మింకను చేజిక్కలేదుకాని తెలంగాణాతీరభూములలో నెల్లెడలను ఆంధ్రస్వతంత్రపతాకలు రెపరెపలాడినవి.

దూరాన ఢిల్లీలో మహమ్మద్ బీన్ తుఘ్లక్ కొరకొరలాడినాడు. తెలుగువీరుల విజయము లతని శక్తిని శంకింపజేయుగా అతని మేనల్లుడు బహావుద్దీన్ అతని కెదురుతిరిగినాడు. క్రుద్ధుడగు తుఘ్లక్ అల్లుని వెంటాడివెంటాడి, కడకతనిని, అతని కాశ్రయ మిచ్చిన కంపిలిని ఆహరించినాడు.

మంచికి పోయిన చెడుగైనది. ఆర్తున కాశ్రయ మొసగుటయూ ఈ తురుష్కు లెరుగరా యేమి? కంపిలిలో తుఘ్లక్ ప్రతినిధి మల్లిక్ సాయుబున కెక్కడ జూచినను శత్రువులే కనుపించినారు. రస్తురవాదాలు లేక తుదకు పస్తుండవలసిన ట్లున్నదే! ప్రజలలో పాదుకొనని పాలన మెంతకని నిలువగలదు! ప్రోలయ వేమారెడ్డి ద్వితీయుడై అరవీటి సోమదేవరాజు తురుష్కులను తరిమితరిమి కొట్టెను. కోటరాచూరు, ముదిగల్లు, యాతగిరి అతని వశమైనవి. ఢిల్లీనుండి ముక్తులై కంపిలి పాలకులుగా వచ్చిన హరిహరసోదరులను తురుష్కమిత్రులను భ్రాంతితో సోమదేవరాజు ప్రతిఘటించి, నిజ మెఱిగి తుదకు వారికి తోడునూపినాడు. విద్యారణ్యమహర్షి ఆశీస్సులతో విజయనగర రాజ్యస్థాపన యైనది.

ఒక పన్నెండేండ్లకేనా తురుష్కు లింత విఱ్ఱవీగిపోయిరి! ఆంధ్రుల అస్వతంత్రత అంతలో మాయమైనదే. తురుష్కు లిక పాలకులు కారుకదా. కోఱలూడిన పాములవలె పడినారు. ఎందు పోగలరయ్యా? వారి దారుణచర్యలు, ఘాతలు ఇప్పుడు వెడిసి కొట్టవా?

ఆంధ్రుల విజయగర్వము విజయోన్మాదము కాలేదు. ఉత్తరాపథమందలి ముస్లిములకును, దక్షిణమున నీ రాయలకును ఎంతటి తారతమ్యము! విశాల విజయనగరరాజ్యమున నెందరు తురుష్కులు లేరు! కాని వారిలో నొక్కరైన పరధర్ములను కారణముగా బాధనందినది లేదు. దక్కనులో, ఆర్యావర్తములో నాటి హిందువులను తురుష్కప్రభువులు అంపకోత వెట్టుచున్నను, సమదృష్టులగు విజయనగరరాజులు, ప్రజలు పాలిత ముస్లిములను ప్రతిహింసింపరైరి.

రెండవ దేవరాయలు ముసల్మానులను చేరదీసెను. వారికి జాగీరులు కావు, పదవులు కావు, కడకు వారికై విజయనగరమునందే ఒక మసీదు వెలసినది. స్వయముగ రాజే అందుకు కారణమైనాడు. ముసల్మానులు కాఫిరులకు నమస్కరింపరని కాబోలు రాయలు తన సింహాసనముపెదుట నొక ఖురాన్ ప్రతి నుంచినాడు. ఎవరి ధర్మమున వారు చరించుట కెట్టి యాటంకమును లేదు. తుదకు రాజధానీనగరమందే వారికై యొక పేట బలసినది. వర్తకవాణిజ్యములలో తురుష్కులు, సైన్యములలో తురుష్కులు! విజయనగర రాజ్యజీవనమున వారంతగా పెనగొనిపోయినారు. కృష్ణరాయల రాయచూరుముట్టడిలో సేనాముఖమున ముసల్మానుసర్దారులు నడచినారు. గండికోటలోని హిందూసర్దారు నణచుటకై కృష్ణరాయప్రేషితుడై ప్రభుకార్యమును నిర్వహించినవాడు ఇస్మాయిల్ ఖాను డట.

కాదా మరి ? విజయనగరమున నున్నంత స్వేచ్ఛ వారికి పాటిముసల్మాన్ రాజ్యముల లభింపదే! ఇబ్రహీం ఆదిల్షావద్ద ౩౦౦౦ ముసల్మాను ఉద్యోగులు షియా లగుటచే ఉద్యోగముల గోల్పోయి తహతహలాడగా, వారికి రామరాజు శరణ్యమైనాడు. అంబూరుఖానున కొక జాగీరు, ఐన్ ఉల్ముల్క్ గీలానీ రామరాజులు అన్నదమ్ములవలె వ్యవహరించినారు. దిలావర్ ఖాను రామరాజునకు కార్యకర్త. పరమతసహిష్ణుతలో రామరాజు పరమావధి నందుకొన్నాడు. కాకున్న హైందవుడు తాను, తన రాజ్యమున గోవధ నొప్పుకొనునా ? రాజధానీనగరమున మసీదులో గోవధను జరిగినది. ఆంధ్రప్రజల రక్తము ఉడుకెత్తినది. ఇంత దుస్సాహసమా! ఆవేశపూరితులు, క్రోధకంపితులు, ఉత్తేజితులును అగు ప్రజలు, వారి పక్షమున తమ్ముడు తిరుమలరాయలు రామరాయల సమదృష్టిని వక్రింపజేయగోరిరి. వారి కందరకును రామరాయల సమాధాన మొకటే: "తురక లిందు చేరినది రాజసేవకేగాని, మతపరిత్యాగమునకు గాదే" అని. (Rafi-ud-din Shiraji)

ఇది వెఱ్ఱియా, వేదాంతమా ? వేదాంత మను కున్నాడు రామరాజు; వెఱ్ఱియని కనుగొన్నారు పాలిత తురుష్కులు. క్రీ. శ. ౧౫౬౫ లో రాక్షసతంగడీయుద్ధ భూమిలో రామరాజు నెదిర్చినవారిలో అతనికడ పుత్త్రునికన్న మిన్నగ లాలనల నంది బిజాపురరాజ్యమున నిలుకడగన్న అలీ ఆదిల్షా ఉన్నాడు. రామరాజు ఉప్పు దిని, రణరంగమున నతని వెన్నుదన్ని నిలచిన వారిలో, యుద్ధమధ్యమున నతని గికురించి శత్రులలో గలిసిన ద్రోహులు ముసల్మాన్ సర్దారులు నున్నారు (Peron). అది వెఱ్ఱివేదాంతము కాదు. వేదాంతమే వెఱ్ఱి యైనది. విజయనగరసామ్రాజ్యమున ఆంధ్రశాసనము నాశనమైనది.






# 'నాన్న వచ్చాడు'

[నాటిక]

శ్రీ రా. సి. ఆంజనేయశాస్త్రి

[గుర్రబ్బండీ ఆగిన చప్పుడవుతుంది. "నాన్నొచ్చాడు", "మామయ్యొచ్చాడు" అంటూ పిల్లలు చప్పట్లు కొడుతూ అరుస్తారు సంతోషంగా.]

సుశీల—అందరికంటే ముందు నేను చూశా నాన్నని!...

ప్రకాశం—నేను కాదమ్మా చెప్పింది ముందర! గుర్రబ్బండీ వస్తుందని?

సాంబుడు—నేను యింకా ముందర గానే బండి చప్పుడు విన్నానమ్మా, తెలుసా?

రాధాయి—అసలు మీ అందరికంటే ముందర నేనూ చెప్పింది, యీ బండిలో మామయ్య తప్పకుండా వస్తాడని!

హనుమంతరావు— (ప్రవేశిస్తూ) సాయిబూ! ట్రంకూ, బెడ్డింగూ గదిలో పెట్టవోయి...ఏదీ—పళ్ళ బుంగా, బొమ్మల బుట్టా యిలా తీసుకురా...

పిల్లలంతా—(ఒక్కమాటుగా) "నేను చూశా నాన్నా ముందు" "కాదు నేను మామయ్యా"..."నే వంటూంటేను బండిచప్పుడు వింది!" "అన్నీ అబద్ధాలే మామయ్యా, నేను చెప్పా యివ్వాళ నువ్వు తప్పకుండా వచ్చి తీరుతా వని...కావలిస్తే అత్త నడుగు..."

హను—(నవ్వుతూ) ఆరి భడవే! అత్త నడగాలిట్రా?...ఒసేయి, రావే...సాక్ష్యం మరి!

పద్మలక్ష్మి—ఆఁ...వాడి మాటల కేంలెండి... కాళ్లు కడుక్కోండి ముందు...బండి లేటయినట్టుంది!

హను—ఎంత లేటులే!...చెల్లె లేదీ?... ఎలావుంది కొత్త మేనకోడలు?

పద్మ—దొడ్లో నీళ్ళు పోస్తోంది మీచెల్లెలు పిల్లకి...మేనకోడలి కేం? పొట్లంలా వుంది...

కామేశ్వరి—(కొడ్లోంచే) వస్తున్నా అన్నయ్యా, అయిపోయింది నీళ్ళుపొయ్యడం...ఇదిగో మేనకోడలు...అప్పుడే నిద్దరపోయింది కూడాను కుడిచీ కుడవకముందే...

హను—అసి...పిల్లా...నిద్దరే అప్పుడే?... కందగడ్డయిపోయిందేం? వళ్లిమనుళ్లు పోశారేమిటే?... అదేమిటి బుగ్గలన్నీ...

అన్నపూర్ణమ్మ—మరేం...చలికాలం కదూ, కాస్త వేడిగానే వుండాలి నీళ్ళు...బుగ్గలేమిటి? ఒకటే చీడ...అసలు చీడ పుట్టినతరవాతే యిది పుట్టిందిరా!

కామే—మరే...ఇప్పుడింకా చాలా నయం అన్నయ్యా, పదిరోజులకింద చూశావు కాదు... అబ్బబ్బ...ఒకటే ఒక అట్టుకో...

హను—అహహా!...ఆ ముక్కూ, ఆ బుగ్గలూ అంతా అటుపోలికే! తండ్రీ, తాతాను...ఎక్కడ మంచి వస్తాయి చక్కదనాలు, రమ్యంటేమటుకు?

పద్మ—అవును లెండి...మేనమామల పోలికొస్తే అప్సరసలా ఉండేదికామాలు!...

హను—అబ్బో! అన్నగార్ని వెనకేసుకొస్తోంది! ...నయం...అత్తపోలిక రాలేదు. బతికిపోయాం...

పద్మ—పోనీలెద్దురూ!...ఏదో శాస్త్రం చెప్పినట్టు, మేనమామ పెళ్లాం మేనత్త కాదు. పింతండ్రి

కొల్లాం పింతల్లి కాదని...ఎవరి చక్కదనాలు వారి కుంటాయి...

కామే—ఎందుకమ్మా అంత కోపం? ఏదో నవ్వులకంటేనూ మా అన్నయ్య...!

అన్న—ఒరేయి, గిల్లికజ్జా పెడుతావురా నువ్వు!...ఇంతకూ పట్నంలో నీకు బాగా పడినట్లు లేదే!...నెలరోజులలో నీ సగమైపోవాలేమిట్రా? లేమనుభోజనం కామాలు!

హాను—చూశావుటే!...ఒక్కళ్ళన్నా అడిగా లేమో, యీ సంగతి, యింతవరకూను! ఎంతైనా తల్లి ప్రేమ తల్లి ప్రేమే...నీ కోడలు నా బదులు కొంత ఒళ్ళు చేసినట్టుందే!

కామే—ఉభయులూ సర్దుకోవద్దూ మరి?

అన్న—ఆఁ...దాని మొహం...మొన్నే ఒక లంకణం చేసిందిగూడాను...పడిశబ్భారంపట్టి...

హాను—అయితే, ఒక దరువు తీస్తేనే యిలా వుందన్నమాట! (అంతా పక్కన నవ్వుతారు)...

పద్మ—ఏమోనబ్బా! నా కంటికి మాత్రం ఎవరూ చిక్కినట్లు కనిపించడంలేదు...ఇప్పుడొచ్చిన వారిని మైకం వినహాయించక్కర్లేదు...

హాను—అందుకనే "తా నెంతో జగమంత!" అన్నారు. (మళ్లా అంతా నవ్వుతారు).

రెండో రంగం

[పిల్లలు ఒకటే గొడవ చేస్తూంటారు. "పండూపండూ నాకే"నని సుశీలా, "కొరికిన లడ్డూ నాకొ"ద్దని ప్రకాశం, "చితికిన యాపిలు నువ్వే తిన"మని రాధాయీ, "రెండు పొట్లాలూ నాకే కావా"లని సాంబుడూ అరుస్తూంటారు]

హాను—అరి దుడుకుపిండాల్లారా! అప్పుడే తన్నులుంగనీద ఎగబడ్డారేట్రా?....ఆఁ...ఆఁ....కరుస్తా వెందుకురా అక్కయ్యని? ("బయ్య" మంటుంది సుశీల)....ఒరేయి రాధాయి! అరటిపళ్ళు హస్తమంతా లాగుతా వెందుకురా?...ఆగం దక్కడ, నే కోస్తున్నాను.

అన్న—మరీ రెచ్చిపోతున్నారు సుమా అబ్బాయీ!...ఒకళ్ళకొకళ్ళు జేరి ఎనిమిది రఘాములూ ఒకటే అల్లరనుకో. ప్రయివేటు మాస్టరుగారి దగ్గిర ఏం మిణుకుతారో ఏమో ఓగడితుసేపు. మళ్లా పట్టుమని పది నిముషాలు కాలు కదపకుండా ఓచోట కూర్చుంటే ఒట్టు!...

హాను—చిన్న పన్నాసులు కాదుటమ్మా!...మరి...నన్నూ దాన్నీ చెయ్యమంటే చేస్తామా చెప్పు యిప్పుడు అల్లరి?...

పద్మ—ఇది అల్లరి కాదు కామాలు!...

కామే—సరేకానీ, ముందు వాళ్ళ కుస్తీపట్లు సర్దు అన్నయ్యా. నేను పిల్లని తొట్టెలో పడుకో పెట్టొస్తాను...కొంత సందులలుపు చేసిరావమ్మా ఒదినా, పక్కొస్తుందేమో!...

హాను—ఒరేయి పిల్లలూ!...ఎవరు తిన్నది వాళ్ళు తిన్నారు. యిహ బుంగ విడిచిపెట్టి యిలా రండి ఒక్కొక్కళ్ళూను...మీకు మళ్ళీ మధ్యాహ్నం మామిడిపండు ముక్కలు కోసి పెడుతాను.

అన్న—ఈ కాలంలో మామిడిపళ్ళేమిటిరా అబ్బాయీ?

హాను—భారామామిడని..."బారహ్" అంటే హిందీలో పన్నెండని అర్థం. బారహ్‌మామిడి పన్నెండు నెలలూ కాస్తుందన్న మాట. మరీ అంత రుచిగా వుండదు కాని......కానికాలంలో కాస్తుందికదూ, మా జెక్కువ....

పిల్లలు—మరి బొమ్మల బుట్ట చూపిస్తావా?...పెట్టెలో ఏమేమి టున్నాయి?

హాను—అన్నీ చూపిస్తాగాని వరసగా కూర్చోండి! ముందు...ఆఁ...కూర్చున్నారూ?......ఎగబడకండి మరి...ఇదిగో చూడండి...

సుశీల—ఆఁ...విమానం అది...బలే బాగుంది నాన్నా...బలే బలే! అది నాకూ...

ప్రకాశం—నాకో మరి?...నా క్కావాలి మామయ్యా ఆ విమానం...

సాంబుడు—నాకే నాన్నా...నాకే విమానం... ఇయ్యకపోతే అరుస్తా...ఆఁవ్ఁ...ఁ అమ్మాఁవ్ఁఁ...

రాధాయి—నా కొద్దేం మరి?...అరు...నా కేం?

హను—ఏమిట్రా ఆ అరుపు! ఊరుకుంటే యిస్తా నీకు విమానం.

సాంబు—ఊ..ఊరుకున్నాగా, యియ్యి మరి..

హను—తీసుకో...అఁ...ఇదిగో రోయి! ఇది రైలు...ఇ దెవరికిరా?

("నాకు" "నాకు" అని నలుగురూ అరుస్తారు)

సుశీల—మాకు నాన్నా. సాంబుకు యిది కూడా కావాలంటున్నాడు...

సాంబు—నాకు విమానం అక్కర్లేదు. రైలే కావాలి. అవ్ఁ...అమ్మాఁవ్ఁఁ...

హను—ఏంరోయి! వేషా లేస్తా వేమిటి వేషాలు! అరిస్తే యిస్తా రనుకున్నా వా అన్నీని?

ప్రకాశం—వా డెప్పుడూ అంతే మామయ్యా! ...మొన్న నే, యాపిలుపండు కొంటేనూ...మరే మోనే ...వాడే...ఏం చేశా డంటే...

హను—తెమలనియ్య వేం మాట?

రాధాయి—అన్నీ ఉట్టిదే మామయ్యా! అన్నయ్యే ఎంగిలి చేస్తేను...పాపం సాంబుడు "నా కొ"ద్దన్నాడు...

సుశీల—కాకెంగిలే కాదమ్మా!...

సాంబుడు—అయితే నువ్వే తినకపోయావ్?..

హను—పోనీలే!...పోనీ లెండి...అఁ...ఇది పామురా...ఎవరి క్కావాలి?...

(ముగ్గురూ "మా కొద్దు బాబూ" "మా కొద్దు బాబూ" అంటారు).

సాంబుడు—నా క్కావాలి నాన్నా, పాము కూడా...

హను—అరి పిడుగా! అన్నీ నీకేట్రా?...సరే గాని, యిహ చూడండి...దూరంగా నుంచోవాలి మరి...ఇదిగో రబ్బరుపిట్ట ("బుచ్" "బుచ్"అనే శబ్దం.)

సుశీల—బలే బలే!...ఇది బుల్లి పాపాయికి నాన్నా...

హను—చక్కగా చెప్పావమ్మా నువ్వు... ఇదిగో యిది సర్కసు దొరసాని...అదిగో మొగ్గ లేస్తోంది...

ప్రకాశం—ఎంచక్కగా వుందో!......అది నాక్కావాలి మామయ్యా!

హను—ఇది కొయ్యగుర్రం.

సాంబుడు—నే నెక్కుతా నాన్నా......ఎదీ ఛల్...ఛల్...

హను—ఆగు! ఆగు...ఇదిగో కాగితపు లస్తరు.

రాధాయి—నేను వెలిగిస్తా మామయ్యా...

సుశీల—ఛీ! కాలిపోద్రూ...(అంతా నవ్వుతారు).

హను—ఇదిగో గిలక్కాయలు...ఇవి కూడా బుల్లి పాపాయికేరా...ఏం?...ఇది చందనపు ఏనుగు...

రాధాయి—అది నా కియ్యవు మామయ్యా...?

హను—నీకేరా యిది......ఇదిగో చూశారా దంతపు దువ్వెన్నలు...

సుశీ—నాకోటీ...అత్తయ్యకోటీ...... అమ్మ కోటీ...

హను—ఇది బోసుబొమ్మ....ఇవి బొమ్మల క్యాలండర్లూ, రబ్బరు బూరాన్నలు, బంతుల పెట్టా... బిస్కట్ల పొట్లాలూ...(మాటిమాటికీ "నాక్కావాలి" "నాక్కావాలి" అని పిల్లలు అరుస్తూవుంటారు.)

అన్న—ఎందుకురా అబ్బాయీ పట్నమంతా కొనుక్కొచ్చావు?...ఇంతకీ నేను చెప్పింది...

హను—మరిచి పోలే దమ్మా...కామేశ్వరీ!... ఆ ట్రంకులో వుంది తియ్యి...అమ్మకి తెచ్చిన పట్టు ధోవతి...

కామే—తన కేమీ తేలే దని ఒదినెకి కోపంగా వుం దన్నయ్యా...

పద్మ—కోపా లెందుకూ శాపాలు? ఎదో శాస్త్రం చెప్పినట్లు...ఎవరిమీద ఆపేక్షలుంటే వాళ్లకి తెచ్చుకుంటారు...

హను—దంతపు దువ్వెన తేలేదంటే నీకు మటుకు?

పద్మ—నయం...ఊలుతాడు తేలేకపోయారూ ఓగజం!

కామే—అరి దొంగా!...ఈ చీర లెవరి కన్నయ్యా?...ఇదిగోనమ్మా ఒదినా. రెండు చీరలూ ఒకేరకం...

పద్మ—చెప్పారు కాదేం?......జరీ అంచు వేశా?...జాకెట్టుగుడ్డో మరి?...పూలదే కదూ?

హను—అరెరె! లైటపడిపోయిందే? కాస్సేపు ఉడికిలిద్దా మనుకుంటేను?...

పద్మ—ఇక్కడ ఉడికిలేవా రెవరూ లేరు...

హను—ఇప్పు డేమనుకుంటే ఏం లాభం?... ఒక్క గడియసేపు మా చెల్లెలు పెట్టె తెరవకుండా వుంటే తెలిసేది, ఉడికిలేవా ళ్లుండేదీ లేనిదీ...

కామే—పెట్టెనిండా అన్నీ కొత్త బట్టలే!... లాగూలూ, చొక్కాలూ, గౌనులూకూడా కుట్టించుకునే ఒచ్చావే!...

హను—మరే...పండగకి సర్గా యిస్తారో యివ్వరో, యిక్కడ మిషినీవాళ్ళని...కుట్టినవే కొనుక్కొచ్చా...

(పిల్లలంతా "చొక్కా, లాగూ, గౌనూ, పరికిణీ" అంటూ పెట్టెచుట్టూ మూగుతారు)

హను—మీదపడరాదు...ఇప్పుడేమీ ముట్టుకో వద్దు...పండక్కి అవన్నీను...

అన్న—ఇహ లేవండి దుకాణం కట్టిపెట్టి... స్నానం చెయ్యి అబ్బాయి...కాఫీ చల్లారిపోతుంది...



## మొదటి చాళుక్యభీమమహారాజు

# శ్రీ సీసలి తామ్రశాసనము*

— శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ —

### మూలము †

మొదటి రేకు: రెండవప్రక్క

1. ఓం॥ లక్ష్మీజాని రశేష [వైరి]భయదా కౌమోదకీ యత్కరే [।*] యద్వక్ష
స్థలసంగ్గ[మంగ్గల][1]

2. తరం భాస్వత్ప్రభం కౌస్తుభం । యద్బాణాసనశా [ం*]ర్గ్గనిర్గ్గతశరప్రో
తాంగ్గరక్షోంగ్గనా [2] [।*] దా

3. స్యోవాకసదాం భవన్తి భవతో నారాయణః పాతు నః॥ [౧*] స్వస్తి [।*]
శ్రీమతాం సకల[భువ]

---

* ఈ శాసనమును సంపాదించి యిచ్చుటలో తోడ్పడిన శ్రీ జోస్యుల వేంకటేశ్వరులుగారికిని, శ్రీ కాశీభట్ల నరసింహమూర్తి గారికిని, శాసనపు రేకుల నిచ్చిన సీసలిగ్రామకాపురస్థులు శ్రీ గనేశ్న కాశీరావు, సత్యనారాయణ సోదరులకును నా వందనములు.

శాసనమును చదివి ఒక రీతిగ శాసనపాఠమును కుదుర్చుకొని రేకులకు ప్రతిబింబములు తీసి వాటిని మరల శ్రీ వేంకటేశ్వరులుగారి ద్వారా శ్రీ గనేశ్న సోదరులకు పంపివేసినాను. అక్షరములు లోతుగ చెక్కబడుట వల్లను, అచ్చుసిరా కాగితములు మంచివి కాకపోవుటవల్లను ప్రతిబింబములు చక్కగా రాలేదు. అయినను వాటిని ప్రకటించుట నా ధర్మము, అవశ్యకము కూడను. అవి దగ్గర లేవు; విశాఖపట్టణములో ఉండిపోయినవి. అందువల్ల వాటి నిప్పుడు ప్రకటింప వీలులేకపోయినది. వాటిని ముందు భారతిలో విడిగా ప్రకటింతును. ఈ శాసన ప్రకటన సందర్భమున రేకులు దగ్గర లేకపోవుట చేతను, ప్రతిబింబములు సరిగ రాకపోవుటచేతను శాసన పాఠమును చక్కగా పునః పరీక్షింప వీలుకాలేదు. అక్కడక్కడ ఒకటి రెండక్షరముల నిర్ణయమున తప్పులు దొర్లిన శాసనపరిశోధకులు క్షమింతురుగాక !

శాసనము ప్రకటించుటలో కాలవిలంబమైనది. దానికి దురాగ్రహావేశపూరితులై, శాసనసంపాదనమున తోడ్పడిన శ్రీ వేంకటేశ్వరులుగారు ఒక ఉత్తరము వ్రాసినారు. మర్యాద, వివేకపరిజ్ఞానము తెలిసినవారు వ్రాయదగిన ఉత్తరము కాదది. వారు దానిలో ఏవేవో ధర్మపన్నాలు ఏకరువు పెట్టినారు. శాసనపరిశోధన కృషికి నాకు ముట్టుచున్న ప్రతిఫల మిది. ఈ భారతిలోనే శాసనప్రకటనసందర్భమునగాని, 'నా శాసన పరిశోధనోదంతము-చారిత్రకకృషి' అని నేను ప్రకటనమునిమిత్తము వ్రాయుచున్న వ్యాసములలోగాని శ్రీ వేంకటేశ్వరులుగారి ఉత్తరమును, దానికి నా సమాధానమును ప్రకటింపగలను.

† నాదగ్గఱకు వచ్చిన రేకుల ననుసరించి.

1. 'సంగ[మంగల]' అని యుండవలెను.

2. 'యద్బాణాసనశార్ఙ్గనిర్గతశరప్రోతాంగరక్షోంగనా' అని యుండవలెను.

4. సనంస్తూయమాన మానవ్యసగోత్రాణాం హారీతిపుత్రాణాం కౌశికీవరప్రసాద లబ్ధరా

5. జ్యానా(ం) మ్మా[తృ]గణపరిపాలితానాం స్వామిమహాసేనపాదానుధ్యాతా నాం [భగవ]

6. న్నారాయణ ప్రసాద సమాసాదిత వరవరాహలాఞ్ఛనేక్షణక్షణవశీ [కృ]తా

7. రాతిమణ్డలానా మశ్వమేధావభృథస్నాన పవిత్రీకృత[3] వపుషాం చాలుక్యానాం కుల మల[ం]క

8. రిష్ణోః [।*] [స త్యాశ్ర]యవల్లభస్య భ్రాతాష్టాదశవత్సరా [।*] సభూత్పూ ర్వఞ్ం[4] కుబ్జవిష్ణువ[ర్ధన]

9. నో[5] వేంగీవల్లభః [॥౨[6]*] జయసింహవల్లభో భూత్త్రిం[శతం త్రి][శ*]సం యతాం। తద్భ్రాతేన్ద్రాఖ్య

రెండవ రేకు: మొదటి ప్రక్క

10. భట్టారో రాజా సప్తదినా సభూత్[1]।[।3*] సవాబ్దా న్విష్ణురాజో తో జజ్ఞే మంగి యువరాజః[2][।*] [ప*]

11. [ంచ] వింశతి మంతో భూత్[3] (।) జయసింహ స్త్రయోదశ। [।*ర][ద్వైమా] తు రానుజన్తస్య షణ్మాస నొక్కి

12. లి[4]ప్ర[భు]ః। యుద్ధే స్వానుజ ముచ్చాట్య విష్ణురాజ [స్త]దగ్రజః।[।౫*] సప్త త్రింశత్సమా జజ్ఞే

13. త్ప్రజానన్దకర స్వయం[5]।తత ఆసీ ద్విజయాదిత్యో[6] రాజాష్టాదశ వత్సరాన్ ।[।౬*] తతో

14. భూద్విష్ణురాజః[7] షట్త్రింశత మిలేశ్వరః। తత్పుత్రో విజయాదిత్యశ్చత్వారింశత్స

3. 'పవిత్రీకృత' అని చదువవలెను.
4. 'భ్రాతాష్టాదశవత్సరాణ్ [।] అభూ త్పూర్వఞ్ం' అని చదువవలెను.
5. 'వర్ధనో వేంగీవల్లభః' అని.
6. ఇక్కడినుండి ౯ వఱకు అనుష్టుభు శ్లోకములు.

1. 'దినా న్యభూత్' అని చదువవలెను.
2. శ్లోకమునడక సరిగాలేదు.
3. '[ప*][ంచ]వింశతి మత్రాభూత్' అని చదువవలెను.
4. 'షణ్మాసా న్కొక్కిలి' అని.
5. 'ప్రజానన్దకర స్స్వయం' అని.
6. 'తత్రాసీ ద్విజయాదిత్యో' అని.
7. 'తతోభవ ద్విష్ణురాజః' అని.

15. మా న్పృశః।[।౭*] గంగ్గ రట్ట బలాభ్యాం రణో యుద్ధ్వా నిర్జ్జిత్య[8] తద్బలే। శివాలయానష్టశత[9]క్రృ

16. తవా న్యుద్ధసంఖ్య[యా]।[।౮*] [సార్ద్ధసంవ]త్సరస్తస్య సుత శ్రీ విష్ణు వర్ద్ధనః[10] [।*] [చ]తుర్బ్భిర్ వ్వ్యర్జ

17. యాదిత్యశ్చత్వా[రింశత] . స్య . . ।[।౯*][11] తదనుజయువరాజా ద్విక్ర మాదిత్యనామ్నః।

18. ప్రభూరభవ దరాతివ్రా [త] తూలానిలోఘః[12] [।*] [నిరుప]మనృప భీమః భీమసేన

రెండవ రేకు : రెండవ ప్రక్క

19. ప్రతాపో [।*] నిజగుణగణకీర్త్తివ్యాప్తదిక్చక్రవాలః[1][॥౧౦*] యత్కో పానల[దీపి]తంరిపు

20. కులంనిమ్మూర్ళల[2] మున్మూలితం [।*] నిత్యం యత్పరిపాలితాపి వసుధా సూ [తే]మనోవాంచ్ఛితం[3][।*] యస్మి

21. న్నాశ్రి జనా శ్చకాసతి భృశం యద్వక్షసి శ్రీ శ్చిరం[।*] తిష్ఠ త్యాదిమ హీప[సంగ్గమ[4]]ఃరివాదా

22. పహారార్త్థినీ[5]సీ। [।౧౧*] అపిచ [॥*] ఆహారః ఫలమూలశాకశకునిః భృత్యాః కురంగాదయోః [।*] స్త్రియ్యర్ణం[6]

23. చ్ఛన్తరువల్కలాని గృహాభూవ్వాసాంసి మూలన్తరోః[7] [।*] అద్రిశ్రేణి నముద్రభూషు [వ]

24. నతాం దాయాదకానా మభూ [।*] న్నిత్యం యన్నయవత్మరోష దహనజ్వాలా[వలీఢా]త్మనామ్[8]।[।౧౨*]

---

8. 'యుద్ధ్వా నిర్జిత్య' అని.
9. 'శివాలయా నష్టశతం' అని.
10. 'సార్ధసంవత్సరం తస్య సుత శ్రీ విష్ణువర్ధనః' అని.
11. ఇక్కడిలో అన ష్టుభులు అఖరు.
12. 'తూలానిలౌఘః' అని చదువవలెను.

1. మాలినీ వృత్తము.
2. 'నిమూలాల' అని చదువవలెను.
3. 'వాంఛితం' అని.
4. 'సంగమ' అని.
5. 'హారార్థినీ' అని. శార్దూలవిక్రీడితము.
6. 'కురంగాదయ। స్త్రియర్ణంచ' అని.
7. 'వాసాంసి మూలం తరోః' అని.
8. శార్దూలవిక్రీడితము.

25. అపిచ [॥*] మార్గ్గే మార్గ్గే[9] సదాహో నిజశిరసి వహ న్నాతపత్రా[ణ*] [హే]తుం [।*] ప్లాక్షీ ముత్పర్ణ్నా[10]శా

26. ఖాం కృశతను రబల శ్శీర్ణ్ణ[11] వస్త్రే దధానః [।*] దిగ్భ్రాన్తో[11a] భీతభీతః [కమక?]ణి[క?][బ్రై*?[12]] [ల్లీ][స్త*] [హస్తో]

27. దరాస్యః [।*] ఖంజన్ముత్పీడితాంగ[13]శ్చరతి మరువనే యస్య దా[యా]ద [వర్గ్గః][14]।[।౧౩*] [15]యశ్చ [శివ]

మూడవరేకు : మొదటి ప్రక్క

28. ఇవ శక్తిత్రయసంపాదితమహానుభావ[ః*] సక[లజనవన్దనీ]యో౽ స విషమ[వి]

29. లోచనః మురారి రివ లక్ష్మీసంలక్షితవక్షస్థలో౽[పి న మ]లినతనుః [పద్మ నద్మేవ సా]

30. మప్రయోగ సంపాధిత స్వర్గ్గాపవర్గ్గా[1]త్మభోగో౽పి[2]. [లక్షితజన్మా] . . [కరీ[3]వాన]

31. వరత ప్రవృత్తదాన సంచారిత కరో౽పి న పరాంకుశ[నివారణీయః మేరురి] [వ*]వి

32. బుధజనోపసేవ్యమానపాదచ్ఛాయః[4] మహో[ద*][ధిరి]వ గాం[భీర్య్యా[5]] గుణా

33. లంకృత [।*]స్స సర్వ్వలోకాశ్రయ శ్రీవిష్ణువర్ద్ధనమహా[రాజాధిరాజ] పరమేశ్వర ప

34. రమభట్టారకః పరమబ్రహ్మణ్యః పావునవారవిషయ[నివాసినో రా]ష్ట్ర కూట ప్ర

---

9. 'మార్గే మార్గే' అని.
10. 'ముత్పర్ణా' అని.
11. 'శీర్ణా' అని.
11-a. 'దిఙ్మూఢో' అని.
12. 'కమకణికబ్రైః' అను పాఠము సరియైనది కాదని తోచును. ఇక్కడ ఛందస్సు పోయినది. ఒక లఘువు ఉండవలెను. సరిగా అర్థముకూడ నగుటలేదు.
13. 'ఖంజత్ముత్పీడితాంగ' అని.
14. 'వర్గః' అని. ఇది స్రగ్ధర.
15. ఇచటినుండి గద్య.

1. 'స్వర్గాపవర్గా' అని.
2. ఇచ్చటి యక్షరము సరిగా తెలియుటలేదు.
3. 'కరీ'కి పూర్వపు రెండక్షరములు 'మద' కావచ్చును. అప్పుడు 'మదకరీవాన' అగును.
4. 'పాదచ్ఛాయః' అని.
5. 'గాంభీర్యా' అని. రేఫముతో వచ్చు హల్లుల నిట్లే సంస్కరించుకొనవలెను.

35. ముఖా న్సర్వా నేవ[6] కుటుంబినః సమాహూయేత్థ మాజ్ఞాపయతి[।*] విదిత మస్తు వః [।।*] మ

36. త్స్వత్రో రిపుకుంభికుంభదలనప్రోన్ముక్తముక్తాఫల[।*][జో.?]తి[7]భా సుర [ఖ*] డ్గరక్షిత[జ?*][8]

## మూడవరేకు : రెండవ ప్రక్క

37. గతో ల్లోక్యా నె[1]గల్లాధిప[ః।*] చాలుక్యాన్వయ పద్మినీ వికసనో దాయాద బృన్దారక[।*] ధ్వాన్తౌఘా

38. న్తకృదూర్జిత స్స విజయాదిత్యప్రతాపోన్నతః[2] [।।౧౪*] అపిచ॥ గంగా యేన వినిర్జితా జన

39. పద స్త్యక్త్వా వనాన్తం గతాః [।*] కాలింగాః కరవాల ఘాతనిహతా నిశ్శే షితాః సంయుగే।

40. పాణ్డ్యాః పల్లవ చోల కేరల నృపాః యత్పాద[3]పద్మం సదా[।*] సేవన్తే శతశః స్సముద్రవి

41. సరన్నానామణిప్రాభృతైః[4]।[।౧౫*] కించ్చ[5]।[।*] శైశవాబద్ధజఘనమణి య్యస్యాసిదా

42. రితః[6][।*] గరులస్యాహివ తత్రతు[ః*] ప్రుత్వా యన్నామ లీయ్యతే[7]।[।౧౬ *] యశ్చ రూపేణ

43. మనసిజః ప్రతాపే నాదిత్యః కోపేన యమః దానేన కర్ణః మానేన దుర్యోధనః శౌ

44. ర్యేణ ధనంజ్జయః ధనేన[8]।ధనదః[।*] ప్రజ్ఞయా సురగురు స్నృపాణా మాసీత్।[।*] హరి

---

6. 'ప్రముఖాన్ సర్వానేవ' అని.

7. 'ముక్తాఫల' తరువాతి యక్షరము సరిగా తెలియవచ్చుటలేదు. ఇది సంయుక్తాక్షరము. 'జ్యో' కాదగునేమో.

8. ఈ పంక్తి చివరి యక్షరమును సరిగా తెలియవచ్చుటలేదు. అది 'జ' కాదగునేమో.

1. 'జగతోల్లోక్యా నె' సరిగా అర్థమగుటలేదు.

2. శార్దూలవిక్రీడితము.

3. 'యత్పాద' అని చదువవలెను.

4. 'శతశ స్సముద్రవిసరన్నానామణిప్రాభృతైః' అని చదువవలెను.

5. 'కించ' అని.

6. 'యస్యాసీదారకః' అని చదువవలెను.

7. అనుష్టుభు.

8. ఇచ్చటి నిలుపుగీతు అనవసరము.

45. తగో[త్రాం]బరభూషణం కృతి[9][।*] ద్విజాతితేజో జయా[10]వృత్తమణ్డలః[।*] సదోదయో [జ]

నాలుగవ రేఖ : మొదటి ప్రక్క

46. న్నయభట్ట సోమపో[।*]జని త్రయీమూర్త్తి రుదారదర్శనః[1][॥౧౭*] పద్మాసన ప్ర[తీతః పద్మాస]

47. ననిర్మిత శాఖిలామ్నాయః[।*] బ్రహ్మేవ తస్య సూను ర్విద్యేయభట్టో [జనిష్ట శిష్టనతః][2] [॥*౧౮]

48. విద్యామయస్య తనయ స్తదవాప్తవిద్యో [।*]ఽపి [సర్వజ్ఞ] నప్రణుత సత్యమతి ప్ర[శస్తః]

49. [ః] [।*] [చా]లుక్యవంశగురు రాత్మకులాభివృద్ధ్యై[।*] ల్లోక [కో] [పకా*]రనిరతో[3]జని వెన్నమార్యః[4]।[।౧౯*]

50. [యా] శ్చ [॥*] వాగ్మి[4a][ప్ర]గల్భస్మృతిమా సమాన[।*]దానీ సదా మానితదణ్డనీతిః[।] వృద్ధో

51. పదేశస్మృతిమా న్గుణజ్ఞః [।*] పరోపకారీ వినయోపపన్న[ః*[5]]॥ ౨౦*॥] కించ [।*] శతమఖపుర

52. పౌర[6]రంజకోద్య [।*] ద్ధుతమఖస న్తతిక పవిత్రితాత్మ[7] [।*] గుణగణమణి ధామ ధామ ధీ

53. మా[8][।*] న్సకళకలాగమవేదశాస్త్ర రాశిః[9]।[।౨౧*] పున్యాహ[10]దాన యాగేషు ప్రక్షాలిత పదా

---

9. 'కృతీ' అని.

10. 'తేజో జయి' అని యుండవలెను.

1. వంశస్థవృత్తము.

2. ఆర్య.

3. 'లోకోపకారనిరతో' అని చదువవలెను.

4. వసంతతిలకము.

4-a. 'వాగ్మీ' అని.

5. ఉపజాతి.

6. 'పౌర' అని యుండవలెను.

7. 'పవిత్రితాత్మా' అని.

8. 'గుణగణమణిధామధామ ధీమాన్' అని.

9. పృథ్వీశాగ్ర.

10. 'పుణ్యాహ' అని చదువవలెను.

54. ంభసా[।*] యద్గ్రిహోద్గత[11]ః ఖిల్ల[ః*] పావనో నార్ద్రితాం జహౌ[12]॥[౧౨*]
యద్గ్రిహోప[13]వ

నాలుగవ రేకు : రెండవ ప్రక్క.

55. [నా]లీన మత్త భ్రమరఝుంకృతైః[।*] [పఠద్వ]టుత్రయీఘో [ష] ప్రతి
ధ్వని రి వాబభౌ[1] [॥*౧౩]

56. యద్గ్రిహాంగణసంలగ్న పంజర[స్థాసు] శుకావలీ[2] [।*] త్రయీ[క్ర] మ
[స్ఖల]ద్వ[చో।*] వటూ

57. న్నమ్యగపీపఠత్[3]।[।౧౪*] బపి న ఇవ వాచామీశ్వరో[4] రాఘవస్య[।*]
[ప్రియ]హిత ఇ

58. వ నిత్యం సత్యధర్మార్ వశిష్ఠః[।*] అజని సుగురు రామ్యోర్వార్యర్వ
వీర్యస్య

59. ధీమా[।*] న్నకలగుణగణేశ[ః*] సత్యరత్నాధ(?)రస్య[5]॥[౧౫*] తస్మై
శిష్యపదంగతే

60. స విజయాదిత్యేన విప్రాత్మనా [।*] ప్రాదా [త్*] ప్రార్థిత మాదువాడ
సహి[త ]

61. చీంచెల్లి మథ్యర్థితః[6] [।*] భీమో భానిధి రుత్తరాయణతిథౌ [గృత్వా]
నమస్నా న్క[రాన్] [।*] అగ్రా

62. హార మశేషసస్యసరణీశాలీక్షువాటోత్తమమ్।[7] [।౧౬*] అన్య సమీప
గ్రామాః పూర్వ

---

11. 'యద్గృహోద్గత' అని.

12. 'జహౌ' అని యుండవలెను. ఇది అనుష్టుభు.

13. 'యద్గృహోప' అని యుండవలెను. వట్రుసుడికి బదులుగా కొన్ని రెండల హల్లుకు శేషమును, ఇకారమును ఇచ్చుట మన పూర్వులలో వాడుక.

1. అనుష్టుభు.

2. 'యద్గృహాంగణసంలగ్నపంజర[స్థా శు]కావలీ' అని చదువవలెను.

3. అనుష్టుభు.

4. 'బృహస్పతి ఇంద్రునికి వలెను' అని యర్థము. ఇంద్రవాచకమైన పదములోని మొదటి యక్షరమును మూడవయక్షరమును పోయినవి. మూడవయక్షరమున కిచ్చిన ఇత్వము మాత్రము గనబడుచున్నది.

5. 'సత్యరత్నాకరోస్య' అని యుండదగునేమో. 'రత్నా' తరువాతి యక్షరము 'ధ' వలె గానవచ్చుచున్నది. ఇది మాలినీ వృత్తము.

6. 'మభ్యర్థితః' అని యుండదగును. 'ర్థి' సరిగా తెలియవచ్చుట లేదు.

7. శార్దూలవిక్రీడితము.

63. [తః] దప్పణాపూణ్డి [॥*] దక్షిణతః పయిచెఱువులు[8] [।*] పశ్చిమతః ల్లవపురము[9] [।*] ఉత్త

## అయిదవ రేకు : మొదటి ప్రక్క

64. రతః కొణ్డుకపుండి[1] [॥*] యవుఱు[2] క్షేత్రసీమానః [।*] పూర్వణ [త] [ః*] . డుంకెఱువు పూర్వణ సేతుః [।*]

65. ఆగ్నేయతః కారెమికనుమ [।*] దక్షిణతః కల్వకో [డు] [।*] నైరితితః పాం(?)టును [క?*]ల్వకో

66. టియి[3] సంగమః [।*] పశ్చిమతః ద్రోవదిచె[ఱువు] [।*] [వా*]యవ్యతః . . [మావయుం]

67. జించెల్లి కోటిగు సంగమః [।*] ఉత్తరతః త [ల్లింద్ర] [।*] • [శానతః][4] పెద్దపులి

68. యవుటిసీమా॥ అస్యోపరి [నకే][న*]చిద్బాధా క[ర్తవ్యా । యః*] కరోతి [స]

69. పంచభి మ్మహాపాతకై ల్లిణప్యంతే।[।*] త[థా] చ [వ్యాసే*] నో క్తం[॥*] బహు[భి*] వ్వసుధా దత్తా బ

70. హుభి శ్చానుపాలితా [।*] యస్యయస్య [య*] [దాభూ]మి [స్తస్యతస్య తదా] ఫ [లమ్][5]॥ [౧౮*]

71. స్వదత్తాం పరదత్తాం వా యో హ[రే*][త] వ[సున్ధరాం। షష్టిం*] వ [ర్ష] [స*] హస్రాణి విష్టాయాం

72. జాయతే కృమిః[6] [॥౨౮*] ఆజ్ఞప్తి[ః] [కట* [కరా] [జః] [।*] . . జయా చార్యేణ[7] లిఖితం॥

---

8. 'పయిచెఱువులు' అన్నపాఠము సరియైన దగునో కాదో. 'ప' తరువాతి యక్షరము 'యి' వలెనే కన్పట్టుచున్నది. కాలప్రకటన సందర్భమున ఇట్టి పాఠములను గూర్చిన సందేహములను దీర్చుకొనుటకు రేకులు దగ్గఱ లేక పోయినవి.

9. ఈ గ్రామనామములోని మొదటి యక్షరము సరిగా దెలియుటలేదు.

1. 'పూండి' అని చదువవలెను.
2. 'అవూరు' అని సంస్కరించవలెనని తోచుచున్నది.
3. '[క*]ల్వకోటియు' అని యుండవలెను.
4. '[ఐ*]శానతః' అని.
5. అనుష్టుభు.
6. 'క్రిమిః' అని. ఇది అనుష్టుభు.
7. 'జయాచార్యేణ' అన్నదానికి పూర్వము కొన్ని యక్షరములు పోయిన ట్లున్నది.

నేనిదివఱలో ఈ పత్రికలో ప్రకటించిన మూడవ విజయాదిత్యుని సీసలితామ్రశాసనముతో వ్రాసే, అట్టి సందర్భములలోనే ఈ శాసనమును దొరికినది.

## ఆ కా రా ది క ము లు

ఈ శాసనమున ఐదు రేకు లున్నవి. ఒక్కొక రేకు పొడుగు ౯.౨ అంగుళములు; వెడల్పు ౪.౭౫ అంగుళములు. ఈ రేకులను ఒక కడియములో దూర్చి భద్రపరచుటకు ఒక్కొక రేకుకు ఎడమప్రక్క, అంచుకు ౧.౫ అంగుళముల దూరమున .౭ అంగుళము వ్యాసము గల రంధ్ర మున్నది. ఈ రేకులను గుదిగ్రుచ్చియుంచిన కడియము కొంచెము కోలగ నున్నది. దీని వ్యాసము పొడుగు ౫.౬ అంగుళములు; వెడల్పు ౪.౬ అంగుళములు. ఈ కడియమున కతికించియుండు ముద్రిక బంగారమేమోయని పరిశోధించుటకు తెగగొట్టినారు. ఆ ముద్రిక కానరాలేదు. రేకులు మందముగా నుండి అంచులు తీర్చియున్నవి. రేకులమీది యక్షరములు లోతుగను, పొంకముగను చెక్కబడినవి. మొదటి రేకు మొదటి పెడమీదను, చివరి రేకు రెండవ పెడమీదను వ్రాతలేదు. అక్షరములు గుండ్రనివి; పొంకమైనవి. ఇందలి లిపి మూడవ విజయాదిత్యుని శాసనములోని లిపివంటిది కాదు. ఇది గుండ్రలిపి. ఒక్కొక రేకుమీద తొమ్మిది పంక్తుల వ్రాత కలదు. మూడవ విజయాదిత్యుని శాసనపు రేకులవలెనే ఈ రేకులు కూడ పరిశుద్ధము చేయుటలోనో, మరి యే కారణమువల్లనో దెబ్బతిన్నవి; కాని మొత్తముమీద మూడవ విజయాదిత్యుని శాసనమంతగా పాడుకాలేదు. అక్షరము లక్కడక్కడ చెడినప్పటికిని శాసనపాఠము కుదుర్చుకొనుట కెక్కువ శ్రమ అవసరము లేకపోయినది.

## లి పి : భా ష

ఈ శాసనము చెక్కిన విశ్వకర్మకులజాడయిన ఆచారి అక్షరములకు నగిషీ చెక్కి చిత్రలిపివలె చేసి ఇంపుసొంపులు వెలయించుచు దీనిని వ్రాసెను. అక్షరము లందముగా కనబడుటకు శాసనలేఖకుడు తన యిచ్చవచ్చినంత స్వేచ్ఛ తీసికొనెను. అంగములకు పొంకము, సమాంతరరేఖ కుదిరి అక్షర మందముగాను, పంక్తి చిత్రముగాను కనబడుటకు లేఖకుడు అ, ఊ, ఏ, ఓ దీర్ఘముల గుణింతపు గుర్తులు ఒక పద్ధతియు క్రమమును లేకుండ రచించెను. పోలికకు చెప్పవలయు నన్న ఒకవిధముగా నాగార్జునునికొండ ప్రాకృత శాసనలిపిని దీనితో పోల్పవచ్చును. ఆ లిపిలోని అక్షరముల గుణింతమువలెనే ఇందలి యక్షరముల గుణింతము నున్నది.

ఈ శాసనపు లిపి తెలుగు-కన్నడ లిపి. పూర్వచాళుక్య భూపతుల శాసనములలోని లిపి యిదియే; వ్రాత ఘత్తులోను, అక్షరముల తీర్పు తీరువలలోను భేద ముండవచ్చునుగాని అసలు లిపి చాళుక్య శాసనము లన్నిట నొక్కటే. లిపిశాస్త్రజ్ఞులు వేంగీలిపి అని పేరిడిన లిపికి ఇంమక పరిణామరూప మిది. ఈ శాసనము పుట్టునాటికి మన దేశమున పత్రములు వ్రాయుటకు, గ్రంథములు లేఖలు మొదలైనవి వ్రాయుటకు వాడుకలో నుండినది ఈ లిపియే. ఇప్పటి మన లిపి ప్రాచీనరూపము. వందల కొలది సంవత్సరముల నుండి మన యక్షరములు మారి మారి ఇప్పటి రూపములను పొందినవి.

రేకులు చూచిన దెలియును, 'ఆ' దీర్ఘము రెండు రకములుగా నున్నది; ఉదా: 'నారాయణ' (పంక్తి ౩); 'గోత్రాణాం' (పంక్తి ౪)లో 'ణా' దీర్ఘమును. 'ప్రసాదసమాసాదిత' (పంక్తి ౬)లో మొదటి 'సా'ను చివరి 'సా'ను చూడుడు. దీర్ఘము, వలపలిగిలక, పొల్లు—అక్షరము శిరోభాగమున నిలువు గీటువలన జూపబడినవి. వలపలిగిలకకు, పొల్లుకు అంత ఎక్కువ భేదము లేదు. కొన్నిచోట్ల 'ఆ' దీర్ఘపు నిలువు గీటు మిగిలిన గెంటికంటెను కొంచెము హెచ్చుగ నున్నట్లు కన్పట్టును; ఉదా: 'వసుధా' (పంక్తి ౨౦) లోని 'ధా' చూడుడు. 'న' వర్ణపుపొల్లు (న్) చూడుడు (పంక్తి ౧౩). దీనిని ౧౬-వ పంక్తిలోని వలపలిగిలకతో పోల్చిచూడుడు. ఇకారపు గుర్తు గుడి; ఈకారపు గుర్తు గుడిలోపలికి దీర్ఘము (గుడిదీర్ఘము). ఈ దీర్ఘమున కుదాహరణములు: చూడుడు 'శ్రీమతాం' (పంక్తి ౩); 'వశీకృతా' (పంక్తి ౬);

'హారీతి' (పంక్తి ౪); 'శ్రీత్రిణా' (పంక్తి ౧౯) లోని 'త్రిణా' చూడుడు. దీనిలో వలపలిగిలక ఇకారపు గుర్తు తోడించి దీనిని వ్రాసెను. ఇట్లే 'హారార్ధిణీ' (పంక్తి ౨౨) లోని 'ర్ధిణా'ని గమనింపుడు. ఉ, ఊ గుర్తులకు 'శకునిః' (పంక్తి ౨౨); 'తురంగాదయోః' (పంక్తి ౨౨); 'ఋణ' (పంక్తి ౧౯); 'ముత్పన్నాన్' (పంక్తి ౨౫); 'రిపు' (పంక్తి ౩౬); 'ఫలయూల' (పంక్తి ౨౨); 'సూతే' (పంక్తి ౨౦); 'భూషు' (పంక్తి ౨౩); 'వటూణ' (పంక్తి ౫౬). సాధారణముగా ఈ గుర్తులు ఇప్పటివలె అక్షరమునకు కుడిప్రక్కన నిమ్ము కొమ్ములే, కొమ్ముదీర్ఘములే. 'ప', 'మ' వర్ణములకు ఉకారపు గుర్తు అక్షరమునకు దిగువ దాని నంటి యున్నది. ఇట్లే సంయుక్తాక్షరములలో మరికొన్నిటికిని ఉన్నది. 'ఘు' లోని ఉత్వముకొమ్ము ఇప్పటివలె పైకిగాక దిగువకు తిరిగియున్నది. 'వభూ తూర్వర్వాణాం' (పంక్తి ౮) లోని 'భ' వర్ణమునకు 'ఆ' దీర్ఘమును, ఉత్వచిహ్నమును గూడ చేర్చినాడు. 'నిమూర్మణాల' (పంక్తి ౨౦) లోని 'మూర్మణా' చూడుడు. 'మ' వర్ణమును గమనించునది. ఈ 'మూర్మణా' వర్ణమును 'భూర్వాసాంసి' (పంక్తి ౨౩) లోని 'వ్వాణా'తో పోల్చి చూడుడు. 'మ్మూణా'లోని 'మ' వర్ణపు ఊ గుర్తును ద్విత్వమకారమునకు తగిల్చినాడు. ఈ విధముననే 'మునమ్మూలితం' (పంక్తి ౨౦) లోని ఊ దీర్ఘము 'న' వర్ణమునకుగాక సంయుక్తాక్షరమయిన 'మ' వర్ణమున కతికించెను. 'ఋ'కారపు గుర్తుకు 'బృన్దారక' (పంక్తి ౩౭), 'నృపాః' (పంక్తి ౪౦) అనునవి చూడుడు. 'బృన్దారక'లోని 'బృ'ను 'బుధజనోప' (పంక్తి ౩౨) లోని 'బు'తో పోల్చిచూచి బు, బృలకు గల వ్యత్యాసమును గమనించునది. హల్లులకు ఎ, ఏల గుర్తు ఇప్పటివలె ఎడమప్రక్కకుగాక కుడిప్రక్కన కీయబడెను; అదియునుగాక నాడు ఈగుర్తులు అక్షరము శిరోభాగముననే యుండవలెనను నియమము లేదు. ఇవి యొకప్పుడు అక్షరము ఊర్ధ్వభాగముననూ, వే రొకప్పుడు అధోభాగముననుగూడ నీయబడినవి. అక్షరమున ఊర్ధ్వమునను, అధోభాగమునను గూడ 'ఏ' గుర్తు హల్లుకు తగిలించినచో ఐత్వ మేర్పడును. ఉదా: 'శేరలనృపాః' (పంక్తి ౪౦); 'సేవ్యమాన' (పంక్తి ౩౨); 'హూపేణ' (పంక్తి ౪౨); 'వేదశాస్త్ర' (పంక్తి ౫౩); 'శైశవాబద్ధ' (పంక్తి ౪౧); 'ప్రాకృతైః' (పంక్తి ౪౧). అక్షరమునకు శిరోభాగమున 'ఆ' దీర్ఘపుగుర్తును, 'ఏ' గుర్తును ఇచ్చినయెడల 'ఓ' గుర్తగును. చూడుడు: 'ప్రతాపోన్నతః' (పంక్తి ౩౮); 'శోషేన' (పంక్తి ౪౩); 'ఔ'కు చూడుడు: 'శ్రౌ' (పంక్తి ౫౫); 'శౌర్యేణా' (పంక్తి ౪౩-౪౪) ఈ గుణింతపు గుర్తులను హల్వర్ణములకు కలియచేర్చు విధము చూడగా వాటి విషయమున ఇప్పుడు మనము పాటించుచున్న నీతిరీతియము లప్పుడు లేనట్లు తెలియును. అక్షర రమ్యతకొరకు, వ్రాతపంక్తి సుందరముగ గనబడుట కొరకు లేఖకులు ఈ గుణింతపు గుర్తులను దమ యిచ్చవచ్చినట్లు చేర్చుచువచ్చిరి. మన తెలుగు గుణింతపు గుర్తులు ఈ శాసనము పుట్టినపిదప చాలకాలమునకు గాని ఒక నియతికి రాలేదు. మూడవ విజయాదిత్యుని శాసనములోవలెనే ఈ శాసనమునందును రేఫయుక్తములయిన క, గ, జ, త, ధ, మ, య, వ, ణ మొదలైన హల్లులు ద్విత్వము నొందినవి.

శాసనభాష సంస్కృతము. దానము చేసిన గ్రామము పరిహద్దులను దెలుపు సీమలు మాత్రము దేశభాష(తెలుగు)లో నున్నవి. బంగారమని భ్రమపడి శాసనపు రేకులను శాస్త్రీయపద్ధతినిగాక నాటుపద్ధతిని ద్రావకములు పోసి కిలము మొదలైనవి పోగొట్టుటకు ప్రయత్నించుటచేత రేకులకు కొంచెము దెబ్బ తగిలినది. రేకులకంటె వాటిమీద చెక్కిన యక్షరములు చాల ఖిలమయినవి. అందువలన చెడిన యక్షరములను గుర్తించుటలో కొంతశ్రమ కలిగినది. అప్పటికిని కొన్ని యక్షరములను గుర్తింపను, ఊహింపనుగూడ సాధ్యము కాకపోయినది. శాసనపాఠమును సరిదిద్దుటలో నా కత్యంతము సాయపడిన నా పూజ్యమిత్రులు బ్రహ్మశ్రీ దువ్వూరి వేంకటరమణశాస్త్రి గారికి ఇందుమూలమున నా కృతజ్ఞతాపూర్వక వందనములు తెలుపుకొనుచున్నాను. శ్రీ డాక్టరు వి. రాఘవన్‌గారు కూడ శాసనపాఠపరిష్కారమున నాకు దయతో తోడ్పడిరి వారికి నా వందనములు తెలుపుకొనుచున్నాను.

శాసనగ్రంథ మంతయు గద్యపద్యాత్మకమయిన చంపూకావ్యము. పద్యకవిత్వము లలితమై అలంకారయుక్తమై ప్రౌఢమై మనోహరముగ నున్నది. మన శాసనకాలము నాటికి సంస్కృతమున కావ్యరచనా పద్ధతి బాగుగ పరిణతి చెందినది. అదియే దానశాసనములు వ్రాయు మన పూర్వకవులకును వరవడియైనది. మన ఈ శాసనమును జదువుచున్నపుడు మన మెంక సంస్కృతకావ్యమును జదువుచున్నట్లనిపించును. శాసనగ్రంథమును గూడ మనపూర్వులు కావ్య దృష్టితోనే లిఖించిరి. ఈ శాసనమునందును, శాసనకాలము నాటి సంస్కృతకావ్యములందును గన్పట్టు గద్య రీతులే, వర్ణనములే తరువాతి కాలము నాటి మనయాంధ్ర కవులకును కావ్యరచనమున ఆదర్శకము లైనవి. భూమి దానమును రక్షించినందువలన గలుగు ఫలమును, ఇచ్చిన దానమును అపహరించుటవలన గలుగు చెడు ఫలితములును వ్యాసమహర్షి చెప్పినవి మామూలుగ ప్రతి శాసనాంతమున నున్నట్లే దీనిలోను కడపట నున్నవి.

## శా స న వి ష య ము

ఈ శాసనము మనదేశమును పూర్వము రమారమి యైదారు వందల సంవత్సరములపాటు పరిపాలించిన చంద్రవంశక్షత్రియులైన పూర్వ చాళుక్యభూపతులలో ఒక్కడయిన భీమమహారాజు ఇచ్చినది. ఇతనికి చరిత్రమున మొదటి చాళుక్య భీమమహారాజని పేరు. ఇతడు రాజరాజ నరేంద్రుని పూర్వుడు.

శాసనగ్రంథము విష్ణుపరముగ జెప్పిన మంగళశ్లోకముతో ఆరంభమగుచున్నది. తరువాత మూడవ పంక్తినుండి ఎనిమిదవ పంక్తివఱకు పూర్వచాళుక్య వంశజుల కులప్రశస్తి. అటుపిదపనుండి పూర్వచాళుక్య రాజవంశావతారవర్ణనము. ఈ వర్ణనము గద్య పద్యాత్మక మైనది. ఇందు అనుష్టుభు, ఆర్యా శ్లోకము లే కాక శాసనకవి శార్దూలవిక్రీడితము, స్రగ్ధర, మాలిని, వంశస్థము, వసంతతిలకము, ఉపజాతి, పుష్పితాగ్ర వృత్తములను గూడ వాడినాడు. పూర్వచాళుక్యుల మూలపురుషుడు కుబ్జ విష్ణువర్ధనుడు. చాళుక్యశాసనము లన్నియు తమ వంశమును ఈ మహారాజునుండియే వర్ణించును. సత్యాశ్రయవల్లభుని సోదరుడైన కుబ్జ విష్ణువర్ధనుడు పదునెన్మిదేండ్లు ఏలినపిదప జయసింహవల్లభుడు సింహాసన మెక్కి ముప్పది మూడేండ్లు పాలించెను. అతని యనుజుడు ఇంద్రభట్టారకుడు ఏలినది ఏడు రోజుల కాలము. అనంతరము విష్ణురాజు పాలించినది తొమ్మిదేండ్లు. పిదప మంగి యువరాజు ఇరువదియైదు సంవత్సరములు పాలించెను; జయసింహుడు పదుమూడేండ్లు. ఇతని సవతితల్లి కొడుకు కొక్కిలిప్రభువు ఆఱు నెలలు. యుద్ధములో దన యనుజుడు కొక్కిలిని వెళ్ళగొట్టి అతని యగ్రజుడు (మూడవ) విష్ణురాజు ముప్పది యేడేండ్లు ప్రజానందకరుడై పాలించెను. అటువెనుక (మొదటి) విజయాదిత్యుడు పదునెన్మిదేండ్లు; పిదప (నాల్గవ) విష్ణురాజు ముప్పదియాఱు సంవత్సరము లీలాతిలముగ నేలెను. ఇతని కొడుకు (రెండవ) విజయాదిత్యభూపతి నలువది సంవత్సరములు పాలించెను. ఇతడు పెక్కు యుద్ధములలో గంగరాజుల రట్టరాజుల సేనలను జయించి, యుద్ధములు జరిగినచోట్ల యుద్ధసంఖ్యకు సరిపడిన నూటయెనిమిది శివాలయములు కట్టించెను. ఇతని కుమారుడు (అయిదవ) విష్ణువర్ధనుడు సార్ధసంవత్సరము పాలించెను. ఇతని పుత్రుడు (మూడవ) విజయాదిత్య నృపుడు నలువదినాలుగేండ్లు. ఇతని యనుజుడు యువరాజ విక్రమాదిత్యునికి పుట్టిన ప్రభువు భీమసేన ప్రతాపుడైన భీమరాజు (పంక్తులు ౮-౧౯). శాసనమున ౧౯-వ పంక్తినుండి యీ భీమమహారాజువర్ణనము. ఇతడు కావ్యమున కథానాయకుడు వర్ణింపబడునట్లు వర్ణితుడయ్యెను. ఈ వర్ణనమున మనకు దెలియవచ్చు చరిత్ర విశేషము లేవియు లేవు. అతిశయోక్తులతోను, అలంకారములతోను గల యీతని సువర్ణనము పదునైదు పంక్తులు, అనగా ముప్పదినాలుగవ పంక్తివరకు నున్నది. ఈ మహారాజు తన దాయాదులను జయించె ననియు, తన శత్రుసమూహమును నిర్జించె ననియు, అతని ప్రతాపము అతిలోకమై శత్రుజనదుస్సహ మయ్యె ననియు దక్క మనకీ వర్ణనమువలన ఏ విశేషములును దెలియరావు. సర్వలోకాశ్రయ శ్రీ విష్ణువర్ధనుడును, మహారాజాధిరాజును, రాజపరమేశ్వరుడును, పరమభట్టారకుడును, పరమబ్రహ్మణ్యుడును అయిన ఈ భీమమహా

రాజు పావుకవారవిష యనివాసులను, రాష్ట్రకూట ప్రముఖులు నైన కుటుంబుల నందరిని ఆహ్వానించి ఈ విధమున ఆజ్ఞాపించుచున్నాడు (పంక్తులు ౩౪-౩౫). ఇంతటినుంచి (మొదటి) చాళుక్య భీమమహారాజు కుమారుడు (బాలుగవ) విజయాదిత్యుని గుణవర్ణనము (పంక్తులు ౩౫-౪౪). ఈ విజయాదిత్యునికి అరుక్కుడు (?) అని, ఆకెనగల్లాధిపుడు అని బిరుదములు కలవు. ఇతడు గంగవంశపు రాజులను నిర్జించెను; కాళింగులను (కళింగదేశవాసులను) యుద్ధమున నిశ్శేషము కావించెను. పాండ్య, పల్లవ, చోళ, కేరళ నృపతులు ఎల్లప్పుడును ఈ విజయాదిత్యరాజకుమారుని నానామణి ప్రాభృతములను ఇచ్చి అనేకవిధముల సంసేవించుచుందురు. ఇక మిగిలిన వర్ణనమున చారిత్రక విశేషము లేవియు లేవు.

అటువెనుక దానమును పరిగ్రహించిన ప్రతిగ్రహీతృవర్ణనము (పంక్తులు ౪౪-౫౯). ఉదారదర్శనుడును, త్రయీమూర్తియు అయిన [జ]న్నియభట్ట సోమయాజి హారితసగోత్రాంబరమునకు భూషణము. ఇతని కుమారుడు విద్దెయభట్టు. ఇతడు బ్రహ్మకల్పుడు; చతుర్వేదములు తెలిసినవాడు. ఇతని పుత్రుడు వెన్నమార్యుడు. ఇతడు చాళుక్యవంశగురువు. లోకోపకారనిరతుడు; వినయోపపన్నుడు; 'వాగ్మి'; దండనీతి యెఱిగినవాడు; సకలకలాగమవేదశాస్త్రరాశి. బృహస్పతి ఇంద్రునికివలెను, సత్యధర్ముడైన వసిష్ఠుడు రాఘవునికి వలెను ఇతడు విజయాదిత్యునికి గురు వయ్యెను.

విప్రాత్ముడైన విజయాదిత్యరాజకుమారుడు శిష్యపదమును పొందినపుడు తన తండ్రిని ప్రార్థింపగా భీమమహారాజు అతని గురువయిన వెన్నమార్యునికి ఆరువాడతోగూడిన చీంచెల్లి గ్రామమును ఉత్తరాయణ పుణ్యకాలమున సమస్తములైన పన్నులను తీసివేసి అగ్రహారముచేసి యొసగెను. ఈ యగ్రహారము 'అశేషసస్యసరణీశాలితుష్వాటికాలతో' ఉత్తమమైన గ్రామమట. అనగా వరి పంట పండు చేలు, చెఱకుతోటలు గలిగి అన్ని సస్యములకు ఇరవయినదట (పంక్తులు ౫౯-౬౨). చీంచెల్లిగ్రామమును చాళుక్య భీమ మహారాజు తన కుమారుడైన విజయాదిత్యుని ప్రార్థనమీద అతని గురువయిన వెన్నయార్యుని కగ్రహారము చేసి యిచ్చెనను విషయమును దెలుపుటకే ఈ శాసనము పుట్టినది.

అటువెనుక దాన మిచ్చిన గ్రామమునకు పరిహద్దులు తెలుపబడినవి (పంక్తులు ౬౨-౬౭). ఈ తెలిపిన గ్రామములు చీంచెల్లికి సమీపమున నున్నవట. చీంచెల్లికి తూర్పున దర్పపూండి; దక్షిణమున వయిచెఱువులు; పశ్చిమము నల్లవపురము; ఉత్తరమున కొండుకపూండి. ఆ వూరు క్షేత్రసీమలు: తూర్పున దుంతెఱువు తూర్పుగట్టు; ఆగ్నేయమున కారెమికనుమ; దక్షిణమున కల్వకోడు; నైరృతిదిశను పాం (?) టును [క* ?]ల్వకోడును కలసిన ప్రదేశము; పడమట ద్రోవది చెఱువు; వాయవ్యమున [డావయు] - చీంచెల్లి కోడును గలసిన ప్రదేశము; ఉత్తరమున త[ల్లింద్ర]; ఈశాన్యమున పెద్దపులి యవుటిసీమ.

తరువాత వ్యాసశ్లోకములు (పంక్తులు ౬౭-౭౨).

ఈ శాసనమునకు ఆజ్ఞప్తి కటకరాజు. ఈ దానమును అమలుజరుపువానికి ఆజ్ఞప్తి యని పేరు; మహారాజాజ్ఞ పరిపాలించువాడు. శాసనలేఖకుడు, అనగా ప్రాయికముగా ఈ శాసనమును తామ్రఫలకములమీద చెక్కిన విశ్వకర్మకులజుడు...జయాచార్యుడు. ఈ పేరుకు ముందు కొన్ని యక్షరములు పోవుటవలన ఈ పేరు సరియైనదేనా, లేక దీనికి ముందు ఉపపదమేదైన నుండెనా యని సంశయము కలుగుచున్నది. [సశేషము]



# ప్రాచీన రంగస్థలం

•

## శ్రీ తుమ్మలపల్లి వెంకటసీతారామరావు

ఒక వస్తువులోని భిన్న భాగాల ఏర్పాటు శాస్త్రం. భిన్న పదార్థాల్ని ఒకచోట చేకూర్చేది కళ. ప్రాచీనులు ఈ రహస్యాన్ని గుర్తించి భిన్న కళల లోతులు తరచిచూచి పరిపూర్ణమైన కళను సృష్టించ ప్రయత్నం చేసి కృతకృత్యులైనారు. వాచిక, ఆంగిక, అభినయాదుల సమ్మేళనమే నాటకం. నాటకానికి రంగస్థలం హృదయం. నటులు అంగాలు. భిన్న అభిరుచులు గల ప్రజాబాహుళ్యాన్ని ఆకర్షించగల శక్తి నాటకానికి వుంది.

రంగస్థలం ప్రాచీనకాలంనుంచీ భారతీయుల విజ్ఞానవినోదాలకు ఆస్థానమైంది. జీవితాన్ని కళాదృష్టితో గడిపారు మన పూర్వీకులు. మనకు దైవికాల్లో విశ్వాసం అధికం. కనుకనే మనశ్శాంతిలక్ష్యం తక్కువ. జీవితలక్ష్యం ఆముష్మికం. ప్రకృతిసౌందర్యావలోకనం చిత్తశుద్ధికి నిదానం అని ప్రాచీనసిద్ధాంతం. భారతీయజీవితాదర్శం త్యాగం. ఈ మహోన్నతాదర్శం కళావిన్యాసముల్లో రూపొందుతూంది.

సంస్కృతనాటకలక్షణగ్రంథాలు రంగస్థల పురాణపౌన్నత్యాన్ని తెలుపుతూన్నాయి. వీటిల్లో పురాతనమైనది భోజరాజు రచియించిన 'సమరాంగణ సూత్రధార' అనే రంగస్థలశిల్పశాస్త్రం. ఆకాలంలో మూడువిధాలైన నాటకశాలలున్నాయి. గంధర్వ ప్రాసాదం, ప్రేక్షకప్రాసాదం, సంగీతప్రాసాదం అని నామకరణం చేశారు వాటికి లాక్షణికులు. వీటిలో నృత్యగాననాటకప్రదర్శనములు జరుపబడుతవి. ప్రేక్షకసంగీతశాలలు, నాట్యభంగిమలు కలిగిన ముగుదల చిత్తరువులతోనూ, వివిధవాద్యములు ధ్వనింప చేస్తూన్నట్టు రచియించిన శైలచిత్రాలతోనూ అలంకరించబడ్డాయి. వాస్తుశాస్త్రాన్ననుసరించి దేవాలయ ప్రాంగణంలోకూడా మంటపాలు నెలకొల్పడం పరిపాటి అయింది. ఈ మంటపాలు క్రమేపి నాట్యప్రదర్శనాలకు వేదికలైనవి. శ్రీకుమారుడు చేసిన 'శిల్పరత్నం' నాట్యమంటపలక్షణాన్ని వివరిస్తూంది. ఈ గ్రంథంప్రతి తిరువాన్కూరుగ్రంథాలయంలో వుంది. నాట్యమంటపం నాలుగు అంగాలుగా విభజించబడింది. రంగభూమి చతురస్రమై నాలుగు స్తంభాలు కలిగియుంటుంది. దీని వెనుకభాగంలో మృదంగమూ, ఇతరవాద్యపరికరాలూ వుంచడానికి స్థలం నిర్ణీతమైంది. భరతాచార్యుడు దీనికి 'రంగశీర్షం' అని పేరుపెట్టాడు. రంగశీర్షానికి వెనుక 'నేపథ్యధామం' వుంటుంది. దీన్నే ఆధునికులు Green Room అని వ్యవహరిస్తున్నారు. ఇక్కడ పాత్రధారులు వేషధారణ చేస్తారు.

నాట్యమంటపం తప్పనిసరిగా గ్రామాల్లోనూ, రాజధానుల్లోనూ కూడా నెలకొల్పబడింది. వర్ణాశ్రమ ధర్మాలనుష్ఠించిన ఆ కాలంలో దైవ, గాంధర్వ, ప్రేక్షకశాలలు ప్రజల సాంఘికరాజకీయమున స్వత్వాలనుబట్టి వాళ్లకు విజ్ఞానవికాసాలు కలిగించినవి. దైవశాలలు భగవంతునికోసం, గాంధర్వశాలలు ప్రజలకోసం, శాస్త్రశాలలు రాజులకోసం ప్రత్యేకించబడినవి. దైవశాలలు దేవాలయాల్లో నిర్మించారు. ఇక్కడి ప్రదర్శనాలు చూట్టానికి దేవతలు రాలేదు. ప్రజలే భక్తిరసప్రధానమైన పౌరాణికప్రదర్శనాలు చూచి ఆనందించారు. శాస్త్రశాలలు రాజప్రాసాదాల్లో మాత్రమే నెలకొల్పబడినవి. అప్పటి రాజులకు వినోదము గుఱ్ఱపుపందేలు కావు—వీరవిహారము, వీరగాథా శ్రవణము. వీరోచితమైన శాస్త్రగాథలు దర్శించి తమ శాస్త్రానికి వాడిపదును పెట్టారు. గంధర్వనాటకశాలలు నగరాల్లో నిర్మించి విద్యావంతులు, రసజ్ఞులైన ప్రజలు నవరసాలు గల వివిధనాటకప్రదర్శనాలు చూచి ఆహ్లాదించారు.

రంగస్థలపరిణామంలో రాజప్రాసాదము తరువాత దేవాలయప్రాంగణాల్లోని నాట్యమంటపము విశేషప్రాధాన్యము వహించింది. ఇక్కడ దేవదాసీలు వివిధనాట్యసంప్రదాయాల ననుసరించి నృత్తనాట్యగానాభినయాలు జరిపే సాంప్రదాయచరిత్ర ప్రసిద్ధమైంది. మహాకవి కాళిదాసు రచించిన మేఘసందేశంలో ఉజ్జయినీనగరంలోని కాళికాలయంలో దేవదాసీల సంధ్యానృత్యం వర్ణించాడు. కల్హణుని 'రాజతరంగిణి'

కూడా [అటువంటి శిష్టనాట్యసంప్రదాయాలను కీర్తిస్తుంటూంది. నాట్యపోషణ ఆనాడు రాజకర్తవ్యాల్లో ఒకటిగా పరిగణించబడింది.

ప్రజాజీవితాన్ని ఆదర్శప్రాయితం చేయటానికి నాటకము బహుళా ఉపకరించింది. కనుకనే రంగస్థలం రాజాదరణాన్ని, ప్రజామోదాన్ని పొంది వర్ధిల్లినది. ప్రేక్షకశాలల అనేక అంతస్తులు కలిగి పెద్ద గవాక్షములతోను, ద్వారములతోను దర్శనీయముగా వుండి. ప్రేక్షకస్థానాలుకూడా వర్ణాల ననుసరించి ఏర్పరిచారు. ఎక్కువ డబ్బు యిచ్చినవారు ముందు కూర్చోవటం అప్పట్లో లేదు. రంగభూమికి సమీపంలో బ్రాహ్మణులకు, పండితులకు, తరువాత క్షత్రియులకు, ఆటుపిమ్మట శూద్రులకు స్థానములు ఏర్పరిచారు. కాని ఈ రోజుల్లో అటువంటి ప్రేక్షకశాల లుండాలని మనలో ఎవరమూ వాంఛించము.

వాసుదేవసూరి రచించిన 'ప్రాసాదలక్షణగ్రంథము' రంగస్థలము యొక్క మహోజ్జ్వల ఔన్నత్యాన్ని తెల్పుతోంది. గ్రామానికి దేవాలయ మెంత అగత్యమో, నాటకశాలకూడా అంత అనివార్య మైనది. ప్రతిగ్రామంలోనూ ఒక్క శారదప్రాసాద ముంటుంది. ఇదే పంథాలో నగరాల్లోనూ, రాజధానుల్లోనూకూడా పెద్ద శారదప్రాసాదాలను నిర్మించారు. గ్రామప్రాసాదానికి రెండు సింహద్వారాలు, మూడు అంతస్తులు వుంటయి. నగరప్రాసాదానికి నాల్గు ముఖద్వారాలు, ఐదు అంతస్తులు ఉంటయి. ఇందులో ప్రేక్షకవర్గానికి గ్యాలరీలుకూడా నిర్మాణం చేయటం మన పూర్వీకులు ఎప్పుడో గ్రహించినట్లు తెలుస్తుంది. నాటకశాలలు కొన్ని వృత్తాకారములోనూ, మరికొన్ని అర్ధవృత్తాకృతిలోనూ నిర్మించబడినయి. ఇదే రంగస్థలచరిత్రలో మహోజ్జ్వలశకము.

తురుష్కులు మన దేశంలో కాలు మోపిన నాలుగైదు శతాబ్దాలలోనే జాతీయకళలతోపాటు రంగస్థలముకూడా తన విశిష్టతను కోల్పోయింది. కొన్ని రాజస్థానాల్లోమాత్రమే రంగస్థలము నామమాత్రముగా నిల్చిపోయింది. ప్రజల మతిసాంఘికజీవితంలో రంగస్థలం ఎప్పుడూ అగ్రస్థానాన్ని వహించింది. మన దేశాన్ని పాలించిన పాశ్చాత్యప్రభుత్వపు ధర్మాజ్ఞానాలు మన జీవితదృక్పథంలోనే మార్పును తెచ్చిపెట్టినయి. జీవితపు అన్ని రంగాలతోపాటు రంగస్థలముకూడా పాశ్చాత్యనాగరకతాసంపర్కమువలన కొత్త తెన్నులు తొక్కింది. పాశ్చాత్యనాటకశాలల పంథాలో నూరు సంవత్సరాలక్రితం మన దేశంలో నూతన నాటకశాల నెలకొల్పబడింది. నగరాలు, రాజధానిపట్టణాలు కూడ నూతనమార్గాన్ని అవలంబించినయి.

రమారమి నాలుగు దశాబ్దాలక్రితంవరకూ, వర్తమానరంగస్థలము అనేక నాటకసంఘాలకు దోహద మిచ్చినది. కాని గడచిన పదిసంవత్సరాల్లోనూ శబ్దచలనచిత్రప్రవేశంతో నాటకరంగం ప్రజాజీవితంలో కల సంబంధాన్ని చేజార్చుకొంది. ఈనాడు మనకు నాటకరంగం లేదు. స్వతంత్రభారతదేశంలో ప్రజాబాహుళ్యానికి జీవితసమస్యలు ఎరుకపరుస్తూ, ఉత్తమఆదర్శాల దిగ్దర్శనాలను అందిస్తూ ప్రబోధం చేసే రంగస్థలం పునరుద్ధారణం కావాలి. యవనరోమకపట్టణాల్లో రంగస్థలము ప్రభుత్వనిధుల సహాయంతో వృద్ధిపొందింది. ఇతర స్వతంత్రదేశాల్లోవలె మనకుకూడా ప్రభుత్వధనసహాయంతో జాతీయరంగస్థలనిర్మాణం జరగాలి, కేవలము రాబడిఆలోచనా, లాభచింతా దీని ఆశ కాకూడదు. పారిస్‌నగరంలోని నాట్యశాలల పోషణకు ప్రభుత్వము సంవత్సరానికి పదిహేను లక్షలు వెచ్చిస్తుంది. నగరనాటకశాలలకు ౩ వేల నుంచి ౧౨౦ వేలవరకు వార్షికములు నిస్తుంది. నాటకశాఖకూడా విద్యాశాఖవలె ప్రభుత్వాంగమై చక్కని వ్యవహారదక్షతతో నిర్వహించబడాలి.

జాతీయజీవితాదర్శాన్ని ప్రతిబింబింపజేయగల రంగస్థలం ప్రతినగరంలోనూ నెలకొల్పాలి. ప్రజలకు విద్యావినోదసౌకర్యాలు కల్పించి పౌరజీవితాన్ని సుఖప్రదంగా చేయటానికి బాధ్యత వహించే పురపాలకసంఘాలు జాతీయ నాటకశాలలు తమ నగరాలలో నిర్మించాలి. ప్రభుత్వము నాటకకళాశాలలుకూడా స్థాపించి అభిలాషకల యువతీయువకులకు నటనాకౌశల్యాన్ని అందీయటం అవసరం. కళాపోషణకోసం city councils, పండితపరిషత్తులు, Moscow Art Theatre వంటి పోషకపరిషత్తులు నెలకొల్పి జాతీయగౌరవాన్ని పెంపొందింపజేయవలసిన బాధ్యతను ప్రభుత్వము పూనుకోవాలి.

ఈ మహత్కార్యసాధనానికి సక్రమప్రజాభిప్రాయనిర్మాణానికీ, తదంగంగా నూతననాటకశాలల స్థాపనానికీ ప్రభుత్వకర్తవ్యాన్ని సూచించవలసిన బాధ్యత నాటకకళాపరిషత్తుమీద ఉన్నది.

# నేరస్థులు

[కథానిక]

శ్రీ బలివాడ కాంతారావు

వాకిట చింకిచాపా మీద రక్తపుమరకలను, భయం, ఆవేశం, ఆతృతా సూచించే ముఖవర్చస్సుతో, నుదుటినుంచి కారుతున్న రక్తాన్నీ చూచిన అప్పలస్వామికి నోటివెంబడి మాట రాలేదు. కన్న కుమారుని యీ స్థితిని జూచిన ఆయననేత్రాలు కన్నీటిలో మునిగిపోయాయ్. ఆయనహృదయం తీరని ఆవేదనతో మూలుగుతోంది.

'ఏం! తన వరదరాజు తనతో మాట్లాడడేం? పుట్టిమీద గంజికుండమీద చేయి వేస్తున్నాడు—ఆకలి వేస్తోందా? అయ్యో! యెన్నడూ లేనిది తన పాదాలకు నమస్కరిస్తున్నాడే—ఇదంతా దేమిటి? యెందుకు?—' భావాలు దొర్లిపోతున్నయ్ అప్పలస్వామిమనోవీథిలో. చివరకు, 'ఏం నాయనా?' అన్న తండ్రిపలుకులు వరదరాజును కంపింపజేశాయ్. 'నాన్నా, వస్తాను. గంజికుండమాత్రం జాగ్రత్తగా వుంచు...' అంటూ పాకబయటకు వచ్చి రైలుస్టేషనుకు పోయే రోడ్డువైపు నడచిపోయాడు. అప్పలస్వామికి ఆందోళన హెచ్చింది. కొడుకుమాటలను, వింత ప్రవర్తనను వెంటనే అర్థం చేసుకోలేకపోయాడు. అదంతా తన జీవితంలో చూచిన పాడుకలలలో ఒక కలేమో అనుకున్నాడు. 'రాజా...' అని పిలిచాడు. తా నెంతో గట్టిగా, పిలిచా ననుకున్నాడు, కాని ఆ పలుకులు ఆపాకను దాటి పైకి పోలేదు. నిస్పృహతో అలా కాస్సేపు కూర్చుండిపోయాడు.

'అయ్యో! రామా...' అంటూ లేచాడు. కండ్లు తిరిగాయ్. చేతిలో కర్రవూత లేకపోతే నేలపై పడవలసిందే. గంజికుండ దించాడు. ఇటూ అటూ కదిపాడు. అందులో కుడిచేతిని పెట్టి తీశా డొక వస్తువును. సూర్యుడు అప్పుడే క్రుంగిపోతున్నాడు. పాకలో వెలుతురు లేదు. గడపలోనికి వచ్చా డా వస్తువును పట్టుకొని. ఆ దొక బంగారపుగొలుసు. దానిని తా నింతకుముందు చూచాడు. తానే చేయించాడు. తన చేతితోనే తన చిట్టెమ్మమెడలో వేశాడు నవ్వుతూ. మరల యిన్నాళ్ళకు తనకొడుకు మూలంగా తన చేతిలోనికి వచ్చిం దా నగ. గొలుసుమీద యింకా ఆ పేరు 'చిట్టెమ్మ' అలాగే వుంది. అప్పలస్వామి గుండె నీరైపోయింది. పొంగిపొరలే దుఃఖాన్ని ఆపుకోలేకపోయాడు. 'అయ్యో! రామయ్య తండ్రీ' అని బిగ్గరగా యేడ్చాడు. ఆ గొలుసును రెండు చేతులతో పట్టుకొని కళ్ళకు అద్దుకున్నాడు. ఒడిలో దాచుకున్నాడు, గుండెకు ఆనుచుకున్నాడు. దానిని కన్నీటిప్రవాహంతో కడిగివేశాడు. పశ్చాత్తాపంతో కుమిలి చస్తున్న అప్పలస్వామిని యీ సంఘటన మరీ దుఃఖసముద్రంలో ముంచింది. ఉన్న కాస్త వెలుతురూ మాయమైపోయింది. చీకటి. ఆ చీకటిలో అలా కూర్చున్నాడు. శ్మశానంలో గతిలేని శవంలా జంబుకోత్తముల నవ్వులాటకు తాను బ్రతికున్నా ననుకున్నాడు.

పేదవాడై దేవుణ్ణి, ధర్మాన్ని కొలిచే భాగ్యం ఆయనకు లభించింది. అదే ఆయనలో వుండే సంతృప్తి. కర్ర చేతితో పట్టుకొని రోడ్డుప్రక్కనుంచి ౪౫ యేండ్లలోనే ౮౦ యేండ్ల ముదిమిని సంపాదించ గలిగిన అప్పలస్వామి నడుస్తున్నాడు. 'ఇదిగో, యీ మేడ—నాచేతులారా డబ్బు ఖర్చుపెట్టి కట్టించాను—నా సుఖంకోసం. ఇక్కడే నా జీవితంలోని వెలుగు—

అది వెలుగని అప్పట్లో అనుకొని మురిసిపోయాను. ఏం! ఎంచేత యీ రోజులు యిలా వుంటాయని ఒక కల లోనైనా భగవంతుడు అప్పుడు చూపించలేదు? ఒక్కసారైనా ఆయనకు అప్పట్లో చెయ్యెత్తి నమస్కరించి, రామా అని ఒక్కసారైనా పలికానా? లేదే. కాని ఆయన దయార్ద్రహృదయుడు. పరివర్తనం ఒక స్త్రీద్వారా సంఘటింపజేశాడు...' ముందుకు నడిచాడు అప్పలస్వామి; వేదపీఠికమ్మందగ్గర నిలుచున్నాడు.

'టక్, టక్—'

'వెధవముష్టికి యిదా వేళ? తలుపుకొట్టి మరీ రేమి స్త్రీ స్వతంత్రం—దిక్కుమాలిన వెధవా...'

'క్షమించు తల్లీ. ఈ దిక్కుమాలిన వెధవ భగవంతుడు దిక్కని మీ కనికరంవల్లనే తెలుసుకోగలిగాడు. మీ రిలా యీ అంతఃపురంలో వుండటానికి కారణం నేనే. ఆ డబ్బంతా మీవలపుకోసం ధారపోశా నని మొదట అనుకున్నాను. కాని అది వలపుకోసంకాదని యిపుడు తెలుసుకున్నాను. దేవు డనేవా డొక డున్నా డని తెలుసుకోటానికి అవకాశ మిచ్చిన మహాత్మురాలవగు నీకు గురుకట్నంగా నా యావదాస్తినీ ధారపోశా ననుకుంటున్నాను....'

'నివ్వా—రేం టా వాగుడూ నివ్వూనూ. నీ పోరు యింకా యెందుకు? పోతావా పోవా? అప్పలస్వామైతే మాకు హెచ్చు అనుకున్నావా?'

'కాదమ్మా కాదు. ఈ అవస్థలో వున్న అప్పలస్వామి మీకు హెచ్చుకాదు. అప్పలస్వామికే మీరంటే భక్తి, మీఅమ్మాయంటే ప్రేమ—నాకూతురని మురిసిపోతాను. నాకొడుకు నరసరాజా, మీరు వాడి తల్లి అని తెలీక దొంగలాడి తీసుకవచ్చినట్లుంది. పుత్రవాడిని నాముఖం చూసైనా క్షమించి యీ గొలుసును తీసుకోండి. వాడుచేసిన దొంగపనికి పాపఫలం అనుభవించాడు—తలమీద దెబ్బ తగిలింది...'

'ఇద్దరూ కలవంది యీ పని కాదు. నా సుమ్మానికి మాటిమాటికి యెందు కొస్తావ్? మాకు చిన్నతనం కాదూ నలుగురిలో. నీకు సరియైన స్థలం యిప్పుడే చూపించాలి!—అయ్యో! ఇన్స్పెక్టరుగారూ, ఆ దొంగ యిక్కడే వున్నాడు'అని కేక వేసింది. ఆమె కుమార్తెతో మాట్లాడుతున్న యిన్స్పెక్టరుగారు కేక విని యిద్దరు పోలీసులతో సహా అక్కడకు వచ్చారు. అప్పలస్వామిచేతులకు బేడీలు పడ్డాయి.

'అమ్మా! అంతేనా...యింకా యేమైనా గురుకట్నం కావాలా?—' ఆమెవైపు చూసి వినయంగా ప్రశ్నించాడు అప్పలస్వామి.

'కట్నం యిస్తాడు. ఇక సుఖంగా వుండొచ్చు. ఇంటియెదురుగా కూర్చొని యీదురోమన్న నీ యేడుపే మమ్మల్ని చిన్నరికం చేస్తోంది. ఇన్స్పెక్టరుగారూ, అంతా మీచేతుల్లో వుంది. వస్తాను...' అంటూ తలుపువేసింది ఆమె.

* * *

పోలీసు స్టేషనులో—

'నీ నేరికనో తెలుసుకోకుండా నోటికి వచ్చినట్లు కూస్తున్నావ్...'

'తెలుసును, బాబూ తెలుసును—ఆనాడు మీరు కాళ్ళమీద పడితే కాగితం రాసియిచ్చాను—జ్ఞాపకం వుండలేదో!—తమరు సబిన్స్పెక్టరు కావటానికి ఆ కాగితమే అనుకుంటాను...'

'దూడపోయ్ నెంబరు మాటపడకొండూ—ఈ అడుక్కునోడు నాకు నౌకరీ యిప్పించాడట! వెధవ మాటలు, నివ్వూనీ వెధవబ్రతుకున్నూ...సరిగా అడిగిన ప్రశ్నలకు సమాధానం చెప్పు. అధికప్రసంగం చెయ్యక. ఈ గొలుసును యెవరు దొంగిలించారు?'

'బాబూ, నే నేం అధికప్రసంగం చేశాను—?'

'నువ్వు చేశావని నే నంటున్నానుగా—చెప్పు. యెవరు దొంగలాడారు?'

'నాకొడుకు నరసరాజు'

'ఎలా దొంగిలించాడు?'

'అదేమో నాకు తెలీదు బాబూ. కంగారుగా వచ్చి గంజికుండలో యిది పడవేసి మళ్ళీ స్టేషనువైపు పరుగెత్తాడు...'

'ఎలా వుంటాడు నీ కొడుకు ?'

'చామనచాయగా వుంటాడు. నాయంత పొడుగే. మశూచి పుట్టి గుంటలు పోయిన మొహం. బట్టలాంటి తల. ఇరవయ్యేళ్లయినా ఇంకా గడ్డం రాలేదు బాబూ...'

'ఎలాంటి బట్టలు వేసుకున్నాడు?'

'భుజాలు చిరిగిన మాసిన ఖద్దరుచొక్కా, మాసి పోయిన చింకి కాకినిక్కరూ తొడుక్కున్నాడు. తలమీద దెబ్బ తగిలింది. కారిన రక్తం బట్టలమీద పడి మరకలై పోయింది...'

'విన్నావోయ్ హెడ్డూ...వీడి కేం తెలీదట! వీడు చెయ్యమనకపోతే ఆ గుంటడు చేస్తాడా దొంగ తనం ?' అన్నాడు మీసాలు త్రిప్పుతూ సబిన్‌స్పెక్టర్.

'నిజం చెప్తావా లేదా ముసలిపీనుగా...'అంటూ లాఠీతో హెడ్‌కానిస్టేబిల్ అప్పలస్వామివీపుమీద బాదాడు.

'అయ్యో ! రామా...'అంటూ తల దించాడు అప్పలస్వామి బాధతో.

'దొంగవెధవకి రాముడట...'అంటూ అప్పల స్వామిని యీడ్చుకొంటూ కొట్లో త్రోశాడు హెడ్‌కానిస్టేబిల్.

'తమ సెలవు లేకుండానే అప్పుడే నెంబరు ౧౦౩, ౧౦౫, ౧౧౨, ౬౭ లను పంపించాను వాడి కోసమై...'అన్నాడు తిరిగివచ్చి హెడ్డుగారు.

'అలా వుండాలోయ్ తెలివి తేటలు...' అని సగర్వంగా నవ్వాడు సబిన్‌స్పెక్టరు టేబిల్ గ్రుద్దుతూ.

నడిరాత్రి—

రాముని మనసులో తలచుకొని పోలీసుస్టేష నులో యినుపవూచలవెనుక తన్మయుడై కన్నులు మూశాడు అప్పలస్వామి.

ఎవరో యేడుస్తున్నారు. కేకలు వేస్తున్నా రెవరో. తెలివి వచ్చింది. వింటున్నాడా మాటలు. వినలేకపోతూడు. చెవులు మూసుకున్నాడు. పోలీసులు వరసగా జానా లాఠీదెబ్బలతో చంపుతున్నారు. అప్పల స్వామికి కొడుకుమీద వున్న వాత్సల్యం నిముషనిము షానికీ హెచ్చుతోంది. బోనులో పడ్డ యెలుకలా యిటూఅటూ తిరుగుతున్నాడు. కొడుకు తప్పు చేయ టానికి కారణం తండ్రియైన తనే అనుకున్నాడు. తాను ఆకలితో పడుతున్న బాధను చూడలేకే కొడుకు అంత పాడుపని చేసివుంటాడని తలిచాడు. కొడుకునకు విద్యాబుద్ధులు చెప్పించక, ఉన్న రెండుతులాలపాపా యల ఆస్తిని తగలేసిన తనే ఆ కొడుకు ఆ పని చేయ టానికి దోహద మిచ్చానని బాధపడ్డాడు. చివరకు పోలీ సుల చేతిలో పడటానికి కారణం తనే అని గ్రహించు కున్నాడు. కొడుకు నిర్దోషి; తానే దోషి. ఈ నేరంకంటే ఒకప్పుడు తాను చేసిన పెద్ద నేరానికి శిక్ష పొందలేదే ! ఈ రెండు నేరాలకూ శిక్ష యిపుడు అనుభవించాలని అప్పలస్వామి కోరుకున్నాడు.

* * *

కోర్టుకు తండ్రివెనకాలే కొడుకు నడుస్తున్నాడు బేడీలతో—

ఒకనాడు ఆ తారురోడ్డుమీదే విలాసంగా ఆ విలాసినితో, సిల్కునూటుతో నవ్వుతూ కారుమీద తిరిగాడు. ఎందరి నమస్కారాలనో అందుకున్నాడు. ఈనాడు ఆ రోడ్డుమీద యెండలో తల వంచుకొని మాసిన జీర్ణవస్త్రాలతో, పెద్ద గడ్డంతో, చింపిరితలతో తల వంచుకొని ముందుకు నడుస్తున్నాడు. కాలికి జోడు లేదు; పాదాలు మాడిపోతున్నాయ్. ప్రజ లకు ముఖం చూపించలేక సిగ్గుచేత కుమిలి క్రుంగి పోతున్నాడు. ఆయనసిగ్గు ఆయననే తింటోంది. కాని ఆయన వేపు చూచి కనికరించిన మనుష్యు లేరే...!

వెనక నడుస్తున్న కొడుకుతో అన్నాడు—
'నాయనా ! రాజా ! నిజం చెప్పు తండ్రీ'

'నిజం చెప్తాను నాన్నా!'

'ఆఁ ఆఁ. చెప్తావా నా తండ్రీ ?'

'ఈ జైలులోనే బాగుంది. కష్టపడినా, కడు పుకు గంజినీళ్లైనా దొరుకుతోంది. తప్పక నిజం చెప్తాను.'

కొడుకుమాటలు విన్న అప్పలస్వామి సిగ్గును దూరంగా పారద్రోలాడు. పక్కకు తల తిప్ప

కొడుకు నోసారి చూచాడు. అప్పటికీ ఆ రాముడే వున్నాడని నవ్వుకున్నాడు.

కోర్టులో—నరసరాజు యిలా మొదలు పెట్టాడు:

'ఆ గొలుసును నేనే దొంగలాడాను బాబూ! ఆరోజు సాయంత్రంవరకూ తిరిగాను గాని యెక్కడా ఒక్కాసీకూలైనా దొరకలేదు. ఆ ముందురోజునుంచీ నాన్నకు భోజనం లేదు. కాసింత గంజి వుంటే త్రాగక నాకే వదిలేశాడు. అదిగో ఆ కుర్చీమీద కూర్చున్న ఆయన నా నెత్తిన మూట పెట్టాడు ఆవేళ సాయంత్రం. ఇంత కూలిస్తా ననలేదు. గొప్పవారు కదా అని నేనూ యింత కూలివ్వండని అడగలేదు. చాలా దూరం—మూట బరువైంది. ఆ మేడలోపలికి వెళ్లి మూట దించాక అణాడబ్బులు చేత పెట్టారు. నాకు పావలా యిస్తేనా నాకష్టం తీరదు. నాకు పావలా యిస్తేకాని యిల్లు కదల నన్నాను. అదిగో, ఆయమ్మే కర్ర పట్టుకొని వచ్చింది. పోతావా పోవా అంది. నాకూలి యివ్వండి నేను కదల నన్నాను. నన్ను కర్రతో కొట్టింది. తలమీదనుంచి రక్తం కారింది. ఆవిడ మెడలో బంగారంగొలుసు కనపడ్డాది. ఆ గొలుసు చూడ్డంతోనే నాకు అది దొంగలాడ బుద్ధి వేసింది. ఆయమ్మ వేళ్లు పట్టుకొని మెడలో గొలుసు లాగివేశాను. మాకు కడుపు నిండా గంజి దొరుకుతుందనీ. దెబ్బ పోరడానికి డాక్టరుకు డబ్బు యివ్వవచ్చునీ అనుకున్నాను. సందుసందుల్లో దాగొని యింటికొచ్చాను. నాన్నతో చెప్పితే కోపంవస్తాడని తెలుసును. నావెంట యెవరో వస్తూ నన్ను పట్టుకోడానికి వస్తున్నారనే భ్రమపడిపోయాను. గొలుసు గంజి కుండలో వేసి స్టేషను దగ్గరకు వెళ్లాను. రైలుబండి వుంది. నాన్నను వదిలేసి పోటానికి మన సొప్పలేదు; కూర్చొని ఆలోచించాను గంటలతరబడి. తిరిగి యింటికి వస్తున్నాను—నాన్నతో చెప్పి వాళ్ళ గొలుసు వాళ్ళ కిచ్చేద్దామని. త్రోవలో పోలీసులు పట్టుకున్నారు. అంతే నాకు తెలిసింది. నన్ను జైలులోనే వుండనీయండి. కష్టపడినా కడుపు కేదో దొరుకుతోంది. ఒక్కటే నాకు చింత—మానాన్న యెలా వుంటాడో అని.'

నరసరాజు చెప్పటం పూర్తిచేశాడు. అప్పలస్వామి మొదలెట్టాడు, మేజస్ట్రేటు 'నువ్వు నీ కొడుకును దొంగతనం చెయ్యమన్నావా లేదా?' అని అడగటంతోనే.

'ప్రభువువారు నా పలుకులు కాస్త వింటారనే ఆశతో చెప్పుకుంటున్నాను. నా కొడుకుమాటలు విని నన్ను నిర్దోషిని చెయ్యకండి. నాకొడుకే నిర్దోషి నా దృష్టిలో. అంతైనా దోషిని నేను. నా దోషం నిరూపించడానికి అప్పట్లో యెవరికీ శక్తి లేకపోయింది. నా దోషాన్ని నేనే చెప్పుకుంటాను. నేను నేరంచేసి చాలాకాల మైందని నన్ను శిక్షించటం మానకండి మీరు. ఒకప్పుడు మీరు మానివేస్తే నేనే శిక్షించుకుంటాను. నా నేరం నిరూపించడానికి నాదగ్గర కాగితా లేమీ లేవు. ఇదిగో, నా చేతిపై వున్న పెద్ద గాయంయొక్క మచ్చ. అప్పుడప్పుడూ యీ మచ్చ వున్న భాగంలో గొప్ప నొప్పి పుట్టుంది. హేరామ్, క్షమించు చిట్టీ అని శ్రీరాముణ్ణీ, నా చిట్టినీ తలచుకోగానే బాధ నయమౌతుంది.

మీరు న్యాయమూర్తులు. ఈ కూలివాళ్లిద్దరూ యింత బాగా మాట్లాడుతున్నారని విస్మయం చెందకండి. మా మాటలు విన్నాక మీరు నమ్మితే ఆశ్చర్యపడరు. నా కొడుకును యెందులో లేకపోయినా మాటలలో తరిఫీదుచేశాను.

మీరు ధర్మప్రభువులు. మీరు నాగోల వినటానికి సమ్మతిస్తారు. ఒకప్పుడు యిష్టపడకపోతే యినుప వూచలతో నా జీవితం చెప్పుకొని వాటి కరుణవల్లనే నా ప్రాణాన్ని విడుస్తాను. ఇనుముకు ప్రాణం, మానం లేదనుకోగలరు. దానికీ వుంది. నే చేసిన ఘోరమైన పనిని చూచిన యినుపవస్తువు పూరుకోక నాచెయ్యి మీద పడింది. నా రక్తంతో నా చిట్టీ రక్తాన్ని కలిపింది. కలకాలం నే చేసిన దురంతాన్ని జ్ఞప్తికి తెచ్చుకునేట్లు చేసింది. అటువంటి కత్తి'—ఇనుముతో చేయబడిన ఆ వస్తువుకు—అది సంపాదించుకున్న రక్తాన్ని బ్రాందీతో కడిగివేశాను; కృతఘ్నుడ నయ్యాను. ఎప్పుడైనా ఆ యినుముయొక్క రక్తాన్ని తిరిగి [illegible] నేను యిచ్చి నా అప్పు తీర్చేగాని నాకు గతిలేదు.

అసలువిషయాలు చెప్పటం మరిచాను. మీతో తన స్వరూపాల్ని చెప్తున్నది—లక్షాధికారి, బలిష్ఠుడు, స్త్రీలోలుడు, గర్విష్ఠుడైన అప్పలస్వామి కాదు. ఒక మహోజ్వలిత చల్లని చూపువల్ల దేవుడున్నాడని తెలుసుకున్న ఓ అప్పలస్వామన్న పేరుతో వున్న అస్థిపంజరం.

వినండి. నా పేరు అప్పలస్వామి. రెండులక్షల ఆస్తి చేతి కప్పగించి తండ్రి చనిపోయాడు. చిన్నప్పుడే పెండ్లిచేశాడు నాన్న. ఆయన చనిపోయాక నాభార్య చిట్టెమ్మ కాపరానికి వచ్చింది. క్రొత్తగా నాచేతులతో డబ్బు ఖర్చుపెట్టి కట్టించిన భవనంలో మొదటి మూడుసంవత్సరాలూ చాలా ఆనందంగా గడచిపోయాయ్. సంఘంలో మా పేరు మార్మ్రోగింది. ఏది కావాలన్నా, వెళ్ళవోయ్ అప్పలస్వామి భార్య చిట్టెమ్మదగ్గరకు అని అనేవారు. ఆ మూడేండ్ల ఆనంద ఫలితమే యీ సరసరాజు—నా కొడుకు.

కన్నవారింటికి పురిటికి పోయింది చిట్టి. నా భార్య యేడు నెలలు పోయాక తిరిగి వచ్చేటప్పటికి నా తత్త్వం మారిపోయింది. అప్పట్లో మారిపోయిందని తెలుసుకోలేకపోయాను. క్రొత్త స్నేహితులు, క్రొత్త వర్తకులు, క్రొత్త పానీయాలు, క్రొత్త భార్యలు—అదంతా ఓ పాడు కల. నే వర్ణించలేను. నాకు సరిగా జ్ఞాపకం లేదు కూడాను.

ఒకస్త్రీ—ఆమెను అపుడు వలచాను. నా సర్వస్వం ధారపోశాను—అప్పట్లో నే తప్పు చేస్తున్నానని అనుకోలేదు. ఆ అందం అమరికను చూసి లోకాన్ని మరచాను. ఆ భోగంలో యింత అసహ్యం వుందని అప్పట్లో తెలుసుకోలేకపోయాను. నాకు త్రాగుడు ఆమె నేర్పింది. చివరకు నే పట్టింది అందుకే అనుకున్నా. త్రాగుడు, ఆసక్తి కోసమే నేను యీ ప్రపంచాన పుట్టా ననుకున్నాను. నా చిట్టి యెంతైనా ప్రయత్నించింది నన్ను బాగుచేయటానికి. అదంతా చెవిటివాని చెవులో శంఖారావమే. ఇపుడు తలచుకొంటుంటే గుండె బ్రద్దలౌతోంది.

ఒకస్త్రీ అన్నానే ఆ స్త్రీ, అంతటో ఆగలేదు. ఎందుచేత అంటారేమో ! దేవుడున్నాడని తెలుసుకోవటం ఓ బ్రహ్మాండమైన విషయం. ఆ విషయం నేను తెలుసుకోవాలని ఆమె అనుకోవటంవలన ఆ పనులన్నీ ఆమె చెయ్యించిందని యిపుడు అనుకుంటున్నాను.

రామవరం అనే గ్రామంలో మా కొక మామిడి తోట, ఆ తోటలో ఒక బంగళా వుంది. అది వేసవి కాలం. నా చిట్టి వద్దన్నా యిద్దరం బయలుదేరాం. సరసరాజుకు అపుడు మూడో యేడు. ఆ రాత్రి నా అభిమానానికి నా భార్య విస్మయమందింది. సేవకుల నెవరినీ తీసుకవెళ్ళలేదు. చీకటిరాత్రి. చల్లని గాలి వీస్తోంది. సరసరాజుని యింకో మంచంపై వేసి నా ప్రక్కన పడుకుంది నా చిట్టి. ఏమిటో ఆమెతత్త్వం—నిద్రపోయింది. ఒక బ్రాందీబుడ్డీ పగుల గొట్టాను; త్రాగాను. లోకాన్ని మరచిపోయాను. ఆ స్త్రీ యిచ్చిన కత్తి—అదే బాకు కామోను. ఏం చేశానో ఏమిటో తెలుసుకలేను. సరసరాజు యేడుస్తున్నాడు. నాకు తెలివి వచ్చింది. చూశాను. తల గట్టిగా ఒక్కసారి పట్టుకున్నా. ఇంకొక బ్రాందీ బుడ్డీకూడా పగులగొట్టి వుంది. కత్తి కడిగినట్లుంది. మరల ఆ స్త్రీని తలచుకోగానే గుండె దిట్టమై పోయింది. కోర్టులవెంబడి నా పెళ్ళాన్ని యెవరో చంపారని తిరిగితే ఆమెతో కార్లపై షికార్లు కొట్టడ మెలా! ఒక దుప్పటితో శవాన్ని కప్పివేశాను. తోటమాలిపాక దగ్గరికి పోయి ఆ పల్లెలో వున్న డాక్టరుగారిని, మునసబుగారిని తీసుకరమ్మని మాలిని ఆజ్ఞాపించాను. వారిరువురూ వచ్చారు. ఇదిగో యీ ఐదువేలరూపాయలు. చెరొక రెండువేల ఐదువందలు తీసుకోండి. తలగాయంవలన చనిపోయిందని మీ రిరువురూ చెప్పాలి. ఎవరో నా భార్యను చంపారు. పోయిన ప్రాణం యెటో పోయింది. దాని ప్రాణంకోసం కోర్టు లెక్కడం నా కిష్టంలేదు. నాకు తీరుబడి వుండదు కూడాను. నా మాటలు విన్నారు. సరే అన్నారు. సూర్యోదయ మయ్యేసరికి మంటలు మీదికి లేచాయ్ నా చిట్టి బూడిద అయిపోయింది.

సరసరాజు దాసీదానిచేత పెంచబడుతున్నాడు, వాడిని చదివించలేదు. చదివించాలని తలచలేదు. ఆ

స్త్రీ మాయింట్లోకి వచ్చింది. నాతో తిరగడం మొదలెట్టింది. చివరకు ఆ యిల్లు ఆమెదే అయింది. నా రోజులు మారిపోయాయ్. దగ్గర డబ్బు లేదు. ఇదే మంచి సమయం కులంవాళ్ళకు. కులంనుండి వెలివేశారు. చివరకు ఆ స్త్రీ నన్ను నాయింటినుంచే గెంటించింది. నా వయసు ౪౫ యేండ్లంటే మీరు నమ్మలేరేమో.

సర్వం పోగొట్టుకున్న అప్పలస్వామిని నేను. ఈవూరిలో రేమసుఖం పెట్టుకొని ఉన్నాడని మీ రంటారేమో ! వారికి సమాధానం యిది : నాకొడుకు నావలె బీదవాడు—ఒక కూలి. నా కూతురు ఒక శ్రీమంతురాలు. ఆ కూతురును రోజూ చూడాలనే భ్రాంతి నన్నీవూరిలో వుండనిచ్చింది. నా కూతురు నేను ఆమెతండ్రి నంటే అంగీకరించదు. ప్రపంచంకూడా అంగీకరించదు. సానిబిడ్డ అంటారు. సానికాని సంసారి కాని నా రక్తంలో రక్తం. నాకూతురు. నా యావదాస్తీ నాకూతురుకై నా యిచ్చి తరించానుకదా అని తృప్తిపడతాను. సానిబిడ్డ నాకూతు రెలా అయిందంటారేమో ! వారికి నా సమాధానం యిది : నేను బీదవాడనయ్యేవరకు ఆ స్త్రీ—యిప్పుడు నాగురువు—నాతోనే యెల్లప్పుడూ తిరిగేది. నన్ను హృదయమిచ్చి ప్రేమించిన నా చిట్టిగుండెల్లో కత్తి నాటాను. హృదయం యీయకుండా ప్రేమించిన సానికోటిలో నా పెద్దలు గడించిన పాపపుడబ్బు పోశాను. అది యెక్కడకు పోయినా జీర్ణం అవటం కష్టం. నా చిట్టి కొడుకు నన్ను చేరదీశాడు. నా సానికూతురు తల్లి మాటలు విని నన్ను యింటినుంచి గెంటించింది—ఇప్పుడు జైలుకు పంపించింది. నేను దూషిస్తున్నా ననుకోకండి. ఉన్నది చెప్తున్నా.

నా కొడుకు కూలిచేసి, రోజుకి అణా తక్కువ లేకుండా తెస్తాడు. అదే గంజికాచుకొని త్రాగటం. నా కొడుకు దొంగ కావటానికి బాధ్యుణ్ణి నేనే. ఆ గంజిలోనే అమృతం వుందని అనుకొనేవాణ్ణి. ఇప్పటి గొంతుకలోనే తియ్యనైన మాటలు వున్నా యనుకుంటున్నా. ఇప్పటిహృదయమే మంచిగా ప్రకాశిస్తుం దనుకుంటున్నా. ఇప్పుడే నే సుఖపడుతున్నా—

ఆ స్త్రీ నాగురువు. నా చిట్టి నా దేవత. ఆ శ్రీరామచంద్రుడు నాగొంతుకలో వుంటున్నాడు. నేను సుఖంగా బ్రతుకుతున్నాను. నా కొడుకు మంచి గుణం నన్నిన్నాళ్లూ కాపాడుతూ వచ్చింది. ఇప్పుడు నా కొడుకు లోకం దృష్టిలో రెండు తప్పులు చేశాడు. ఒకటి—దొంగతనం, రెండు—మొదట పోలీసుస్టేషనులో లేదని అబద్ధం ఆడటం. నా కొడుకు నాకోసమే ఆ తప్పులు చేశాడు. నేరం నాది. నేరస్థుడు యీ ప్రపంచంలో వుండకూడదు. ఇంతవరకూ మీరంతా వినినందుకు మీ అందరికీ నమస్కరిస్తున్నా. నా హృదయపుబరువు తగ్గింది. నిశ్చింతగా నే నీ లోకం విడిచిపెట్టవచ్చు. నాకొడుకు నేరాన్ని కోర్టులో ఒప్పుకున్నాడు కాబట్టి మూడునెల్లశిక్ష తప్పక అనుభవిస్తాడని నాకు తెలుసు. నాకొడుకును విడిచి నేను వేరుగా వుండటం అసంభవం...' అప్పలస్వామి తన జీవిత గాథ చెప్పాక గడగడ వణికిపోయాడు. కన్నీరు కార్చాడు కొడుకువేపు చూచి. చేతిలో పోటు బయలుదేరింది.

కేసు ఐదురోజులకు వాయిదా పడింది. అప్పలస్వామి, నరసరాజు తిరిగి జైలులో వారివారి కొట్లలోకి పోయారు.

మరునాడు తెల్లవారింది. కొట్లో అప్పలస్వామి శవం వుంది. చేతిమీద మచ్చ లేదు. పెద్ద గాయం వుంది. అందులోనుంచి ప్రవహించిన రక్తం ముద్ద కట్టి వుంది. జైలుతలుపుయొక్క యినుపవూచలు రక్తమయమై వున్నాయ్. జమాదార్ ఆశ్చర్యపోయాడు, అప్పలస్వామి పహరా కాస్తున్న తనకంటికి అగపడకుండా ఆ ఘోరకృత్యాన్ని యెలా చెయ్యగలిగా డని.

ఐదోరోజు మరల కోర్టులో నేరస్థులలో హాజరైంది ఒక్కరే—నరసరాజు. చివరకు మూడుసంవత్సరాలు కఠినశిక్ష పడింది. జైలులోనికి పోయాడు. ఏడుస్తాడు. ఓదార్చేవా రెవరు ! కొట్టి పని చేయించే వారే అంతా. తండ్రి తలపునకు రావటం, తన గుండె బాదుకొని యేడవటం. జమాదార్ చూచి పనిచేయనందుకు పస్తు పెట్టి వీపు చిట్లగొట్టడం.

# కలగూరగంప

## చమత్కార నక్షత్రచాటువు

'చమత్కారనక్షత్రచాటువు'. అన్న వ్యాసమున శ్రీ గొబ్బూరు వెంకటానందరాఘవరావు గారు కడచిన అక్టోబరు నెల భారతిలో—

'నక్షత్రము గల చిన్నది
నక్షత్రముఁ జేతఁబట్టి నక్షత్రప్రభుఁ
నక్షత్రమునకు రమ్మని
నక్షత్రము పైన వేసి నాథునిఁ బిలిచెన్.'

అన్న చాటువును అభిమన్యుడు పద్మవ్యూహ భేదనమునకు వెడలుటకు ముందు ప్రవర్తిల్లిన ఉత్తరాభిమన్యుల కడసారి ప్రణయఘట్టమునకు విషయముగా వివరించినారు. ఆరీతి సమన్వయము మిక్కిలి హృద్యముగాను, చమత్కారముగాను ఉన్నదనుటలో సందేహము లేదు. కాని ఆ పద్యపాఠము నేను విన్నది వేరుతీరున నుండుటచే మనవిచేసికొనుచున్నాను. నేను వినినరీతిని ఆ పద్యపాఠ మిట్లున్నది:

'నక్షత్రము పేరిటి పతి
నక్షత్రసుఖంబుఁ గోరి నక్షత్రేశున్
నక్షత్రమునకు రమ్మని
నక్షత్రముఁ బట్టి యీడ్చి నగిరోఁ బ్రియమునన్'

ఈ పద్యములో కవి తారాశశాంకుల తొలినాటి ప్రణయలీలను హృద్యాతిహృద్యముగా అభివర్ణించుచున్నాడు. నక్షత్రపదము ప్రతిపాదమున నావృత్తమగునట్లును, నది యొక్క ప్రణయదంపతులకు మధ్య ప్రవర్తిల్లిన ప్రేమఘట్టము నభివర్ణించునట్టిదిగను నుండునట్లు రచియింపుడని యెవరో యా కవీశ్వరునికి 'దత్తపది' నీయగా నతఁ డీ పద్యమును రచించినట్లున్నది.

ఈ పద్యములో తొలిపాదమున 'నక్షత్రము పేరిటి పతి' యనగా నక్షత్రార్థకపదము పేరుగా గల చెలువ యని యర్థము. తార యనగా నక్షత్రము. నక్షత్రార్థకనామము గల చెలత తార. 'నక్షత్రసుఖంబు గోరి' యని రెండవ పాదమునందు గలదు. ఇచట నక్షత్రసుఖమనగా నాశ్లేషము (కౌగిలింత) వలని సౌఖ్యము. ఆశ్లేష ఒక నక్షత్రము. ఆశ్లేష యనగా కౌగిలింత యనియు నర్థము. ఇచట నాశ్లేషార్థము లాక్షణికమని యెఱుంగునది. నక్షత్రేశుడు చంద్రుడు. అతనిని కౌగిలించుకొని యాశ్లేషసౌఖ్యము ననుభవింపగోరి, తార—బహిరంగముగా నట్టిది జరుగగూడదు కాన, జరిగినచో బృహస్పతికి దక్కిన శిష్యులు ఆ విషయమును బాల్యచాపల్యముచేత, అరయమిచేత నమా



శ్రీ వఝ్ఝల చిన సీతారామశాస్త్రిగారు

ఇటీవల జరిగిన ఆంధ్ర విశ్వకళా పరిషత్తు స్నాతకోత్సవములో 'కళాప్రపూర్ణ' బిరుదాంకితులైన సుప్రసిద్ధ ఆంధ్ర వైయాకరణి.

యికముగా గురువర్యులకు ప్రవృత్తివిషయము మెల్లి గింతురుగావున--మగనికీ విషయము తెలిసి తలపగూడని చెట్ట కలుగును. తెలిసిన పండువంటి తన సంసారము నకు ముప్పు మూడునని కాదు. చంద్రునివంటి యందగాని పొందు తన కిక లేకపోవునే యని— అది తెలిసి బృహస్పతి యతని నిలువెడల నడచిన యెడల—నక్షత్రమునకు- రమ్మని పిలిచినది. ఇచట నక్షత్ర మనగా మూల. చంద్రుని మూలకు రమ్మని పిలిచినది గురుపతి. తార గురుపతి కాపుట చేతను, చంద్రు డప్పుడే ప్రారబ్ధయౌవను డగుటచేతను, నింతకు మును పట్టిది యెఱుగడు కావునను నతని కట్టి పనికి సాహసింపను గుండెదిటవు లేకపోయినది. తోడి వారు చూచిన నేమని యాడిపోసుకొందురో, గురువున కీ విషయము తెలిసి యత డేమని శపించునో! పైగా తాను చదువుకొన్న చదువులో నిట్టిది మహాపాప మని కలదు. కాని మనసు మాత్రము ముందుకు దూకు చున్నది. యౌవనగర్వము కన్నులకు దట్టినది. లౌకిక సంఘనీతి, గురుభయము, శాస్త్రజ్ఞానము వెనుక కీడ్చు చున్నవి. ఇట్లు అతనిమనసు ఇటు సాహసింపను లేక, అటు అవకాశము జాఱవిడుచుకోను లేక దోలాందోళి తమై యున్నది. తార ప్రగల్భ, ధీర, యౌవనగర్విత. చంద్రుని జంకు కళంకును జూచి కొంకినది. అతని నప్పు డట్టి స్థితిలో వదల మనసురాలేదు. అందులకే అట్టి సదవ కాశము ఎటిగి యెఱిగి చెయిజార్పుకో లేక, మనసు వశము చేసికో లేక కామపరవశయై సాహసించినది. తార కంతకన్న మార్గాంతర మెందు తో ప లే దు. అదియే యప్పటి కుత్తమమార్గము. తిరుగులేని తిరు మంత్రము. అందుకే 'నక్షత్రము బట్టి యీడ్చినది'— అనగా చెయిబట్టి లాగిన దని యర్థము. చేతికి సంస్కృత పదము హస్తము. హస్త యొక నక్షత్రము. తార అంత టితో నూరుకోలేదు. అతని యధీరతకు, తన ప్రగల్భ ధీరసాహస లలిత కార్యమునకు అహంకారదర్పముతో 'నవ్వినది'. అది మామూలు నవ్వు కాదు; ప్రియము తోడిది. ఆ నవ్వు మదనోద్దీపకము. ఇటు పాపశంకకు, అటు చేజిక్కిన యానందస్వర్గధామద్వారమునకు మధ్య దోలాందోళితమనస్కుడై యున్న చంద్రుని కుద్రే కము రేకెత్తించు నవ్వు అది. ఆ నవ్వుతోనే తార అతనిని తనవశము చేసికొనినది. ఆ నవ్వుతో చంద్రుడు తారకు కింకరుడైనాడు. ఆ సమయములో తా నేమి



శ్రీమతి కొ తా యశోదాదేవి

యం. ఏ., డి. లిట్.

క్రీ. శ. 1000—1500 నాటి ఆంధ్రదేశ చరి త్రను గురించి ఈమె చేసిన పరిశోధనలకుగాను మద్రాసు విశ్వవిద్యాలయమువారు ఈమెను డి. లిట్. బిరుదు నిచ్చి, గౌరవించినారు.

---

చేయుచున్నది యతనికి తెలియదు. ఒక విధముగా నత డపుడు 'మంత్రముగ్ధుడు'.

ఇట్లు ఈ పద్యము తారాశశాంకులకు, తరుణ వయస్కులకు (ఇందు నాయిక తార ప్రగల్భ, ధీర; నాయకుడు శశాంకుడు అరబ్ధయౌవనుడు) ప్రవర్తిల్లిన ప్రథమసమావేశమందలి యపూర్వ ప్రణయగాథలోని తొలిఘట్టము. ఇదియే చంద్రుని లోకదృష్టిలో కళంకి తుని జేసినది.

అత్యాసన్న విషాదమరణము ప్రాపింపనున్న యభిమన్యునకు, నతని పతి యుత్తరకు జరిగిన కడసారి ప్రణయఘట్టము నీ పద్యము వర్ణించుట సొగసో, తారా శశాంకుల ప్రప్రథమసమావేశసమయమందు ప్రవర్తిల్లిన యపూర్వ ప్రణయ పరిచయ నాటకమున కిది నాంది యనుట సొగసో పాఠకులు నిర్ణయించుకొందురు గాక! తొలిది కరుణాత్మకము; మలిది శృంగారాత్మకము.

తిమ్మావఝ్ఝల కోదండరామయ్య.



# విమర్శనము



### బాపూజీ

బాపూజీ మహత్తమ జీవితము ఈ బుఱ్ఱకథలో రసవత్తరముగా చిత్రింపబడినది. రచయిత : ప్రయాగ నరసింహశాస్త్రిగారు, ౪ మునియప్పిళ్ళవీథి, కోమలేశ్వరన్‌పేట, మద్రాసు ౨. వెల అ. ౨.

---

### బలిదానం

గాంధీమహాత్ముడు గుండుదెబ్బకు ఆహుతియై ఆత్మార్పణ చేసిన జనవరి ౩౦-వ తేదీ నాటి సంఘటన అద్యంతముగా, కరుణరసము చిప్పిలునట్లు, కమ్మని కవితలో వర్ణించుచున్న గేయము. రచయిత : ఊ. స. సుందరాచారి గారు, ౧ భారతమాత వీథి, తాంబరం, మద్రాసు. వెల అ. ౨.

---

### కీర్తిమూర్తి బాపూజీకి కవితానీరాజనాలు

గాంధీజీనిర్యాణసందర్భమున వెలువడిన ఈ క్రిందిరచనలుకూడ వస్తుగౌరవమునకును, కవితాసంపత్తికినిగూడ ఆంధ్రపాఠకలోకము అవశ్యము చదువదగి యున్నవి. దామరాజు పుండరీకాక్షుడు గారి (లోకశ్రేయస్సమితి, గుంటూరు) 'అహింసాజ్యోతి బాపూజీ'; విశాఖపట్టణం లలితకళాసమితివారి 'బాష్పాంజలి'; దేశబంధుగ్రంథమాలవారి (సుబ్బారెడ్డి పాలెం, మీంజూరుపోష్టు, పొన్నేరి తాలూకా) 'మహాత్మునకు కన్నీటికానుక'; కంచర్ల బసవకోటి లింగంగారి (పండితుడు, హైస్కూలు, గుడివాడ) 'మహాత్మాగాంధిదివ్యస్మృతి'; సున్నం వీరరాజకవి గారి (కవితాసమితి, తుని) 'మహాత్మాజీ అస్తమయము'.

---

### హిందీ స్వబోధిని

మొదటిభాగము. ప్రకాశకులు : పుస్తకశాల, మద్రాసు ౪. వెల రూ. ౧-౮-౦.

### రాయల హిందీ తెలుగు ప్రైమరు

కర్త : ఎ. సి. కామాక్షిరావుగారు. ప్రకాశకులు : రాయలు అండుకో., కడప. వెల అ. ౬.

పై రెండును హిందీని ఓంప్రథమముగా అభ్యసింపగోరువారికి ఉపయోగకరములుగా నుండగలవు.

---

## గ్రంథ స్వీకారము

---

### అనమర్థుని జీవయాత్ర

నవల. రచయిత : గోపీచంద్ గారు. ప్రకాశకులు : నవయుగ ప్రచురణాలయము, పెదపవగల్లు, కృష్ణాజిల్లా.

### అబలానచ్చరిత్రరత్నమాల

భారత వీరనారీమణుల జీవితసంగ్రహములు. పునర్ముద్రణము. రచయిత్రి : కీ. శే. భండారు అచ్చమాంబగారు. ప్రకాశకులు: కొమర్రాజు వినాయకరావుగారు, అభ్యుదయప్రెస్, బెజవాడ. వెల రూ ౨-౮-౦.

### భాగవత కథ

రచయిత : ప్రభుదత్త బ్రహ్మచారి మహారాజుగారు. అనువాదకులు: కుందుర్తి వెంకటనరసయ్యగారు. ప్రకాశకులు : శ్రీ సీతారామనామసంకీర్తన సంఘము, గుంటూరు. వెల రూ. ౨-౦-౦.

### నేతాజీ

పద్యకావ్యము. రచయిత : జి. జాషువగారు. వెల రూ. ౧. ప్రతులు భీమవరం వాణీ బుక్ డిపోలో లభించును.

### నేతాజీ

ఇంకొక పద్యకావ్యము. రచయిత : వి. మాలకొండారెడ్డిగారు, అల్లూరు, నెల్లూరుజిల్లా. వెల రూ. ౧-౦-౦.

### అర్ఘ్యాతము

శ్రవ్యనాటిక. రచయిత: రాచకొండ నరసింహమూర్తిగారు. ప్రాప్తిస్థానము: కవికుమార పరిషత్తు, వినయాశ్రమము, వయా పొన్నూరు. వెల అ. ౮.

### త్యాగరాజచరిత్ర

వచనము. రచయిత: యోగి శ్రీ శుద్ధానంద భారతి, ప్రకాశకులు: సాధనగ్రంథమండలి, తెనాలి. వెల అ. ౮.

### ప్రేమభిక్ష

పద్యకావ్యము. కర్త: భట్టారం గోపాలనందరయ్యగారు. ప్రకాశకులు: దుర్గా మాడరన్ బుక్ డిపో, బెజవాడ. వెల అ. ౧౦.

### హారీతి

కథలసంపుటి. హిందీకి అనువాదము. అనువాదకుడు: సుబ్బారావుగారు. వెల రూ. ౧.

### తల్లిలేని పిల్ల

కథల సంపుటి, రచయిత: కొడవటిగంటి కుటుంబరావుగారు. వెల రూ. ౧.

పై రెంటికిని ప్రకాశకులు: ప్రజాసాహిత్య పరిషత్తు, తెనాలి.

### షెర్లాక్ హోమ్సు కథలు

అనుకరణ: 'వేదమూర్తి'. వెల అ. ౧౦.

### కచుని వీడ్కోలు

పద్యనాటిక. అనువాదకుడు: ఉత్పల సత్యనారాయణాచార్యగారు.

### భారతీయ రినైజాన్సు ఉద్యమము

యం. యన్. రాయ్ గారి రచనకు యస్. కె. వి. అనువాదము. వెల అ. ౮.

పై మూటికిని ప్రకాశకులు: దుర్గా మోడరన్ బుక్ డిపో, బెజవాడ.

## ప్రాణసుధ

క్షీణించిన వీర్యశక్తిని పెంపొందించును. నరములకు పటుత్వమును కండపుష్టి నిచ్చును.
మెదడుతో పని చేయువారికి ఆత్మమిత్రము.

పక్షవాతమునకు అమోఘమయిన ఔషధములు

**క్షీరబల** (101 సార్లు ఆవర్తితము)

**అయవీరము**

వాడిచూడుడు, తృప్తిచెందుడు.

కన్సల్టింగు ఫిజిషన్:—
ఆయుర్వేదాచార్య ఎన్. మాధవమీనన్
ఎ. ఎం. ఎ. సి.

**మలబార్ ఆయుర్వేదిక్ స్టోర్సు**
నెం. 107-108, బ్రాడ్వే, మదరాసు

### సభలు—సమావేశములు

రచయిత: గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు. వెల రూపాయి పావలా.

### వయోజనవిద్య—బోధనక్రమము

రచయిత: గాడిచర్ల హరిసర్వోత్తమరావు గారు. వెల రూపాయిన్నర.

### గ్రంథాలయశాస్త్ర ప్రథమపాఠములు

రచయిత: పాతూరి నాగభూషణంగారు. వెల రూ. ౨-౮-౦.

పై మూడును దేశికవితామండలి (బెజవాడ) ప్రచురణలు.

**Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No, 7, Thambu Chetty St., G. T., Madras. Editor—S. Sambhu Prasad.**